శ్రీ

# శ్రీ అరవింద దర్శనము

అనువాదకులు

బ్రహ్మశ్రీ వేలూరి. చంద్రశేఖరంగారు

# విషయసూచిక

శ్రీ

# విన్నపము

---

శ్రీ అరవిందులు రచించిన వేద వేదాంతాది శాస్త్రవిచారముల సారమును ఆంధ్రలోకము గ్రహించుట కనువుగా, శ్రీవారి యాంగ్లగ్రంథముల సంగ్రహమునో అనువాదమునో ఆంధ్రమున బ్రకటించ వలయునని యొకసంకల్ప ముదయించినది. తత్సంకల్పానుగుణముగ గావించిన ప్రయత్నమే, భగవానుని యనుగ్రహామువలన శ్రీఅరవిందులపట్ల భక్తివిశ్వాసములుగల మిత్రుల తోడ్పాటువలన, నిపు డీ గ్రంథరూపమున — ప్రథమపుష్పముగా — ఫలించినది.

శ్రీ అరవిందులు తమ యోగానుభవ జన్యమగు జ్ఞానమును తత్త్వవిమర్శపూర్వకముగా వెల్లడించిన 'ఆర్య' మాస సంచికయందు ప్రప్రథమమున బ్రకటించి

నది భాగవత జీవనము (Life Divine) ను గుఱించియే. ఆగ్రంథమున శ్రీవారే సారసంగ్రహముగా రచించిన కడపటి ఐదధ్యాయముల ఆంధ్రానువాదమే ఈ 'శ్రీ అరవిందదర్శనము'.

అన్యభాషయగు నాంగ్లమునుండి యనువదించుట సులభముగాదనుట నందఱెఱింగినదే. భావములందు, పదములకూర్పునందు వాక్యనిర్మాణమునందు క్రొత్తపోకడలకు దారితీసిన శ్రీ అరవిందుల గ్రంథముల ననువదించుట కష్టతరము. మఱియు శ్రీ అరవిందుల 'భాగవతజీవనము' నాంధ్రీకరించుటకు సంస్కృత - ఆంధ్ర - ఆంగ్ల భాషలందు పాండిత్యమును, శ్రీ అరవింద యోగసాధనా తత్త్వవిచార సమ్యక్పరిచయమును, శాస్త్రీయ సంస్కారముగల ప్రజ్ఞావిశేషమును అత్యంతావశ్యకములైన యోగ్యతా సంపత్తులని తలంపనగును. దుర్లభమగు నిట్టి అనువాదాధికారసంపత్తి గల బ్రహ్మశ్రీ వేలూరి చంద్రశేఖరంగారు నా ప్రార్థన నంగీకరించి ఈగ్రంథమును రచియించియిచ్చి ఆంధ్రలోకమునకు మహోపకార మొనర్చినందుల కెంతయు కృతజ్ఞుడను.

శాస్త్రీయ విచారణా ప్రధానము దర్శనము; అనుష్ఠాన ప్రధానము యోగము. దర్శన ప్రతిపాదిత సిద్ధాంతము యోగానుభవమునకు మార్గమును సిద్ధము చేయును; యోగానుభవ ప్రాప్తమైన తత్త్వమును దర్శనము సయుక్తికముగ శాస్త్రరూపమున సిద్ధాంత మొనర్చును. అనువాదకు లీ విషయమును తమ 'ప్రవేశిక' లో సూచించి చదువరుల కనేక దార్శనిక సిద్ధాంతముల బరిచయ మొనర్చి తుదకు శ్రీ అరవిందదర్శనమును సంక్షేపముగ వెల్లడించియున్నారు. మఱియు వారు ప్రాచ్య పాశ్చాత్య — ప్రాచీన నవీన భేదములుగల ఆరంభ పరిణామ వాదములను, ద్వైత-విశిష్టాద్వైత-అద్వైత దృష్టులను సంగ్రహముగ నుల్లేఖించి, బహు దర్శన తారతమ్య పరీక్షాపూర్వకముగ శ్రీ అరవింద సిద్ధాంతస్వారస్యమును జూపెట్టియున్నారు. అతిగహనము దుర్బోధము నగు నీవిషయముయొక్క వివరణము విమర్శకులు తత్త్వజిజ్ఞాసువులు నగు నాంధ్రులకు మిక్కిలి సాహాయ్యకారిగా నుండగలదని తలంచెదను.

ఈ గ్రంథ ముద్రణవ్యయమున అర్ధభాగము భరించిన మిత్రులకును, ఈగ్రంథమును ఇంకను నేను

ప్రకటించ నెంచు శ్రీ అరవిందగ్రంథములను తమ ఆంధ్రగ్రంథమాలపక్షమున విక్రయించుటకు వలయు నదుపాయము లొనర్చి అత్యంతము సాయపడుచున్న శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు గారికిని నా కృతజ్ఞతా నమస్కారముల నర్పించుచున్నాను.

శ్రీ అరవిందాశ్రమము
పుదుచ్చేరి
౮-౮-౩౬

ఇట్లు విధేయుఁడు
చ. వేంకటకృష్ణయ్య
ప్రకాశకులు:



# ప్రవేశిక

---

ఈ ప్రపంచ మేమి? ఇం దంతఃపాతి యైన యీ నే నెవ్వరు?' — అని ప్రతివానికిని ఎదురఁ బడునది యీ ప్రశ్న. చిరకాలము నుండియు అనేక సమాధానము లీ ప్రశ్నకు; ఈ సమాధానములనే మనము దర్శనము లనుచున్నాము. కార్యజాతముయొక్క పరిణామప్రక్రియ నింద్రియజ్ఞానము చాలవఱకు గ్రహించినను, దానియొక్క తత్త్వమును, మూలమును ఈ యింద్రియజ్ఞానమును దాఁటిన యొకానొక దృష్టికిఁగాని గోచరింప వను హేతువుచే, ఈ సమాధానములకు దర్శనము లనుపేరు.[౧]

“ఈ ప్రపంచముయొక్క సత్యమిది, ఈ ‘నేను’ యొక్క యథార్థ మిది” అని చెప్పుటతోడనే ఈ

---

౧. ఈ పదము వ్యాప్తిచే, కేవల మింద్రియ ప్రత్యక్షమునే ప్రమాణముగా నంగీకరించు లోకాయతికాది మతములకును వర్తింపఁ జేయఁబడినది. ఈ వ్యవహారమున, జగమునుగూర్చిన ఏదో ఒకానొక దృష్టి దర్శన మగుచున్నది.

దర్శనములయొక్క కార్యము పర్యవసాన మగుటలేదు. ఏదృష్టియొక్క ఆలంబనముచే ఇవి గ్రహింపఁబడినవో ఆ దృష్టి మనకు లభించెడు మార్గముల నవి ప్రదర్శింప వలయును. చిరకాలము నుండియు ఈమార్గములును అనేకవిధములు—వీనినే మనము యోగము లను చున్నాము.

ఒకానొక ధర్మము, మతము, సంప్రదాయము, లేక గురువుయొక్క బోధయందు దర్శనము కేవలము జ్ఞానభాగ మన్నచో, యోగము ప్రయోగభాగ మన వచ్చును. ఉపనిషత్తు లందలి దర్శనమునకును, అందలి ఉపాసనలకును, అధ్యాత్మయోగములకును ఇదే సంబంధము. అట్లే సాంఖ్యమునకును పాతంజల యోగమునకును; అందుకనియే పాతంజలము సాంఖ్యశాస్త్రము నందలి ద్వితీయభాగముగా కొందఱిచే పరిగణింపఁ బడినది.

ఇచట ప్రసక్తమైన విషయము శ్రీ అరవింద దర్శనము. శ్రీ అరవింద యోగమును ముందు ముందు చదువరుల కందింపవలయు నని ప్రకాశకుల అభిలాష. కాని అంతకుపూర్వము దర్శన సిద్ధాంతములతో కొంత పరిచయ ముండుట యవసరమని, మొదట దర్శనభాగము గైకొనఁబడు చున్నది. శ్రీ యరవిందుల దార్శనిక

విచారణ యంతయు ఇచట నిర్వహింపఁబడ లేదు; కేవలము ఆ విచారణయొక్క తుదిఫలితములు, నిగమనములు మాత్రము సూచింపఁబడినవి. 'Life Divine'— అనఁగా 'భాగవతజీవితము' అను శీర్షిక క్రింద వ్రాయఁబడిన వ్యాసపరంపరయందు శ్రీ అరవిందుల దార్శనిక విచారణ ప్రధానముగాఁ గలదు. అందలి కడపటి అధ్యాయముల యందు ఆ విచారణయొక్క ఫలితములు సంగ్రహింపఁబడినవి. ప్రకృత మీ గ్రంథమా అధ్యాయముల ననుసరించి వ్రాయఁబడినది; సంక్షేపము కొఱకును, ప్రతిపత్తి సౌకర్యము కొఱకును ఐన కొద్ది భేదములతో ఇది యనువాదమే యనవచ్చును.

***

దర్శనమునకు విషయ మీ యునికియొక్క యాథాత్మ్యము, తత్త్వము, మూలము. కాని దీని నన్వేషించుట యెట్లు? నైయాయికమైన ప్రమేయ పరిశీలనచే లేక ప్రకృతివిజ్ఞానము (Science) యొక్క అన్వేషణ విధానముచే ఏల కాఁజాలదు? ఏల కాఁజాలదన, న్యాయపరీక్ష తత్త్వమును చేరలేకున్నది, కావుననే తత్త్వము విషయమున నది శ్రుతి సంప్ర

దాయముల నాశ్రయించుచున్నది; లేదా బుద్ధి వివేచనచే వస్తువుల స్వభావ మవధరింపఁబడుట లేదనియు ఆలోచించినంతనే అవి విశీర్ణము లగుచున్నవనియు తెలుపుచున్నది.[౧] మఱియు ప్రకృతియందలి ద్రవ్యముల యొక్కయు శక్తుల యొక్కయు కూర్పును గూర్చినట్టియు చర్యను గూర్చినట్టియు జ్ఞానము విషయమునను, ఆ

---

౧. "బుద్ధ్యా వివిచ్యమానానాం స్వభావో నావధార్యతే।... యథాయథాఽర్థాశ్చింత్యంతే విశీర్యంతే తథాతథా॥" సర్వదర్శన సంగ్రహము. దీనిని నేటి యొక సుప్రసిద్ధ పదార్థ-వైజ్ఞానికుని యీమాటతో పోల్చి చూడనగును: "ఎదురుపడి చూడనంతవఱకే పదార్థమును గూర్చిన మన భావన పరిస్ఫుటముగా నుండును. దానిని వివేచింతుమేని మాసిపోవుట కారంభించును."—"Our conception of substance is only vivid so long as we do not face it. It begins to fade when we analyse it." The Nature of the Physical world. Sir. A. S. Eddington. కాని బుద్ధియొక్క గ్రహణ కసలు వాస్తవమంతయు అందకపోయినను వాస్తవముయొక్క ప్రకారము లందుచున్నవి. వాస్తవముయొక్క గంధమేనియు బుద్ధి కనుఁగొన లేదందుమేని, సంశయ వాదమునందో (Scepticism), శూన్యవాదమునందో లేక దాని సహోదర మగు మాయావాదమునందో పడవలయును. పడి లోకయాత్రయొక్క జరుగుబాటుకోసము సంశయవాదియొక్క విశేషాధికారమును The privilege of the sceptic — Hume), స్వప్నవద్వ్యవహారమును, లేక - దీని పర్యాయపద మిది - వ్యావహారిక సత్యత్వమును చేయూఁతగా అవలంబింపవలయును.

జ్ఞానము ద్వారమున వానిపై వశిత్వము విషయమునను మన కత్యంత ముపకరించియు, ప్రకృతి విజ్ఞానము వాని స్వ స్వభావమును మనకు తెలుప లేకున్నది ; కావుననే భౌతిక ప్రాణ మనో ధాతువుల రూప-క్రియా ప్రక్రియల (Form and Process) నతి కౌశలముతో పరీక్షించియు వాని తత్త్వము నందుకొన లేకున్నది. కావుననే ప్రకృతి విజ్ఞానముల ననుసరించు తత్త్వశాస్త్రమేనియు, 'ఈ ప్రకృతి వెనుక, ఈ ప్రకృతి కాధారమై ఈ ప్రకృతి హృదయమం దొకానొకటి కలదు, అది అజ్ఞేయము' అని సూచించుచున్నది. దీనికి కారణ మీ విచారణ యంతయును మనోబుద్ధులపై నాధారపడి యుండుట; స్వ స్వరూప జ్ఞానము వీనిశక్తికి మించినది — బుద్ధి యొక్క స్వలక్షణము చేతనే అది ఆర్జించెడు జ్ఞానమంతయును ఈ అసామర్థ్యమునకు లోగియున్నది - ఆ జ్ఞానము భేదముపై ప్రతిష్ఠింపఁబడినది, వ్యవహితము; మన స్వగత సత్తయొక్క స్వానుభవముతో పోల్చిచూచినచో ఒకవిధముగా పరోక్షము. వస్తు తత్త్వము సాక్షా దనుభూతికిఁగాని లభింపదు; అయ్యది తాదాత్మ్య జ్ఞానముచేగాని ఘటింపదు. ఒకవిధమగు తాదాత్మ్య జ్ఞానముచేతనే మనలోని యవస్థాభేదములను, మన హృదయమందలి రాగాది వికారములను

మన మెఱుఁగుచున్నాము. తాదాత్మ్యముచేఁ గలిగిన ఈ సాక్షాదనుభవము మనయందు లేకుండెనేని, పరుల యందలి ఈ అవస్థలును, వికారములును మన కెన్నఁడును బోధపడకుండెడివి. ఇట్టి సాక్షాదనుభవమునం దీ యునికి గ్రహింపఁబడునేని, దాని తత్త్వము మన యెఱుక కందును. కాని యీ యునికి దేనితో నిర్మింపఁబడినదో అది, అనఁగా ఈ సృష్టియొక్క ఉపాదానము, మన స్వసత్తకు విజాతీయమైన పదార్థ మయ్యెనేని, వెలినుండియే దానిని మన జ్ఞానము పరీక్షింపవలయును. దానితత్త్వమును తాదాత్మ్యజ్ఞానముచే నెన్నఁడును పడయనేరదు. ఇఁక వేదాంతము యొక్క యుపలబ్ధి, ఈ యునికియంతయు ఒక్కటియే యని— 'ఏకం సత్'. కావున తాదాత్మ్యజ్ఞానమునకే ఇచట నధికారము. భేద ప్రతిష్ఠితమైన మానస జ్ఞాన ముపకరణముగాఁ గల యే పరిశీలనచేతను ఉనికి యొక్క అసలు రూపును మన మందుకొనలేము; ఐక్య జ్ఞానము వలని అపరోక్షానుభవముచేతనే దాని నందవలయును.

అదిగాక బుద్ధియొక్క పరిశీలనయందు ఈయునికి యొక్క తత్త్వ మజ్ఞేయమే అయ్యును చేతనా సధర్మ మగునని భాసించునేని, అనఁగా ఈ ప్రకృతిప్రకారముల అంతరమున గోచరించెడు శక్తియందు చేతనా

లక్షణములతో సజాతీయములై తోఁచు లక్షణములు నిరూపింపఁబడునేని, అప్పుడును తత్త్వాన్వేషణము ప్రకృతి విజ్ఞానముయొక్క పంథచే నిర్వర్తింపఁబడఁ జాలదు.౧ ఏలన ప్రకృతి విజ్ఞానముయొక్క బాహ్యాపరిశీలన మిచట నుపకరింపదు. మనసునందుఁ బ్రవేశించి, అచటి యంతర్-ద్వారములఁ దెఱచి, చేతన (Consciousness) యొక్క సర్వరూపమును దెలియ యత్నింపవలయును. ఇదియే వేదాంతముయొక్క మార్గము. ఏలన దాని యుపలబ్ధి, మూలతత్త్వము చైతన్యమని, చిద్ధాతువగు దాని ప్రకారములే చేతనయొక్క సకలభేదములని, సత్తయగు దాని రూపములే భూతజాత మంతయు నని. ఈ హేతువుచేతనే 'ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞాన' మను వేదాంత ప్రతిజ్ఞ. కావున ఈ యునికి

౧ ఇచట ఈక్రిందివాక్యమునందలి భావము గమనింపఁదగును:—"మనసే మూలసత్యమని నిర్ధారింపఁబడునేని, పదార్థవైజ్ఞానికుఁడు పదార్థతత్త్వమును వివరించు పనిని కడకు మనోవైజ్ఞానికునకు విడువవలసి వచ్చును......"and the physicist...may, if mind should prove to be the ultimate reality, have eventually to leave to the psychologist the task of explaining what matter *is*.'' (Dr. William Rose. Introduction to An outline of Modern Knowledge). కాని అప్పుడు మనస్సుయొక్క బాహ్యాచర్యను పరీక్షించు మన శ్శాస్త్ర్రము పకరింపదు.

యొక్క తత్త్వమును జేరుమార్గ మంతర్ముఖము, లోనం బ్రవేశించి మనోబుద్ధుల మించియున్న మన చేతన యొక్క సకల విస్తృతియందును జాగరూకుల మగుట, అచటి తాదాత్మ్యజ్ఞానముచే ఈ యునికి సకలము యొక్కయు సత్యమును సాక్షాదనుభవమునం దారూఢము చేసికొనుట.

***

మూలతత్త్వము చైతన్య మను విషయమునందు దర్శనముల నడుమ వివాద లేదనవచ్చును. అతీంద్రియ మగు స్వానుభవముపై లేక ఆప్తానుభవముపై నిర్మింపం బడిన వివిధమతములును ఈ చైతన్యమునే సృష్టికి మూలముగా నాశ్రయించుచున్నవి. కాని యీ వివాద లేమి యింతవఱకు మాత్రమే. మిగిలిన కథయంతయు వివాదగ్రస్తము. చైతన్య మీ జగము నెట్లు సృజించు చున్నది, ఈ బహుత్వమును భేదమును ఎట్లు కల్గుచున్నవి, ఈ జీవుల తత్త్వమేమి అను నిట్టి సర్వవిషయములందును విప్రతిపత్తి, వివాద. అనుభవమూలము లని తమ్ము ప్రఖ్యాపనచేసికొను ఈ దర్శనములయం దింతభేద మేల కలుగవలయును ?

దీనికి కారణము మానసికజ్ఞానముయొక్క స్వభావము. అనుభవప్రాప్తమైన తత్త్వజ్ఞానమును మనస్సు తనభావముల లోనికిని, భాషలోనికిని అనువదింపవలయును. కాని యీమనస్సు భౌతికప్రపంచమునందలి వ్యవహారముకొఱకై ఏర్పడినట్టియు, ఆ వ్యవహారముచే ఆకారింపఁబడినట్టియు ఉపకరణము. భేదప్రధానమీ భౌతికప్రపంచము; ఆ హేతువుచే భేదప్రతిష్ఠితమీ మానసికజ్ఞానము. మానసికజ్ఞానమందు ఐక్యబహుత్వములు, భేదాభేదములు, నిత్యత్వవిక్రియాత్వములు, ఆనంత్యాంతవత్త్వములు, ప్రవృత్త్యుదాసీనత్వములు లోనగునవి పరస్పరవిరుద్ధములైన ధర్మములు; ఒకేకాలమునందొకేచోట నిలువ నేరనివి. నిష్ప్రదేశమును, కాలపరివర్జితమునై, ఈ విరుద్ధధర్మముల మించియును వీనికాధారమును, అధిష్ఠాత్మకమును, మూలమును, గమ్యమునైయున్న యొకానొక అతీతతత్త్వమనుభవబలముచే భానమైనప్పుడు, ఈ బుద్ధి దాని నేచందమున గ్రహించును, ఏ విధమున తెలుపును? దాని నిది స్వస్వభావముచేత నే, స్వవ్యాపారధర్మముచేత నే సంపూర్ణముగా గ్రహింపఁజాలదు, తెలుపఁజాలదు. ఐనను తనస్వభావము నయ్యతీత తత్త్వగ్రహణ కనువుగా సూక్ష్మమగునట్లు పరిణమింపఁజేసియు, స్వవ్యాపారమును నూత్నపరిసర

మున కలవఱచియు, సత్యముయొక్క కృత్స్నబింబము నోర్పుతో మొఱికిపోవనిరీతి తనయందు ప్రతిబింబింపఁ జేసికొనఁగలదు. లేదేని యిప్పటి అనుభవ మంతయు కల్లయని గాని, లేక యిప్పటి అనుభవమునకును అతీతానుభవమునకును ఏదో విధమైన సంధిని పొసగించి ఐక్య బహుత్వాదులగు ప్రతియోగి ధర్మములం దొక దానిని సత్యముగా స్వీకరించి అన్యమును నిరాకరించి గాని, ఉపాధిభేదముచే లేక అవస్థాభేదముచే ఉభయము లును సత్యములని గాని, ఇట్లేదో ఒకత్రోవ నాశ్రయింప వలయును. ఈ హేతువుచేతనే అనుభవ మూలము లయ్యును దర్శనము లనేకశాఖలుగా చీలుచున్నవి, శ్రుత్యాధారములయ్యును శాస్త్రములు బహుముఖము లగుచున్నవి. కావున తత్త్వముయొక్క బుద్ధ్యతీతా నుభవమును పురస్కరించుకొని బుద్ధిచేసిన నిర్మాణము లీ వివిధమతములు.

మత వైవిధ్యమునకుఁ గల ఈ హేతువు నొకసారి గమనించితిమేని, సర్వమతములకును సంవాదమును సాధించుట సులభమగును. తత్త్వముయొక్క సమగ్రాను భవము బుద్ధికి సంపూర్ణముగా సాధ్యము కాకున్నను, ఆ కారణముచే బుద్ధికి సర్వవిధములను తృప్తికరమగు నొకతత్త్వదర్శనమును నిర్మించుట వీలుకాకున్నను,

మనఃకల్పితమైన చట్రమునందు వాస్తవమును బంధింపఁ జూచుట పొసగనిదయ్యును, తత్త్వానుభవమును భంగింపని విపులరేఖలయందు దానిరూపును కొంత సూచింపవచ్చును, కృత్స్నదృష్టియందు బుద్ధిని ప్రవర్తింపఁజేయవచ్చును. ఇట్టి దృష్టియందు సర్వమతములును అనివార్యముగా ఏకీభావమును బడయఁగలవు. ఇట్టి కృత్స్నదృష్టి శ్రీ అరవింద దర్శనముచే ప్రసాదింపఁబడుచున్నది. దీనిని సముచ్చయాద్వైతము, సమన్వయాద్వైతము, లేక సంయోజకాద్వైతమ[౧]నవచ్చును. ఏలన ఇయ్యది ఐక్యమునే నిజమని స్వీకరించి, బహుత్వమును కల్లయనదు; కూటస్థ నిత్యమునే యథార్థముగాఁ గైకొని, పరిణామమును మోసమనదు; నిష్క్రియత్వమే పరమార్థమని ప్రవృత్తిని భ్రాంతి యనదు; అక్షరమునే సత్తయని, క్షరము నసత్త యనదు. లేక ఐక్యమును త్రోసిపుచ్చి బహుత్వమే నిజమనదు. లేక నిష్క్రియత్వము పురుషునందనియు, పరిణామము ప్రకృతియందనియు ద్వైతమును స్థాపింపదు. మఱియును ఈ కృత్స్న దృష్టియందు ఆరంభపరిణామ వివర్తవాదములు లన్యోన్యాసహత్వమును వీడి మైత్రియందు సమన్వితము లగుచున్నవి.

---

౧ Synthetic Monism.

బుద్ధ్యనవగాహ్యమైన చైతన్యతత్త్వము బుద్ధిచే బహుప్రకారముల నుత్ప్రేక్షింపఁబడుచున్నది; దాని అద్వితీయత్వ కేవలత్వాద్యనుభవము బుద్ధిచే బహు భంగుల వ్యాఖ్యానింపఁబడు చున్నది. అసత్తు లేక శూన్యమే పరమతత్త్వమని ప్రతిపాదించు సుప్రాచీన బౌద్ధవాదములును చైతన్యముయొక్క ఒకానొక భానము నాశ్రయించియే ప్రారంభించియుండు ననవచ్చును. ఏలన ఉపనిషత్తులచే బ్రహ్మము లేక చైతన్యము అసత్తు యని, మఱియు అనాత్మ్యమును, అనిరుక్తము నని వర్ణింపఁబడు చున్నది. సకలవిధములైన సంబంధములచే బంధింపఁబడని కేవలత్వముయొక్క అనుభవమును దెలుపుటయే ఇట్టి వర్ణనల తాత్పర్యము. కాని తరువాతి బౌద్ధవాదములు తర్కప్రవాహముసఁ బడి వింత రేవులఁ జేరినవి.

భేదము నంగీకరించియు నైయాయికాది మతములు జీవికిని ఈశ్వరునకును సజాతీయత్వమును ప్రతిపాదించుచున్నవి: "ఈశ్వరుఁడాత్మ ప్రకారుఁడు, ఆప్త కల్పుడు"[౧] కూటస్థనిత్యమును అపరిణామియు నగు

౧ "గుణ విశిష్ట మాత్మాంతర మీశ్వరః. తస్య ఆత్మకల్పాత్ కల్పాంతరా నుపపత్తిః......ఆప్తకల్పశ్చాయం—"

"గుణములు కలట్టిది, వేఱొక యాత్మ— ఇదియే ఈశ్వరుఁడు. ఈశ్వరుఁడాత్మప్రకారమునకు లేక ఆత్మయొక్క జాతికి చెందుటచే

చైతన్యమే పురుషుఁడని సాంఖ్యమతము ; ఐనను పురుషులనేకులు. ఇఁక వేదాంతమతములం దొకటియగు మధ్వమతము జీవునకును భగవంతునకును భేదము నీవిధముగా నంగీకరించుచున్నది. భగవదంశయే జీవుఁడు; కాని స్వాంశ కాదు, విభిన్నాంశ. కావున భేదము యథార్థము. ఐనను సారూప్యము లేక సాదృశ్యమువలన నైన ఐక్యము లేకపోలేదు ; కాని అది స్వరూపైక్యము గాదు. మఱియు భగవంతుఁ డనంతగుణుఁడు. విశిష్టాద్వైత మనఁబడు రామానుజ మతమునందు జీవుఁడు పరమాత్మయొక్క శరీరము, కావున బ్రహ్మాత్మకుఁడు. ప్రళయమునందు జీవులును జగమును సూక్ష్మదశను బడసి పృథగ్భావము గోచరింపని విధమున బ్రహ్మమునందు విలీనములై యుండును; జగజ్జీవ విశిష్ట మైన ఈ బ్రహ్మమే అద్వితీయమగు ఏకతత్త్వము. కాని భేదమును, అభేదమును, భేదాభేదములును యథార్థమే. సర్వమును బ్రహ్మముయొక్క శరీరము, ప్రకారము, విశేషము. కావున అభేదము. ఒకటే బ్రహ్మము అనేకము లగు చిదచిత్ప్రకారములయందు నానాత్వమున నుండుటచే భేదాభేదము. జడమునకును, జీవులకును, ఈశ్వరునకును స్వరూపస్వభావము

---

వేఱొక జాతిగా చెప్పుట వలనుపడదు...మఱియు ఇతఁడాప్తుని వంటివాఁడు..."—న్యాయదర్శనము ౮-౨౧. వాత్స్యాయనభాష్యము.

లందు వైలక్షణ్యా ముండుటచే, ఇవి యొకటితో నొకటి కలిసిపోని వగుటచే భేదము. మఱియు అనంతగుణము లీశ్వరునియందు. శంకరాద్వైతము కల్లకపటము లేని రీతిని చైతన్యముయొక్క అద్వితీయత్వము నాశ్రయించు చున్నది. కాని దీనికై ప్రపంచమును కల్లకపటము చేయుచున్నది. జీవియొక్క యీ ప్రపంచవ్యవహారము స్వప్నవ్యవహారమువంటిది. స్వప్నము మాయామాత్రము, పరమార్థగంధ మేమియును లేనిది; మెలకువతో విలయమైపోవును. మెలకువయందు, దేశ-కాల-నిమిత్త సంపత్తి గల ఈ ప్రపంచము, స్వప్నము జాగరితము చే వలెఁగాక, అబాధితమై, నిజమైయున్నట్లు తోఁచును. కాని ఇదియును ఆత్యంతికసత్యము కాదు; కడ కభావాత్మకము. పరమాత్మకంటె తా నభిన్నుఁడని జీవి తెలిసికొనినతోడనే ఈ జాగ్రత్ - ప్రపంచమును అప్పటి మెలకువయందు బాధితమగును, కల్లయగును. కేవలమును, నిర్గుణమును సర్వధర్మవిశేషరహితమును, చైతన్యమాత్రాత్మకమును అగు బ్రహ్మమొక్కటియే సత్యము. అవిద్యచే ఆచైతన్యమునం దీ ప్రపంచము కల్పిత మగు చున్నది- పట్టనేలపై యెండమావులవలె, రజ్జువునందు సర్పమువలె. నానాత్వము సత్యముకాదు, మిథ్యాజ్ఞానము యొక్క పంట. ఈ నామరూపము లవిద్యాకల్పితములు;

సర్వజ్ఞుఁడగు నీశ్వరునకు ఆత్మభూతములైనట్టి వనఁ దగినవి; అయ్యును ఈశ్వరుఁడు వీనికంటె నన్యుఁడు. అవి అనిర్వచనీయములు, సంసార ప్రపంచమునకు బీజములు. ఇవియే మాయాశక్తి, లేక ప్రకృతి. ఆకాశము గిన్నె బిందె మొదలగు ఉపాధులయందు వేర్వేఱైనట్లు తోఁచును; అట్లే ఈశ్వరుఁ డవిద్యాకల్పితములైన నామ రూపోపాధులయందు. కావున స్వాత్మభూతములే జీవు లీశ్వరునకు. అవికృతుఁడైన పరమేశ్వరుడే జీవుఁడు, చిద్వివర్తము ప్రపంచము. ఇఁక జీవేశ్వరుల భేదాభేద మును, అనన్యత్వమందునను కార్యకారణత్వమువలని భేదమును, లేక అవస్థాకల్పితమైన భేదమును ప్రతిపా దించు వేదాంతమత ప్రకారము లనేకములు గలవు. భేదమును తత్త్వముగా నంగీకరించిన మతము లన్ని యును పురుష నానాత్వమును స్వీకరించుచు, జడజగ మున కుపాదానముగా పృథివ్యాది భూతములలో నాల్గింటినో, ఐదింటినో లేక నిరవయవములైన చతు ర్విధ పరమాణువులనో, లేక త్రిగుణముల సామ్యావస్థ మైన ప్రధానమునో గైకొనుచున్నవి. మఱియు ఈమత ములు వాని వాని దృష్టి కనుకూలముగా మనుష్యుని పరమార్థమును అపవర్గమని, కైవల్యమని, సాలోక్యా దికమని, బ్రహ్మభూయమనిగాని నిరూపించుచున్నవి.

వివిధ సిద్ధాంతముల ఈ అతి సంక్షిప్త వర్ణనచే ఒక సందర్భము విశదము: చైతన్య తత్త్వము నంగీకరించియు,దాని యనుభవమును బుద్ధి నానావిధములకల్పన చేయుచున్నది. దీనికి హేతువు చైతన్యతత్త్వము సర్వ విలక్షణమును, అతుల్య జాతీయమును అగుట. దృష్ట సామ్యముచే బుద్ధి ప్రవర్తించును. ఈ ప్రపంచముయొక్క భౌతిక ధర్మమే బుద్ధికి సుపరిచితము. దానితో వ్యవహారముకొఱకే ఈ బుద్ధి ముఖ్యముగా ఏర్పడినది; ఆవ్యవహారముచేతనే దాని క్రియా విధానములు సుహూఢములైనవి. వియోజన సంయోజనములు (Analysis and Synthesis) దాని రెండుచేతులు. ఖచితముగా తెగి ఒకదానినుండి యొకటి సంపూర్ణముగా భిన్నములైయున్న వస్తువులపై బుద్ధి తన యీ ప్రక్రియలను ప్రయోగించును. భూత ధాతువుయొక్క రూపములు పరిచ్ఛిన్నములు, కావున పరిచ్ఛేదమే బుద్ధియొక్క పాండిత్యము. కాని ఏకత్వమునందు పృథక్త్వము, నానాత్వమునందేకత్వము అను ధర్మము గల తత్త్వమును బుద్ధి సరిగా గ్రహింపలేదు. భౌతిక ధాతువు విషయమున ఏకమునుండి అనేకము రావలయునన్నచో ఆ ఏకముయొక్క ఖండనమే యుపాయము, అనేక మొక్కటి కావలయునన్నచో వాని నతుకుటయే మార్గము. కాని 'ఏకస్థ

మైన పృథగ్భావము'[౧] బుద్ధికి విస్మయము గొల్పును; ఇందలి ఏకత్వమునో పృథక్త్వమునో సున్న చేయుట కది ప్రయత్నించును. చైతన్యముయొక్క అద్వితీయమైన ఏకత్వమును సాజాత్య సారూప్య సాదృశ్యాది కల్పనలతో, విభిన్నాంశాద్యుపాయములతో సోపచారముగా సాగనంపుట; లేదా పృథక్త్వమును మాయ యను ఇంద్రజాలముతో అంతర్ధానము గావింప నుంకించుట; ఈ ఉభయమును ఈ ప్రయత్నముయొక్క రూపములు. కాని పరస్పర విరుద్ధములై అన్యోన్య వ్యావర్తకములై తోఁచు ధర్మముల జంటలైన ఈ ఏకత్వ నానాత్వములు, కర్తృత్వాకర్తృత్వములు, నిర్గుణత్వానంత గుణత్వములు లోనుగాఁ గలవానియం దొకదానిని త్రోసిపుచ్చి ఒకదాని నాశ్రయించుటకు బదులు, వీని విరోధములను శమింపఁజేయు అనుభవముకొఱకై బుద్ధి ప్రతీక్షింపవలయును; తన మేరను విస్తరించుకొనవలయును; సూక్ష్మదర్శిత్వమునకు వలసిన సూక్ష్మత నలవరించుకొనవలయును; కడకు తన్నుఁదా నతిక్రమింపవలయును. అద్వితీయమగు చైతన్యమునం దీ యేకత్వ నానాత్వాదికము లైన వికల్పములు (Alternatives) పరస్పర వ్యావర్తకములు గావు; భూతధాతువుతోడి తన

౧. యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి. గీత ౧౩-౩౧.

యనుభవముతో బుద్ధి వీనిని పరస్పర విరుద్ధములు గాఁ దలఁచుచున్నది. చైతన్యము తన ఏకత్వ కేవలత్వ నిర్గుణత్వాదులకు భంగములేకయే నానాత్వ సవిశేష సగుణములయం దభివ్యక్త మగుచున్నది. కావున తత్త్వ మీ వికల్పములయొక్క ఉభయపక్షములచేతను బంధింపఁబడనట్టిది.

ఈ ఏకత్వ నానాత్వములను ప్రాణ మనో ధాతువుల సందర్భమున విచారించినచో వాని విరోధము కొంతవఱకంతరించును. ఏలన ఇవి చైతన్యమునకు భూతధాతువుకన్న సన్నిహిత తరములై, దాని ధర్మమును కొంత దగ్గఱగా ప్రతిబింబింపఁ జేయఁగలవు. జీవశరీరమునం దసంఖ్యేయములైన జీవకణములు (Cells). ఇందు ప్రతిజీవకణమునకును దాని స్వతంత్ర వ్యక్తిత్వము, స్వతంత్రజీవితము. ఐనను ఆశ్చర్యము, అవన్నియు కలసి ఒకటే అవయవి, ఒకటేప్రాణము. ఇచ్చట తత్త్వమేమి, ఏకత్వమా, నానాత్వమా? మఱియు మన చేతనయందలి 'నేను' అనుభావమును పరిశీలింతము. ఈ నేనుపై ఏక్షణమునందైనను చూడ్కి నిలుపుదుమేని, అందు కొన్ని ఇంద్రియకజ్ఞానములు (Sensations), కొన్నితలఁపులు, కొన్ని వృత్తులు గోచరించును. వీనిని పురస్కరించుకొని ఈ నేను ననేక మందుమేని, వీని

కాధారమైయున్న చేతనయే కాదని ప్రతిఘటించును. ఏలన దీని యైక్యమునందు మనస్సు చేసిన భేదము లీ ఇంద్రియకజ్ఞానములును, తలపులును, వృత్తులును. కావున ఇచ్చటను తత్త్వమేమి, ఏకత్వ మనవలయునా, అనేకత్వమనవలయునా ? ఏకస్థమైన అనేకత్వము, అనేకస్థమైన ఏకత్వము—ఇదియే తత్త్వమనుట న్యాయ్యము. ఈఏకత్వానేకత్వములు బుద్ధియొక్క అచ్చులు; ఈఅచ్చులలో మొదటిదానియందుఁగాని, రెండవదానియందుఁగాని, లేక ఒకేపర్యాయము రెంటియందుఁగాని తత్త్వమిముడుటలేదు. ఐనను ఏకత్వానేకత్వముల రెంటిని పై చందమున మేళవించుటయే యథార్థమునకు సన్నిహిత మగుచున్నది * బుద్ధియొక్కభాషతో ఈ యథార్థము నింతకంటె సరిగాఁజెప్ప నుపాయము లేదు. ఇట్లే చేతనయొక్క ఉచ్చతరానుభవములయందు సక్రి

---

* పై దృష్టాంతములద్వారమున ఈ భావమును బార్గ్‌సో (Bergson) అను పరాసుతత్త్వశాస్త్రజ్ఞుఁడు చక్కఁగా పరిస్ఫుటము చేసెను. మఱియు జడద్రవ్యములతోడి వ్యవహారముచే పరిణతమై బుద్ధి జడధర్మముల నెఱిఁగినట్లు ప్రాణ మనో ధర్మములఁగూడ ఎట్లు సరిగా నెఱుఁగలేకున్నదో ఆసందర్భమును మిక్కిలి ఆవర్జకముగా ప్రతిపాదించెను.

యత్వ నిష్క్రియత్వములు¹ మైత్రి గొనుచున్నవి. ఈమైత్రి తపోధనుల యాశ్రమమునందు తమ శాశ్వతిక వైరమును మఱచి ఒకదానిప్రక్క నొకటిగా నొదిగి యుండెడు సింహమత్తేభాదుల మైత్రి కాదు. ఇయ్యది

---

౧ ఈక్రింది పంక్తులయందు శంకరుల యభిప్రాయ మిట్టిదిగానే తోఁచుచున్నది. "...అస్తి నాస్తీ త్యాద్యాశ్చ యావంతో వాఙ్మనస యో ర్భేదా యత్రైకం భవంతి........అస్తినాస్తి, ఏకం నానా, గుణవదగుణం, జానాతి నజానా తి, క్రియావ దక్రియం, ఫలవ దఫలం, సబీజం నిర్బీజం, సుఖం దుఃఖం, మధ్య మమధ్యం, శూన్య మశూన్యం, పరోఽహమన్య ఇతివా సర్వవాక్ప్రత్యయాగోచరే స్వరూపే యో వికల్పయితు మిచ్ఛతి, స నూనం ఖమపి చర్మవద్వేష్టయితు మిచ్ఛతి సోపాన మివ చ పద్భ్యా మారోఢుం, జలేచ ఖేచ మీనానాం వయసాం చ పదం దిదృక్షతే..."

"......కలదు లేదు లోనగు వాఙ్మనసభేదము లెన్నిగలవో అవన్నియు నెచట నేకమగునో ... కలదు లేదు, ఏకము అనేకము, సగుణము అగుణము, ఎఱుకకలది ఎఱుకలేనిది, సక్రియము అక్రియము, ఫలముకలది ఫలములేనిది, సబీజము నిర్బీజము, సుఖమైనది దుఃఖమైనది, మధ్యము అమధ్యము, శూన్యము అశూన్యము, అది పరము దానికంటె నే నన్యుఁడను అని గాని, అన్ని మాటలకును తలపోఁతలకును అందని స్వరూపము విషయమున ఎవఁడు వికల్పింప నెంచునో అతఁడు నిజముగా నాకాశమును చర్మమునువలె చుట్టఁబెట్టఁ గోరుచున్నాఁడు, మఱియు దానిని మెట్లనువలె పాదములతో ఎక్కఁ గోరుచున్నాఁడు, నీటియందును మింటియందును చేఁపలయొక్కయు పక్షులయొక్కయు అడుగుజాడలను చూడఁదలఁచుచున్నాఁడు..."

ఐక్యము. కావున బుద్ధికి పరస్పరవిరుద్ధములై తోఁచు ధర్మముల యీ వికల్పములయందు ఒకపక్షమును ప్రతిషేధించి రెండవపక్షము నాశ్రయింతుమేని పూర్ణసత్యము లభింపదు. పూర్ణతరానుభవముచే ఉభయపక్షములను మేళవించినప్పుడే సత్యముయొక్క కృత్స్నబింబము చూపట్టును.

ఈ కృత్స్నతను ద్యోతనచేయుకొఱకే తత్త్వము "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం, తథాఽరసం నిత్య మగంధవచ్చ యత్" (కఠోపనిషత్ 3-15) అని, మఱియు "సర్వకర్మా సర్వకామః సర్వగంధః సర్వరసః... (ఛాందోగ్యము 3-14-4) అనియు, "సదసచ్చాహ మర్జున"(గీత 9-19) అని, మఱియు "నసత్ తత్ నాస దుచ్యతే" (గీత 13-12) అనియు వర్ణింపఁబడుచున్నది. ఈ కృత్స్నతను ద్యోతన చేయుకొఱకే సత్యముయొక్క సకలబింబమును తనకొలఁది పంక్తులలో ప్రతిఫలింపఁజేయు

---

సకల వికల్పములయొక్క ఉభయపక్షములపై రెండుచేతులతో నిషేధముల విసరి కేవలత్వమును నిరూపించు ప్రక్రియ సుపరిచితము. కాని శంకరు లిచట ఆ ప్రక్రియ ననుసరించుట తోఁచదు. చైతన్య తత్త్వమునం దీ ఉభయ పక్షములకును సమన్వయము సూచింపఁబడుచున్నది. శంకరు లీ భావమును సమగ్రముగా ననుసరింపకుండుట దురదృష్టము.

ఈశోపనిషత్తు "అది చలించును, చలింపదు, అది దవ్వున, మఱియు నదియే దాపున, అది సర్వము యొక్కయు లోపల, మఱియు నదియే ఈసర్వమునకును వెలుపల"—"తదేజతి తన్నైజతి, తద్దూరే తద్వదంతికే తదంతరస్య సర్వస్య తదు సర్వాస్యాస్య బాహ్యతః" అని యీ వివిధపక్షములకును పగ నెఱుఁగని ప్రశాంతితో తెలుపుచున్నది. తత్త్వమునం దీ భేదములు పర్యాయక్రమమున కలుగుచున్నవనిగాని, లేక ఉపాధి సంసర్గచే ఉన్నట్లు తోఁచుచున్నవని గాని యనుట యసమంజసము. ఈ ఉభయపక్షములును అవిరోధమున ఏకకాలీనముగా, సమానముగా తత్త్వమునఁగలవు. నిర్విశేషమైన కేవలమే తత్త్వము కాదు; సకలవిశేషములందును తన్నుఁదా నభివ్యక్తము చేసికొను కేవలమును తత్త్వమే. లేక కేవలత్వ సవిశేషత్వములు తత్త్వమునం దవిరోధములై ఏకకాలమున నున్న ధర్మములఁగూర్చిన మానసికబోధ లనఁదగును. నిష్క్రియత్వమే బ్రహ్మము యొక్క నిజమైన రూపనరాదు; ఏలన నిష్క్రియత్వము సక్రియత్వమును బ్రహ్మము సమానముగా సమసమయమున ఊఁదిపట్టియున్నది. అనఁగా దేశకాలాతీతమైన తత్త్వము దేశకాలములందు తన్నుఁదా నభివ్యక్తము చేసికొనుచున్నది.

ఈ కృత్స్నదృష్టి ననుసరించితిమేని శ్రుతిజాల మంతయు సులభముగా సమన్వయమగును; ఏలన నది తార్కికబుద్ధియొక్క కల్పనగాదు, బుద్ధిని మించిన యనుభవముయొక్క నిర్దేశము. మఱియు నీ దృష్టి ననుసరించితిమేని వివిధమతముల విసంవాదమును చాలవఱకు విడఁదీయఁగలము. శ్రుతివాక్యముల పురస్కరించుకొని వానినుండి వెడలిన విచారణల ననుసరించి మతము లెట్లు పరస్పర ప్రతిపక్షులై నిలిచినదియు చూడఁగలము. ఐక్యమును నిలుపుకొనుటకై భేదమును మిథ్యయన నక్కఱ లేదు; భేదముయొక్క వాస్తవమును స్థాపించుకొనుటకై ఐక్యమును సాదృశ్యములోనికి పరిణతముచేయు నవసరము లేదు. ఏలన ఈ ఐక్యభేదములకు సామంజస్య మనుభవమే చూపఁగలదు. తార్కికబుద్ధివలనఁ గలిగెడు ఈ వైవిధ్యమేగాక, ఒకానొక ప్రత్యేకానుభవమునే*

* "And the mind when it passes those gates (The gates of the Transcendent) suddenly, without intermediate transitions, receives a sense of the unreality of the world and the sole reality of the Silence which is one of the most powerful and convincing experiences of which the mind is capable". Arya Vol. I. P. 135. "అతీతముయొక్క ద్వారములను మనస్సు,

ఆశ్రయించుటచేతను మతము లొండొండ చీలి విరోధ పడుచున్నవి. ఇచటను సమన్వయమును పూర్ణతరమైన యనుభవమే సాధింపఁగలదు.

సర్వమత సంవాదమునకై సుపరిచితమైన యొక ప్రక్రియకలదు: అధికారిభేదము ననుసరించి వివిధమత ములును ఋషులచే ప్రవర్తితములయ్యెననుట, అనఁగా అధికారులందలి మంద మధ్య మోత్తమ తారతమ్యముల ననుసరించి వారివారికి తగినరీతిని దర్శనములును సోపానముయొక్క మెట్లచందమున నేర్పాటుపఁబడిన వనుట. కాని యీ ప్రక్రియ కార్యకారియుఁగాదు, సమంజస మునుగాదు. కార్యకారిగా దేలన, ప్రతిమతమును తానే ఉత్తమాధికారికొఱకై యేర్పడిన దనియు, మందమధ్య ములకై అన్యాన్యమతము లనియు సాధింపఁజూచి, జ్ఞాన సోపానముయొక్క సర్వోచ్చమైన మెట్టును తానే ఆక్ర

అవాంతరదశలలోనుండి క్రమప్రక్రమమునఁగాక హఠాత్తుగా దాఁటి నప్పుడు ప్రపంచముయొక్క అసత్యత్వమును, శాంతబ్రహ్మముయొక్క ఏకసత్యత్వమును అనుభవించును. ఇయ్యది మనస్సునకు సాధ్యము లైన యనుభవములందు మిక్కిలి బలీయము, అత్యంతము ప్రత్యా యకము." దీనిని 'దివ్య పరిణామ వాద' మనుభాగమున (చూ. ౬ పుట ౧౦-౧౨ పంక్తులు) మాయావాద సందర్భమున తెలిపిన విష ముతో అనుసంధింపఁ దగును.

మింప పెరుఁగుచున్నది. ఈ చందము సంవాదమునకు సాధక మగుటలేదు — ప్రత్యుత, వివాదకోలాహల మును మఱింత తుములము చేయుకొఅకు. ఈ విషయ మెట్లైనను ఈ ప్రక్రియ సమీచీనమును గాదు. అధికార తారతమ్యములును, ఆ తారతమ్యముల ననుసరించిన మతసాధనాభేదములును లేవని కాదు. ఆ ప్రసక్తి వేఱు. దానిని పురస్కరించుకొని ఈ తెల్పిన వివిధమతముల కును సంవాదమును సాధింప వీలుపడదు. ఈ అధికార వాదముయొక్క విపరీత పర్యవసానము (Reductio ad absurdum) నాస్తికమతములును పతనార్హులగు "అధి కారుల" యొక్క చిత్తమును మూఢమొనర్చుకొఅకై బుద్ధాదులచే కల్పింపఁబడెనను యుక్తియందు చూపట్టు చున్నది.

మఱియు నిర్గుణమార్గమే విద్వాంసులకనియు సగుణమార్గ మజ్ఞులకనియు, క్రియాదికము పామరుల కనియు, నిష్క్రియత్వము పండితుల కనియు ఎట్లు నిర్ణ యింపవలయును? సగుణత్వనిర్గుణత్వములును, సక్రి యత్వ నిష్క్రియత్వములును అనిర్దేశ్యమునందు బుద్ధికి పొడకట్టు నిర్దేశములు కావా? ఈ రెండు నిర్దేశముల యందును ప్రతిషేధనిర్దేశమునందు ప్రత్యేకాధిక్యమున కేమి కారణము? భావనిర్దేశముచే ఎట్లు బంధింపఁ

బడదో అట్లే ప్రతిషేధ నిర్దేశముచేఁగూడ అనిర్దేశ్యము బంధింపఁబడదు, మఱియు ఈ రెండు నిర్దేశములచే తెలుపఁబడు ధర్మములకును అదియే ఆధారము. అదిగాక ఉత్తమాధికారిత్వము విషయమున శంకింప నవకాశము లేనిమహాపురుషు లనేకులు[౧] తాము త్రొక్కిన సగుణ మార్గములచే, సగుణ నిర్గుణత్వముల తక్కువ ఎక్కువల నొక్కమాటుగా పటాపంచలు చేయలేదా? కావున ఈ యెక్కువ తక్కువలచేతను, సోపానకరణముచేతను మతములకు సంవాదమును సాధింపఁజూచుట వృథా. సంవాదమున కేక మార్గము పైఁ దెల్పిన కృత్స్నదృష్టి.

***

సృష్టిప్రక్రియను గూర్చిన ఆరంభ పరిణామ వివర్తము[౨] లను మూఁడువాదములయందు సకలమతము

---

౧ కాళీమూర్తి నుపాసించిన శ్రీరామకృష్ణ పరమహంస యొక్క దృష్టాంత మిచట నుపకరించును.

౨ "అసతః సజ్జాయత ఇతి సౌగతాః సంగిరంతే. నైయాయికాదయః సతోఽసజ్జాయత ఇతి. వేదాంతినః సతో వివర్తః కార్యజాతం, నవస్తు సదితి. సాంఖ్యాః పునః సతః సజ్జాయత ఇతి." "అసత్తునుండి సత్తు పుట్టుచున్నదని సౌగతులందఱును ఒకేవిధముగా చెప్పుచున్నారు.

లును పంపిడిపోవుచున్నవి. ఇంతవఱకును లేనికార్యము అభావమునుండిగాని లేక భావరూపమైన కారణము నుండిగాని జనించుచున్న దనుట ఆరంభవాదము. సూక్ష్మ దశాపన్నమై యున్న కార్య మభివ్యక్త మగుటయే కార్యోత్పత్తి; కాని నూత్నముగా ఆరంభించునట్టిది లేక జనించునట్టి దేదియు లేదనుట పరిణామవాదము. అద్వితీయ తత్త్వమగు బ్రహ్మము స్వమాయచే కార్య రూపమగు జగముగా ప్రతీతి యగు ననుట వివర్త వాదము.

ఇందారంభ పరిణామములను ముందు విచారింతము. ఈవాదముల విశేషప్రక్రియల నన్నిఁటిని — నిరాత్మక మైన శూన్యమునుండి కార్యోత్పత్తి, వైశేషికుల ద్వ్యణు కాదిక్రమము, సాంఖ్యుల మహదాది కార్యశ్రేణి లోనగువానిని విడిచి, వాని కేంద్రభావములపై దృష్టిని నిల్పుదము. ఏలన ఈ భావముల అనిత్యశరీరము విశేషప్రక్రియలు. ఇఁక నీ రెండువాదములకును పరస్పర విరోధము స్థిరమైయున్నట్లు తోఁచుచున్నది. మఱియు

నైయాయికాదులు సత్తనుండి అసత్తుపుట్టుచున్నదని. వేదాంతులు సత్తు యొక్క వివర్తము కార్యసమూహమనియు, ఇది యథార్థమైన వస్తువు కాదనియు తెలుపుచున్నారు. ఇఁక సాంఖ్యులు సత్తనుండి సత్తు పుట్టుచున్న దని.” సర్వదర్శనసంగ్రహమ్ము [illegible]

పరిణామవాదము ప్రాదుర్భావమునెడ గాఢతర మైన దృష్టివలెఁ గూడ కాన్పింప వచ్చును. ఆధునికమగు ప్రకృతివిజ్ఞానముచే పరిణామవాదము సార్వభౌమము గావింపఁబడుటచే సృష్టికి లేక ఆరంభమున కించుమించు తావే లేన ట్లగపడుచున్నది.

ఆధునిక పరిణామవాదమును సాంఖ్యపరిణామ వాదమును అత్యంతభిన్నములు. పక్షులు సరీసృపముల నుండియు (Reptiles ), సరీసృపము లనూప జంతువుల నుండియు (Amphibians-నీటను నేలను బ్రదికెడునట్టివి), అనూపములు చేఁపలనుండియు పరిణమించెనని విన్నచో కపిలుఁడు విస్తు పోఁగలఁడు. ఐనను ఈ రెండువాదము లందును నెలకొనియున్న కొన్ని కేంద్రభావములందలి పోలికల పురస్కరించుకొని మాత్రమే ఈ వాదముల నొకటే పేరుక్రింద నిట వ్యవహరించుట. అం దొకభావ మిది, ఉత్పత్తియందు క్రొత్తరూపముగా నేది తోఁచు చున్నదో అది ప్రాంతరూపముయొక్క పరిణామము. వీనినే కార్యకారణములు లేక వికృతిప్రకృతు లనుచున్నాము. ప్రకృతియందలి పరిణామముచేతనే వికృతి తటస్థించు చున్నది. కావున క్రొత్తగా ఆరంభింపఁబడునట్టి దేదియును లేదు. మఱియు ఈ ప్రపంచము పరిణామధర్మము గల యొక ప్రధానముయొక్క, లేక జడద్రవ్యముయొక్క, లేక

జడశక్తియొక్క విక్రియాస్వరూపముగా నిర్ధారింపనగు నేని సృష్టికార్యమునకై వేఱొకశక్తిని అవాంతరముగా రావింపఁ బనియుండదు. కాని ఆరంభవాదము కార్యమును అవిద్యమానపదార్థముయొక్క ఆత్మలాభ మని ప్రతిపాదించుచున్నది. ఈ విధమున నీ రెండువాదములును విరోధపడియున్నవి.

కాని యీ విరోధ ముపరిగతము. కార్యకారణభావముయొక్క ఒకయంశపై ఆరంభవాదమును వేఱొకయంశపై పరిణామవాదమును నిలువఁబడి అన్యోన్యము ప్రతిఘటించుచున్నవి. ఈ వాదముల విశేష విచారణ కిది తావుగామిచే, వీనికి సామంజస్య మెట్లు పొసఁగుచున్నదో ఆ సందర్భము నిట దిఙ్మాత్రముగా సూచింపనగును. పరిణామము ప్రకృతి వికృతుల సంబంధము విషయమున సూక్ష్మతరమైన జ్ఞాన మిచ్చుచున్నదనుమాట నిజమే. కాని ఉత్పత్తి, లేక కార్యప్రాదుర్భావముయొక్క రహస్యమంతయు నది వెల్లడించుటలేదు. ప్రకృతినుండి వికృతి పుట్టినప్పుడు,— ఒక సాధారణదృష్టాంతమును గైకొందము — విత్తునుండి మొలక, మొలకయందుండి పుష్పఫలములు కాన్పించినప్పుడు 'ప్రకృతియందు సూక్ష్మదశలో నున్న పదార్థములే అభివ్యక్తము లగుచున్నవి గాని నవీనమేమియును

ఆరంభమగుటలేదు' అనుట సంపూర్ణసత్య మగునా? మఱియు సూక్ష్మదశయం దంకుర పత్రపుష్పఫలాదులు బీజమునం దున్న వనఁగా, వానిని ప్రసవించుశక్తి బీజమునఁ గలదనుట కావలయును గాని, అవియే సూక్ష్మపరిమాణమున గర్భమునందు శిశువువలె బీజమునందు కలవనుట కాఁజాలదుకదా. బీజావయవములు పూర్వవ్యూహమును విడిచి అభినవ సంయోగముచే వ్యూహాంతరమును బొందుచున్నవి, వ్యూహాంతరముచే అంకురము పుట్టుచున్నది. ఈ పూర్వవ్యూహము మాఱి నూత్నవ్యూహము ప్రాప్తమగు క్రమము పరిణామము. కాని యీమార్పుయొక్క క్రమము మార్పుయొక్క రహస్యమును లేక తత్త్వమును మనకు బోధచేయలే దనుమాట యటుండ, వ్యూహాంతరము సంభవించినప్పుడు అభినవమైన యారంభము లేదనుట యెట్లు? ఈ ఆరంభమునకు నిమిత్తమైన సృష్టిశక్తి లేదనుట యెట్లు? కావున కార్యకారణప్రక్రియయం దారంభపరిణామములు రెండును యథార్థమే అనవలయును.

ఐనను ఒకానొక ప్రత్యేక దృష్టాంతమును*

* చదువరులలో కొందఱి కీక్రింది దృష్టాంతము వెంటనే హృదయంగమము కాఁగలదు. ప్రాణవాయువును ఉదజనియు (Oxygen

గైకొని దాని విమర్శచే కార్యకారణభావముయొక్క తత్త్వమును నిరూపించు యత్నమునందు ఈ వివాద యంతయును పదములయందలి వివాదగా కాన్పించ వచ్చును. ఇట్టిసందర్భమున చేయవలసినపని విమర్శ క్షేత్రమును చాలినంత విరివిచేయుట, మఱియు విచార్య విషయమున సంలగ్నములైయున్న ధర్మముల లేక సూత్రములయొక్క పూర్ణఫలితములను పరిశీలించుట. 'కారణద్రవ్యమునందలి అవయవముల అభినవ సంయోగముచే కార్యద్రవ్యముయొక్క నిష్పత్తి; ఈ అభినవ సంయోగమునకు వెనుక నొకానొక నిమిత్తము; ఈ అభినవసంయోగముచే పూర్వము లేనట్టిది, క్రొత్త దొకటి యారంభ మగుచున్నది; ఇదియే కార్యసృష్టి'— అని ఆరంభవాదము. 'ప్రకృతియందలి మార్పుచేతనే వికృతి; ప్రకృతియందు లోనిమిడి యున్నదే వికృతి యందు వెలువడుట; శక్తి (Potentiality) యందున్న దానికే అభివ్యక్తి (Manifestation). కాన నూతనారంభ

---

and hydrogen) ఒకప్రత్యేక సంయోగమున కలిసినవై నీటి నుత్పన్నముచేయుచున్నవి. పై కారణద్రవ్యములయందే కార్యము సూక్ష్మదశయం దున్నదని యొకదృష్టి; పూర్వము లేనికార్య మిా నీరు, కారణద్రవ్యములందలి అవయవముల నవసంయోగముచే ఆత్మలాభము పడయుచున్నదని యొకదృష్టి.

మనఁదగిన దేదియునులేదు. ఒకధర్మము పోవుచున్నది. వేఱొకధర్మము దానిస్థానము నాక్రమించుచున్నది. మఱియు ప్రకృతిని పూర్ణముగా ఎఱిఁగితిమేని దాని యందుఁ గలుగు మార్పుల వెంబడించుకొనిపోయి వికృతి నెఱుఁగవచ్చును. ఈ మార్పుల సరణియే పరిణామ ప్రక్రియ. ఇది జడప్రక్రియ' - అని పరిణామవాదము. కావున ఆరంభకమైన సృష్టిశక్తిని- ఇది అంతర్గత మన్నను బహిర్గతమన్నను ఆ విచారణ వేఱువిషయము- ఆరంభవాద మాశ్రయించుచున్న దనవలయును; పరిణామవాదమునం దిట్టి శక్తి కవకాశమే లేదనవలయును. ఆధునిక పరిణామవాదమును సాంఖ్యపరిణామ వాదము వలె మొదటమొదట పరిణామప్రక్రియ నిట్లే జడప్రక్రియగా, అనఁగా జడములైన ద్రవ్యసంచలనముల (Matter and Motion) యొక్క నియతవిధానములందు కట్టుపడిన కారణ కార్యసంతతిగా సమర్థింపఁ జూచినది. కాని దాని పరిశీలనయొక్క మేర విరివియైన కొలఁది యు, అవగాహనయొక్క లోఁ తధికమైన కొలఁదియు, నియతిబద్ధత్వమును, జడవిధానమును (Determinism, Mechanism) కార్యజాతమున (ముఖ్యముగా ప్రాణ ధాతువునకు సంబంధించిన కార్యజాతమున) కాన్పించు అపూర్వ త్వాభినవత్వములను సమర్థింపఁజాల వనియు,

ఆ హేతువుచే పరిణామము నపూర్వ ప్రాదుర్భావము కల దానినిగా, (Lloyd Morgan:- Emergent Evolution) లేక సృష్ట్యాత్మకముగా (Bergson:- Creative Evolution) పరిగణింపవలయు ననియు స్వీకరింపఁబడుచున్నది.

కావున ఆరంభపరిణామవాదముల వివాద ఎన్నఁటికిని తెగఁజాలని కేవలశాబ్దికవివాదమాత్రమే కాదేని, ఆ రెంటికిని ఈ విధమున సమన్వయము కల్పించినపుడే కార్య కారణభావముయొక్క సమగ్రగ్రహణ సాధ్యమగును. కార్యోత్పత్తి యన కారణముయొక్క పరిణామము, అనఁగా కారణమున శక్తిరూపమున నున్నదాని అభివ్యక్తి. కాని ఈ అభివ్యక్తియం దభినవసంయోగము, నవ్యారంభము, యథార్థమగు నుత్పత్తి. పరిణామము జడప్రక్రియగాదు. భౌతికరూపములందలి పరిణామము జడప్రక్రియగా చాలవఱకు సమర్థింప వీలున్నను, ప్రాణరూపములందలి పరిణామము జడప్రక్రియయొక్క విధానములచే సమర్థింపఁబడఁజాలదు. దీనికి హేతు వీ ప్రపంచము చైతన్యమునందు చైతన్యముయొక్క స్వసృష్టి యగుట. ఈ యుపలబ్ధియే కార్యజాతపరంపర నైన ఈ ప్రపంచముయొక్కయు, అందలి ప్రతికార్యకారణసంబంధముయొక్కయు రహస్యము నుద్ఘాటింపఁగలదు. ఈ సత్యమును నిరూపించుటకై

వివర్తవాదము యత్నించియు దానిని కొంతవఱకు విరూపము చేయుచున్నది. అధ్యాత్మచేతన తానే యుపాదానముగా నిర్మించిన సృష్టి యీప్రపంచము; ఈ ఋషిదృష్టినుండి ప్రవర్తిలినవాదమే వివర్తవాదము. మానసికచేతన తానే యుపాదానముగా నిర్మించెడుసృష్టి స్వప్నము. ఈ సాదృశ్యముచేవలె వివర్తవాదము ప్రపంచసృష్టిని స్వప్నతుల్యమైన భ్రాంతి యనియు, పర్యవసానమున కభావాత్మకమైన మిథ్యయనియు సమర్థించుచున్నది. కాని యీపోకడ నంగీకరింపక, స్వరూపమును పరిత్యజింపకయే రూపాంతరమును బడయు చైతన్యముయొక్క వివర్తమే * యీసృష్టియందుమేని, అపుడీదృష్టి ఆరంభపరిణామవాదములు సంయోజితములయ్యును బోధచేయలేని కార్యకారణభావముయొక్క చరమరహస్యమును ప్రకాశింపఁజేయఁగలదు.

***

కావున నిచటి కృత్స్నదృష్టియందు భిన్నపథములైన ఈ దర్శనవాదముల కన్నింటికిని సమన్వయపథ

* "స్వరూపాపరిత్యాగేన రూపాంతరాపత్తి ర్వివర్తః" శ్రీసాయణ మాధవాచార్యుని సర్వదర్శనసంగ్రహము.

మేర్పడుచున్నది. ఐక్య మనేకమునందు, అనంత మంత వంతములయందు, అమర్త్యము మర్త్యరూపముల యందు, కూటస్థము పరిణామములయందు, కేవలము విశేషములయందు, అసంగము సంబంధములయందు తన ఐక్యానంత్యములకు, అమర్త్యత్వకూటస్థత్వములకు, కేవలత్వ - అసంగత్వములకు ఏమాత్రము భంగములేని విధమున అభివ్యక్త మగుచున్నది. ఈ ఐక్యమును, అనంతమును, అమర్త్యమును, ఈ కూటస్థమును, కేవలమును, అసంగమును వేదాంతము చైతన్యము, బ్రహ్మము, లేక సచ్చిదానంద మనుచున్నది. చైతన్యముయొక్క స్వస్వరూపమున కేమియు భంగములేని ఈ అభివ్యక్తి యొక్క తత్త్వమును, ఐక్యనానాత్వాదికముల విరోధమును వీక్షించు ఈ బుద్ధి సంపూర్ణముగా గ్రహింపఁజాలదు; బుద్ధ్యతీతమైన ఉపలబ్ధికే అది గోచరము. కాని దీని గ్రహణవిషయమున బుద్ధి కేవలము నిరాధారమై, నిరాలంబమై లేదు. దాని స్వానుభవమును, ప్రపంచానుభవమును గాఢతర మగుకొలఁదియు, ఐక్యానైక్యాదుల సామంజస్యమార్గము దానికి లభించుచున్నది. కావున మన మైక్యాదికము నపలపింపఁ బనిలేదు, అట్లే నానాత్వాదికమునకు మిథ్యాత్వము నారోపింప నక్కఱ లేదు.

ఐక్యాదిధర్మములచే నిర్దేశింపఁబడు చైతన్యమే విధమున స్వరూపహానిలేకయే నానాత్వాదికమునందు ప్రవేశించి, విలీనమై అభివ్యక్త మగుచున్నదను విషయమే సృష్టియొక్క ప్రహేళిక (Riddle). ఐక్యమునో నానాత్వమునో త్రోసివేసి ఈ ప్రహేళిక కర్థము చెప్పుట సులభము; కాని అది దాని నిజమైన అర్థము కానేరదు. మఱియు చిదాత్మకమగు నాత్మ జడప్రపంచమునం దెట్లభివ్యక్త మగుచున్నది? అసంగమైనది జగత్సంబంధములం దెట్లు నిలుచుచున్నది? అనఁగా, గీతయొక్క మాటలలో, క్షేత్రక్షేత్రజ్ఞసంయోగ మెట్లు తటస్థించుచున్నది? — "నిర్గుణమును, నిర్విశేషమును, సర్వవిలక్షణమును ఐనట్టిది సమానజాతీయము కానిదగు దేనితోనైనను కూడు ననుట న్యాయవిరుద్ధము"*, "అవయవసంశ్లేష ద్వారకమైన సంబంధవిశేషము కాని, లేక దారమునకును బట్టకును వలె సమవాయసంబంధము కాని యీ సంయోగము కానేరదు"† అని ఈ సంబంధము విషయమున బాధకము లనేకము తోఁచఁగలవు. కాని యాకారణముచే 'ఈ సంయోగ మధ్యాసస్వరూపము, మిథ్యాజ్ఞానముచే కలుగునట్టిది' అని

* శంకరభాష్యము 'కేనోపనిషత్' ౨ — ౪

† శంకరభాష్యము — గీత ౧౩ — ౨౬.

సంయోగమునే ఎగురఁగొట్టినచో ఏమి సాధక మగు చున్నది? సంయోగము కలదు. దీని నపలపింపఁ జాలము; చైతన్యము సత్యమేని ఈ సంయోగమును సత్యము. బుద్ధియొక్క బోధ కీవిషయమునందు క్లిష్టము కలదు; దీని నది విపులతరమైన అనుభవముచేతనే అతిక్రమింపవలయును. "ఈ నేను ఎటువలె నున్నానో ఎఱుఁగను; రహోమయుఁడనై, మనసునకు లగింపఁబడి సంచరించుచున్నాను...అమర్త్య మిట మర్త్యముతో ఏకావాసమునఁ గలఁదు.*" మర్త్యామర్త్యముల, క్షేత్ర క్షేత్రజ్ఞుల ఈ సంయోగము యథార్థవిషయము; ఈ సంయోగముయొక్క పూర్ణస్వభావము మన కెఱుక పడుటలేదు. అన్యసంయోగవిధములకంటె విజాతీయము, ప్రత్యేకజాతీయము; కావుననే దాని యనుభవముచేతనే అది యెఱుఁగఁబడవలయును. తత్త్వద్యోతకమగు అను భవిక జ్ఞానమునకు దారిని స్వాభినివేశములచే నిరుద్ధము చేయకుండుటయే బుద్ధియొక్క సమ్యక్ప్రవర్తనము. ఏలన బుద్ధికిఁదోచు ఇప్పటి అన్యోన్యవిరోధములన్ని

---

* "న విజానామి యదివేదమస్మి నిణ్యః సన్నద్ధో మనసా చరామి ...అమర్త్యో మర్త్యేనా సయోనిః"

ఋగ్వేదము ౧ — ౧౬४ — ३౭, ३౮.

యును కృత్స్నజ్ఞానమునందు పరమసామంజస్యమున గోచరింపఁగలవు.

ఇట్టి కృత్స్నజ్ఞానములోనికి శ్రీ అరవిందదర్శనము కొంపోవుచున్నది. ఇంతవఱకును ఇది ఏకృత్స్న దృష్టినుండి యుపక్రమించుచున్నదో అది కొంత వివరింపఁబడినది. ఇఁక కొలఁదిమేరలో శ్రీ అరవింద దర్శనమును సంగ్రహముగా సూచింపనగును.

***

ప్రపంచమునకుపాదానమును (Material Cause), సకలవిధమగు అన్యకారణమును అద్వితీయమగు చైతన్యము, లేక సచ్చిదానందము.* దీనియొక్క ప్రకారములే ఈ మన మెఱిఁగిన భూతప్రాణ మనోధాతువులు (Matter, life and mind). మనస్సునందు బాహిరపడిన చేతనయే (Consciousness) చేతనయొక్క సకల

* ఇందలి చిత్ - శబ్దముచే అనంత చేతనయేగాక దానితో అవినాభావమున నుండు అనంతశక్తియు తెలుపఁ బడుచున్నవి. కావుననే ఈశబ్దము శ్రీఅరవిందులచే 'Conciousness-Force' అని అనువదింపఁబడుచున్నది. ప్రశమాత్మకములైన (Quietistic) వాదములీ అనంతశక్తిని ప్రకృతికో మాయకో అప్పగించుచున్నవి.

రూపమును గాదు. మనస్సుయొక్క వలయమును దాటి లోనఁ బ్రవేశించితిమేని, నిశ్చేతనము (Inconscience) లోని కవరోహణక్రమమునను, ఊర్ధ్వ చేతనము (Super-Conscience) లోని కారోహణక్రమమునను సోపుభూమికలు (Gradations; levels) గోచరించును. జడముగాఁదోచు భౌతికపదార్థమందును చేతన నిమగ్న మై కలదు; దేని వ్యూహమై (Arrangement; organisation) భౌతికద్రవ్యము (Matter) తోచుచున్నదో, ఆ భౌతికశక్తియందును (Energy) చేతన నిమగ్నమై కలదు. అట్లే సకలవిధమైన ప్రాణమందును కొన్నితావుల నిలీనమై, కొన్నితావుల వ్యక్తమై చేతన కలదు. ఈ సర్వవ్యాపియగు చేతనయొక్క ప్రాగ్రమునందు సచ్చిదానందాత్మకమగు చైతన్యము, కట్టకడపటి క్రిందల యందు నిశ్చేతన సదృశమగు జడము. కావున చిత్సత్తయొక్క ఒకానొక ప్రకారమే భౌతికపదార్థము. దానిశక్తియొక్క ఒకానొక ప్రకారమే భౌతికశక్తి. అట్లే చిత్శక్తి ( Consciousness-Force) యొక్క ఒకానొక క్రియావిధానమే ప్రాణము; మఱియు చిత్శక్తియొక్క ఒకానొక గ్రహణవిధానమే మనస్సు. నిశ్చేతనము వలెఁ దోచు జడమునందంతర్హితమైన చైతన్యము మరల పరిణామక్రమమున నావిర్భూతమగుచు ప్రాణమనోధాతు

వులను వ్యక్తము చేయుచున్నది. చైతన్యము సర్వవ్యాపి కావుననే ఈ ధాతువులును సర్వవ్యాపులై, జడము నందును అంతర్హితదశయందుఁ గలవు.

ఈ పరిణామము ముందునకుఁబోయెనేని వీనికన్న సూక్ష్మతరములును, శక్తిమత్తరములును అగుధాతువులు వ్యక్తములగును. ముందావిర్భవము కానున్నది విజ్ఞానము (Supermind). * దీని పూర్వచ్ఛాయ లిప్పుడే మనుష్యునందుఁ గలవు. వానికిఁ జెందినట్టిదే అంతర్భవమైన జ్ఞానమగు స్వతఃస్ఫురణము (Intuition). చైతన్యమునకును జగమునకును, సత్తకును సంభూతికిని తోఁచు విరోధ మంతయు విజ్ఞానమునం దంతరించుచున్నది. ఈ

---

* మనస్తత్త్వముకంటె పైనిదగు విజ్ఞానతత్త్వమిచట నుద్దేశింపఁబడినది. విజ్ఞానతత్త్వము యొక్క వివరణము దర్శనముయొక్క దివ్యపరిణామ వాదమను భాగమునఁ జూడఁదగును. 'ప్రకృతివిజ్ఞానము' 'ప్రాచీనవిజ్ఞానము'అను కొన్నితావులయందు విజ్ఞానశబ్దము పారిభాషికమైన ఈప్రత్యేకార్థమునఁగాక, పరిశీలన ప్రయోగములచే (Observation and experiment)స్థాపింపఁబడు జ్ఞానము (Science), 'విశేష జ్ఞానము', 'విస్తృతజ్ఞానము', 'వివిధజ్ఞానముల సాకల్యము', జ్ఞానముచేఁ గల్గినసంస్కారము లేక శిష్టత లేకసంస్కృతి, అను సాధారణార్థములందు వాడఁబడుచున్నది. ప్రకరణముబట్టి విజ్ఞానశబ్ద మెచట విజ్ఞానతత్త్వమును దెలుపుచున్నదో అది సులభముగా తెలియఁదగును.

విజ్ఞానమును జేరి మానవుఁడు తనయాత్మ పరిపూర్ణతను బడయుచున్నాఁడు; ఏలన గుణక్రియారహితమైన ఆత్మ యొక్క సంప్రసాదమును బడయుట మాత్రమే ఆత్మపరిపూర్ణత కాదు. ఆత్మయొక్క సర్వాతీతత్వమును, సర్వాత్మ్యమును, వ్యక్తిత్వమును యుగపదనుభూతియం దనుభవించుట విజ్ఞానభూమికయందు సాధ్యమగును; అనఁగా ఈ భూమికయం దాత్మ అతీత సమస్త వ్యస్తములయందు (Transcendental, Universal, Individual) ఏకకాలీనముగా నివసింపఁగలదు, వ్యవహరింపఁగలదు; ఏలన చైతన్యముయొక్క స్థాయియు నిట్టిదియే. లేదేని విశ్వ మెట్లు నిలుచును? కావున ముక్తమగు నాత్మ చైతన్యముయొక్క అతీతత్వము నందుకొనియు, విశ్వముయొక్క సంబంధములయందు సక్రియమై నిలువఁగలదు. కావున విజ్ఞానమును తనయం దావిష్కరించుకొని, దానిధర్మముచే మనః ప్రాణ భూత ధాతువులకు సంబంధించిన తనసకలజీవితమును నియమించి రూపాంతర మొందఁజేయుటయే మనుష్యుని కర్తవ్యము, ఇహలోకమునందలి పరిణామముయొక్క చరితార్థత.

దివ్యసత్త తన అంతర్హితియొక్క పరమావధియైన జడమునుండి పరిణామక్రమమున ఉత్తరోత్తరముగా అభివ్యక్త మగుచున్నది. ఈ అంతర్హితి (Involution)

యొక్కయు, అభివ్యక్తి (Manifestation, Evolution) యొక్కయు విధానముల ననుసరించియే పరిచ్ఛిన్నత్వము, పృథక్త్వము, అజ్ఞానము, అవిద్య, శోకము, మోహము. కాని తన యీ పరిణామక్రమముచేఁగాని దీని ఫలితములచేఁగాని దివ్యసత్తయొక్క నిత్యపరిపూర్ణతయందు, దాని అనంతసత్తయందు, అనంతచితియందు, అనంతానందమునందు ఏమాత్రమును తఱుగులేదు, వికారము లేదు *. ఈ పృథక్త్వము వెనుకను అనంతమైన దివ్యసత్త, ఈ అజ్ఞానము వెనుకను అనంతచిచ్ఛక్తి, ఈ శోకమోహముల వెనుకను అనంతమైన ఆనందము. తరంగములయందు పృథక్త్వము, పరస్పర సంఘర్షణము; కాని ప్రతి తరంగము వెనుకను అనంత సముద్రము; మఱియు ఇతర తరంగములకంటెను సముద్రముకంటెను అది అన్యమైనది కాదు. తరంగముల నీను నిత్యశక్తి సముద్రమునందు. మఱియు తరంగము తన సముద్రాత్మకత్వము నెఱిఁగినపై నిష్పందమైన సముద్రగర్భమునందు నిలీనమై పోనక్కఱలేదు; అనంతసముద్రముయొక్క శక్తిని తనతరంగక్రీడయందు వెలయింపనగును.

---

* "పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణ మేవావశిష్యతే"
"పూర్ణమునుండి పూర్ణమును వెలిచేయఁగా (గ్రహింపఁగా) పూర్ణమే మిగులుచున్నది" బృహ. ఉపనిషత్.

మన యునికియొక్క కేంద్రము పృథక్త్వముయొక్క పా
దైన 'అహము' నందు; పృథక్త్వము పరిచ్ఛిన్నతవలన;
పరిచ్ఛిన్నత తపశ్శక్తి అనఁగా సృష్ట్యర్థమై స్వనిమగ్న
మగు చిచ్ఛక్తియొక్క ఒకానొక పరిణామమువలన.
కాని, మన యునికియొక్క కేంద్రమును అహమునందుండి
అది దేని మలిన ప్రతిబింబమో ఆ దివ్యపురుషుని లేక ఆ
దివ్యవ్యక్తిలోని కెత్తితిమేని, మన పృథక్త్వము వెనుకను,
అజ్ఞానము వెనుకను, శోకమోహముల వెనుకను ఎల్లప్పు
డును నిత్యపరిపూర్ణములై, తొలఁగిపోనివై అనంతసత్త,
అనంతచితి, అనంతానందములు కలవని గోచరింపఁ
గలదు. 'అదియును పూర్ణము, ఇదియును పూర్ణము—'
'పూర్ణమదః పూర్ణమిదం', పరిణామక్రమముచే చైత
న్యముయొక్క నిత్యపరిపూర్ణత కపాయములేదు. ఏలన
దివ్యసత్త తన అతీత—సమస్త—వ్యస్తములను పర్యాయ
క్రమమునఁగాక ఏకకాలీనముగా నెల్లపుడును తనయందు
భరించుచున్నది.

ఈ తెల్పినదానిని దివ్యపరిణామవాదమనఁదగును.
సృష్టికతీతమైనట్టిదే సత్యమనియు సృష్టి యసత్యమనియు
సమర్థింపఁ జూచువాదములు——మాయావాదముయొక్క
ప్రకారములు—అనేకములు గలవు. ఈ వాదములందు
ఐహికజీవితమునకు యథార్థమగు సార్థకత లేకపోవు

చున్నది. ఇంకొక తెగకుఁ జెందినవాదములు—వీని నైహిక వాదము లనఁదగును—ఈసృష్టియే ఈ విశ్వసంభూతియే ఏకమును పరమునైన సత్యముగా గ్రహించుచున్నవి. జీవితముయొక్క సంపదను సాధ్యమైనంతవఱకు సమృద్ధ మొనర్పఁ బ్రయత్నించియు మనస్సుకంటె పైనున్న శక్తులను గ్రహింపకపోవుటచే, ఈ వాదములు లక్షించెడు సమృద్ధి సమగ్రమును యథార్థమును అగు సమృద్ధి కాకున్నది. మఱియు కొన్ని వాదములు — ఇవి ఆముష్మిక వాదములు—మానవుని ఇహజీవితమును స్థానభ్రంశముగాఁ గాని లేక స్వర్గార్హతను సంపాదించుకొనుటకు మాత్రమే ఏర్పడినక్షేత్రముగాఁగాని గైకొనుచున్నవి, స్వర్గమునం దమృతత్వమును బడయుటయే పరమలక్ష్యముగా వీక్షించుచున్నవి. ఆకారణముచే ఈవాదములు ఇహ జీవితముయొక్క పరిపూర్ణసార్థకతను సాధించుటలేదు. మఱియు ఉచ్చభూమికలైన స్వర్గాదుల నంగీకరించియు విశ్వకారణముయొక్క విశ్వాతీతతత్త్వమును పూర్ణముగా లక్షింపకున్నవి. మనయునికినిగూర్చిన వాదములను స్థూలముగా అతీతవాదములు, ఆముష్మికవాదములు, ఐహిక వాదములు అను మూఁడు తెగలక్రింద విభజింపవచ్చును. మానవసత్త్వయందలి సర్వాంశలయొక్కయు సత్యమును కృత్స్నదృష్టితో వీక్షింపకుండుటచే, అవి నెలకొల్పిన

లక్ష్యములును అసమగ్రములైనవి. అసమగ్ర లక్ష్యములచే మానవజీవితము కుంటుపడుచున్నది. మానవజీవితమందలి సకలాంశములకును వానికి వానికిఁ దగినస్థానమిచ్చి సమగ్రమైన జీవితలక్ష్యమును సాధించుటకై, ధర్మార్థకామమోక్షములను నాలుగు పురుషార్థముల నంగీకరించిన ప్రాచీనదృష్టి చాలవఱకుఁ బ్రయత్నించినది. కాని అదియును పరమపురుషార్థమైన మోక్షమును ముఖ్యముగా ఇహలోకమునుండి తప్పించుకొనిపోవుటగా లక్షించుటచే, కడకు దాని లక్ష్యమును ఐహికజీవితమున కపకారియై, తద్ద్వారమున ఐహికజీవితప్రతిష్ఠితమైన ఆధ్యాత్మికజీవితమునకును అపకారియైనది.

ఇచటి దివ్యపరిణామవాదము అతీతముయొక్క సత్యము నంగీకరించుచున్నది, మఱియు దాని యుపలబ్ధి చేతనే విశ్వముయొక్క సర్వార్థమును గ్రహింపఁబడు ననుచున్నది. కాని విశ్వసత్తను భ్రాంతియనదు. ఆముష్మికవాదములవలె దివ్యపరిణామవాదము ఇతర భూమికల నంగీకరించుచున్నది. కాని ఆకారణముచే ఈ భూమిని నిరసింపదు. ఇచటి సృష్టియొక్క భౌతిక నిబంధనయందు ఆత్మయొక్క జ్యోతిశ్శక్తులను విరియఁ జేయుటకే భూమిపై మనుష్యుని ఆగమనము. ఈ విధమున దివ్యపరిణామవాద మైహికజీవితముయొక్కయు

పరిపూర్ణసార్థకతను లక్షించుచున్నది. కాని ఐహిక వాదములవలె నది మానవజీవితమునం దిపుడు వెలువడి యున్న శక్తులయొక్క వికాసమును మాత్రమే సాధించుటతో తృప్తిపడదు.

ఆత్మయొక్క జ్యోతిశ్శక్తులను తనయందు సంపూర్ణముగా విరియఁజేసికొనుటయే మానవుని స్వముక్తి; కాని మానవుఁడు మానుష్యకమునుండియు, విశ్వసత్తనుండియు విడివడి లేఁడు. విశ్వసత్త మనుష్య రూపమునందు తనచరితార్థత నభిలషించుచున్నది. కావున ముక్తుఁడగు మానవుని పరిపూర్ణత మానుష్యకమునం దాత్మయొక్క పూర్ణతరాభివ్యక్తికి సాధనము కావలయును.

మానవునియం దాత్మయొక్క పూర్ణాభివ్యక్తిని సాధించుటయే మానవజీవితముయొక్క ఉత్తమలక్ష్యము. కాని యిది సాధించుట యెట్లు? జగమునం దీ యభివ్యక్తి పరిణామధర్మముచే నిర్వహింపఁబడుచున్నది. జడమునందు ప్రాణమును, ప్రాణమునందు మనస్సును పరిణామక్రమమున ఆవిర్భూతము లగుచున్నవి; ప్రాణ మావిర్భూతమై జడమునకు నవతరములైన నిర్మాణ-సామర్థ్య-ప్రయోజనములఁ గల్పించుచున్నది; అట్లే మనస్సును ప్రాణమునకు. ఈ ధాతువులయొక్క ఆకృతులయందు సచ్చిదా

నందములు తమ్ముఁ దా మన్వేషించుకొనుచున్నవి. అనంత సత్త పృథక్త్వములయందు, అనంతచేతన పరిమితము లైన గ్రహణప్రకారములయందు, అనంతానందము సుఖ దుఃఖాదులందు తమ వాస్తవము నిచట ఉత్తరోత్తరాతి శయములతో వెలయింపఁ జూచుచున్నవి. కాని తమ స్వవాస్తవమున కిచటిభాషలో అవి ప్రకటింపఁ జూచు ననువాదములు చాల దూరచ్ఛాయలు, వికారములు. మనస్సునకంటె ఉచ్చతరమైయున్న విజ్ఞాన మావిష్కా రింపఁబడునేని, సచ్చిదానందముల అవికృతమైన అభి వ్యక్తి యిచట సాధ్యమగును.

దివ్య విశ్వసత్త ఈ పరిణామమును తనయందు వహించుచున్నది. దానియం దతీత సమస్త వ్యస్తముల యొక్క అనుభూతియు, ఆనందమును ఏకకాలీనమై కలవు. అట్లే ఈ అతీత సమస్త వ్యస్తములు దివ్యసత్త యందలి ఒకగ్రంథియనఁదగు ప్రతివ్యక్తియందును లోలోనఁ గలవు. కాని అతీతత్వముయొక్కయు సర్వా త్మ్యముయొక్కయు అనుభూతి బాహ్యజ్ఞానమున లేదు. ఏలన మన యహంతయొక్కయు, మన మనోమయసత్త యొక్కయు పృథక్త్వధర్మముచే ఆయనుభూతి యిట తిరోహితమగుచున్నది. వీనిని పూర్తిగా నతిక్రమించినఁ గాని మన యధ్యాత్మసత్తయొక్క సంపూర్ణోపలబ్ధి

చేకూరదు. మన మనోభూమిక యందొక విధముగా ఆత్మయొక్క అనంతసచ్చిదానందముల నెఱుఁగవచ్చును; కాని ఆయనుభవము ఆత్మయొక్క ప్రతిబింబకల్పమై లేక చైతన్యమున మనసు మునిగిపోవుటవంటిదై, క్రియా శీలము కానేరదు. ఏలన మన యిప్పటి క్రియాకేంద్రము-మనోభూమికలోని యీ 'నేను'- పృథక్త్వము నవలంబించియున్నది. సర్వాత్మ్యానుభవమునుండి వెడలు కర్మల నిది యాచరింపఁజాలదు. ఇది దేని వికృతియో దేని దూరచ్ఛాయయో ఆదివ్యవ్యక్తి లేక దివ్యపురుషుఁడు విజ్ఞానభూమికయందు. సర్వాతీతత్వ సర్వాత్మ్యానుభవము స్వవ్యక్తిత్వముతోపా టేకకాలీనములై దివ్యవ్యక్తియందుఁ గలవు. కావున విజ్ఞానభూమికను జేరి, మన అహము నాదివ్యవ్యక్తిగా పరివర్తిత మొనర్చి, మనోమయ సత్తను విజ్ఞానమయ సత్తగా పరిణత మొనర్చినఁగాని, ఇచట మనయందాత్మశక్తియొక్క పూర్ణాభివ్యక్తి సాధింపఁబడదు.

అంతర్స్థితి యందీ విజ్ఞానము మనలోనఁ గలదు. దీనిని మన మభివ్యక్తము చేయవలసియున్నది. వెలి చూడ్కి కిది, పరిణామముచే ప్రాణమయ మనోమయ సత్తల నతిక్రమించి పోవుటగాఁ దోచుచున్నది. కాని లోని యాత్మజ్ఞానమునకు, ఈ తనుఁ దా నతిక్రమించి

పోవుట లేక ఈ స్వాతిక్రాంతి, యథార్థముగా స్వసంభూతియే, రహస్యత్తయందున్నదానిని వెలికిఁ దెచ్చుటయే. మఱియు అన్నమయసత్త నతిక్రమించి ప్రాణమయసత్త, ప్రాణమయసత్త నతిక్రమించి మనోమయసత్త, మనోమయసత్త నతిక్రమించి విజ్ఞానమయసత్త; ఇందు తరువాతిది వెనుకటిదాని నున్మూలింపదు, నశింపఁజేయదు; స్వధర్మముచే దానిని నియమించును, పరివర్తిత మొనర్చును. ఇఁక విజ్ఞానమయసత్తయొక్క ధర్మముచే నివన్నియు శాసింపఁబడవలయును, మార్పఁబడవలయును. ఇంతవఱకును మనుష్యుఁడు శరీరియైన మనోమయసత్త; ఇఁక నతఁడిట శరీరియైన విజ్ఞానమయసత్త కావలయును.

సత్తయొక్క అవరార్ధమునందు చేతన పరిచ్ఛిన్నము, పరిచ్ఛేదకారి; ఈ చేతనయొక్క ఉపకరణము మనస్సు. సత్తయొక్క పరార్ధమునందు చేతన అపరిచ్ఛిన్నము, ఐక్యకారి. ఈచేతనయొక్క ఉపకరణము విజ్ఞానము. అవరార్ధమును దాటి పరార్ధమును జేరిన పిమ్మట, మన పరిణామ మంతయు యథార్థమైన స్వసంభూతి యగును—'బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్నోతి';* అవరసత్తయంతయు అపుడు పరివర్తనకు స్వాధీనమగును.

* తాను బ్రహ్మమై బ్రహ్మమును బడయుచున్నాఁడు.

అగ్ర్యమగు బుద్ధియు ఈ పరివర్తనమును సాధింపలేదు. ఈ పరివర్తనముచే మానవుఁడు తన యిప్పటి ప్రకృతిని దివ్యప్రకృతిగా పరిణమింపఁజేయఁగలఁడు.

ఈ పరివర్తన–పరిణామములను దివ్యసత్త్వయొక్క శక్తియే సాధింపఁగలదు. ఏలన దివ్యసత్త్వయే ప్రాకృత సత్త్వను దివ్య మొనరింప నేర్చును. దివ్యసత్త్వ సాయము లేనిది ఈ పరివర్తనము సాధ్యపడదు. అవరసత్త్వ తన ఉత్కాంక్షచే (Aspiration) మనస్సును తెఱచివైచి,[౧] అట ద్వార మేర్పఱచి దివ్యసత్త్వను తనలోని కావ్వా నింపవలయును; దీనిశక్తిచే తనప్రకృతిని దివ్య మొనర్చి వైచి, దివ్యములగు జ్ఞానేచ్ఛాక్రియలను, ఆనంద ప్రేమలను, విశుద్ధైక్యములను బడయవలయును. కడకు శరీరప్రాణములనుగూడ పైఁదెలిపిన దివ్యగుణములకు తగిన యాధార మగునట్లుగా రూపాంతరీకృతముల చేయవలయును. మనోమయుఁడైయున్న మనుష్యుఁ డపుడు విజ్ఞానమయుఁ డగును. ఇదియే మనుష్యుని సర్వాంత్యమైన పరమావధి యనరాకున్నను, ఇచటి

[౧] వేదర్షుల హృదయమందుండి ‘తెఱచివైవుము, ఆవరణమును తొలఁగింపుము, ద్వారముల తెఱచివైచితివి’ అను నీ మాటలే మాటిమాటికిని దేవతలకడ కెగయుచున్నవి — (అపావృధి, అపావృణు, వివృణు, అపోర్ణుహి; అపావః)

యీ పరిణామమున కంతమున నున్న పరమావధి యిదియే యనవలయును.

మనుష్యుఁడు విజ్ఞానమయుఁ డగుట యనఁగా మర్త్యశరీరమునందుండియును ఆత్మయొక్క ఐక్యామృతత్వములయందును, జ్యోతిశ్శక్తులయందును జీవించుట, వర్తించుట, వ్యవహరించుట; భౌతిక ధాతుబద్ధమైన మానవసత్తను మరల చిన్మయ మొనర్చుట. ఈ సృష్టి చైతన్యమునకు విరుద్ధమగు నొకానొక తత్త్వముయొక్క కార్యమేని, అంతవంతానంతములు పరస్పర ప్రతిషేధకము లేని, ఈ తెల్పిన పరివర్తన మసాధ్య మనఁదగును. అపుడు ఈ ప్రకృతినుండి తప్పించుకొనిపోయి అనిర్దేశ్యమునందు లయమగుటయే ముక్తియు అమృతత్వమును అగును. కాని దేశకాలములం దనంతముయొక్క ప్రతిబింబమే యీ అంతవంతము; మఱియు అంతర్హితమై యున్న చైతన్య మభివ్యక్తమగుటయే యీసృష్టి. మఱియు సర్వవ్యాపియై యీవిజ్ఞానతత్త్వము నిశ్చేతన మనఁబడు జడమునందుఁ గూడఁ గలదు. ఈ విజ్ఞానము యొక్క రహఃప్రేరణచేతనే జగమునందలి పరిణామరేఖ ఉనికియొక్క ఉత్తరోత్తర సానువుల నధిరోహించుచున్నది. కావున మానవుని విజ్ఞానమయదశ అతని

పరిణామముయొక్క సహజ పర్యవసానము; అతని ఇహ జీవితముయొక్క దివ్యచరితార్థత.

విజ్ఞానమయుఁడై మనుష్యుఁడు అనంతసచ్చిదానందముల ననుభవించుటయే గాక, వాని శక్తిచే తన మనః ప్రాణ శరీరములయొక్క ధర్మములను మార్పఁగలఁడు, వీనిని గూడ దివ్యసత్తయొక్క ప్రకారములఁగాఁ బరిణమింపఁ జేయఁగలఁడు. తన బాహ్యజీవితముయొక్క అంతవంతమగు నునికిపట్టును అనంతముయొక్క ప్రతిమగా వెలయింపఁగలఁడు. నిత్యముక్తమును, నిత్యశుద్ధమును, అనంతమును, అమృతమును అగు ఆత్మయొక్క స్వారాజ్య సామ్రాజ్యములఁ బడయఁగలఁడు. జగమున భగవంతుని క్రియాశక్తికి కేంద్రమై ఐక్యజ్ఞానమునుండి వెడలు దివ్యకర్మల ప్రవర్తింపఁజేయఁగలఁడు. మానుష్యకమునందు విజ్ఞానమయసత్తయొక్క అవతరణమునకు ద్వారములను తెఱచివేయఁగలఁడు. ఇదియే అమృతత్వము; ఇదియే మోక్షము; ఇదియే దేవత్వముయొక్క జన్మ.

కాని యిట్టి మహాపరివర్తనము మనకెట్లు సాధ్యమగును? అని ఇంకను వాదమంగలదు. ఐనను ఈ పరివర్తనము కొఱకే మన ప్రకృతి యందలి రహఃకాంక్ష, ఆత్మయందలి రహఃప్రేరణ. మానవుఁడు తనలోని దివ్య

సత్తను వీక్షించి, దివ్యశక్తిపై ఈకార్యభారము మోపె నేని, ఇఁక అసాధ్యమనుమాట కవకాశమెక్కడిది? అటుపై ప్రయాసకరమగు సాధనతోఁ బనిలేదు, ఇఁక సిద్ధియొక్క క్రమవికాసము.

శ్రీ [illegible] లయము,
తెలప్రోలు.





అథ కి మేవ మకస్మా దస్మా నతి వికటాభి రత్యంతా ప్రసిద్ధాభిః కర్ణాట గౌడ లాట భాషాభి ర్భీషయతే భవాన్ ?

నహి వయం భవంతం భీషయామహే. కింతు మధుమత్యాది పదార్థ వ్యుత్పాదనేన తోషయామః. తతశ్చాకుతోభయేన భవతా శ్రూయతా మవధానేన.

(కర్ణాట గౌడ లాట భాషలనుండి గైకొన్న ఉద్దండములను నప్రసిద్ధపదములతో మమ్మేటి కకారణముగా భయపెట్టెదరు?

మిమ్ము మేము భయపెట్టుటలేదు. ప్రత్యుత, మధుమతి మొదలగు భూమికల సంగతి వివరించి సంతోషపెట్టుదుము. కావున నిర్భయముగా శ్రద్ధతో విందురు గాక.)

పాతంజల దర్శనమును వివరించుపట్టున సర్వదర్శన సంగ్రహమందు శ్రీ మాధవాచార్యుఁడు.



# శ్రీ అరవింద దర్శనము

## దివ్య పరిణామ వాదము

మన యునికిని బరిశీలింపఁగా మూఁడు ప్రధాన తత్త్వములు గోచరించుచున్నవి. మొదటిది భౌతిక పదార్థము, రెండవది అందుండి వెలువడుచున్నట్లుగా కనఁబడు ప్రాణశక్తి, మూఁడవది ప్రాణశక్తియందుండి వెలువడు మనస్సు. నేఁటి ప్రకృతిశాస్త్రముల ననుసరించు ఆధునిక విచారణ ఈ మూఁడు తత్త్వములను మాత్రమే యంగీకరించి, వీనిని ఒక భౌతికపదార్థము యొక్క లేక నిశ్చేతనమైన శక్తియొక్క పరిణామములుగా, లేదా ఒక మహాప్రాణముయొక్క రూపాంతరములని కాలాంతర్గతమైన క్రమితసంభూతియొక్క ఫలితములని గ్రహించుచున్నది. దీనికి హేతువు, ప్రకృతి విజ్ఞానము భూత-ప్రాణ ధాతువులయొక్క రూపములను బరిశీలించినట్లు మనోధాతువును బరిశీలించియుండలేదు,

అదేవిధముగాఁ బరిశీలింపను జాలదు. కాని మన స్సునం దంతర్నిహితములై యున్న శక్తి లోకమూరు గ్రహింపఁబడినచో, వానిచాలునఁ బోయి పైఁ జెప్పఁ బడిన మూఁడుతత్త్వములకును మూలము నందుకోఁ గలము.

పూర్వసిద్ధమైయున్న ఇట్టి మన స్తత్త్వపరిశీలనపై, ఇదివఱకే ఆవిష్కరింపఁబడియున్న ఆధ్యాత్మిక సత్య ములపై ఇచటి విచారణ యుపక్రమించుచున్నది. వీని నిరూపణము మనకు నిలిచినరీతిని సమగ్రముగా లేక పోవచ్చును. ఐనను వీనిని నిరాపదముగా ననుసరింప వచ్చును; కారణము వీని ప్రధానాంశములను, ముఖ్య ఫలితములను ఎల్లప్పుడును అనుభవముచే ధ్రువపఱచు కొనుట సాధ్యము. మఱియు నేటి విజ్ఞానములు అత్యంత భిన్నమైన తావున మొదలిడియు, అనఁగా భౌతికము యొక్క పరీక్షయందుండి యుపక్రమించియు, పేరులు భేదముతో మాత్రము ఇంచుమించు పూర్వవిజ్ఞానము యొక్క సిద్ధాంతములలోనికి దిగుచున్నవి. ఇది పూర్వ పరిశీలనమార్గముయొక్క సాధకతకు చక్కని ఋజువు.

ఈ ప్రాచీనవిజ్ఞానముయొక్క అవగాహనకు లభిం చెదున దేమన, మనః ప్రాణ భౌతికముల మూఁడింటి

కంటె వేఱైన యొకశక్తి. ఈమూఁడు తత్త్వములును దాని గర్భమునం దున్నవి. ఆ శక్తియొక్క యావిష్కరణము లివి, దాని క్రియాఫలితములు. ప్రాచీనవిచారణమున, నిత్యమును, సర్వవ్యాపియు నైన ఆ మూలతత్త్వమునకుఁ జేర్చెడుద్వార మాత్మ. పైచూడ్కి కీయాత్మ మనఃప్రాణశరీరముల మిశ్రఫలముగా, సంహతకార్యముగాఁ దోఁచవచ్చును; కాని లోనికిఁబోయి, శక్తియందును అభివ్యక్తియందును దానిస్వభావమును బరిశీలించితిమేని, ఆత్మయే మూలతత్త్వమగు చైతన్యముయొక్క సత్యమును గోచరింపఁజేయఁగలదు. ఈ చైతన్యమునందు రెండంశములు: సత్త, సంభూతి; అనఁగా ఉనికియును, అగుటయును. మొదటిది చైతన్యముయొక్క మూలస్వరూపము, రెండవది క్రియాస్వరూపము. మూలస్వరూపము కేవలమైన సత్త, కేవలమైన చితి, మఱియు కేవలమైన యానందము. తపస్సు, లేక సంకల్పము, లేక శక్తి యిందలి చితియొక్క స్వరూపము. సత్త, చితి, ఆనందము- ఈ మూఁడును ముప్పిరియైన ఒక్కటియై, విడఁదీయరానివై, పరమతత్త్వముయొక్క ఆత్మజ్ఞానమునందు కలిసియున్నవి. సౌకర్యముకొఱకై ఈ పరమతత్త్వమును సచ్చిదానందమని వ్యవహరించుచున్నాము.

సర్వమును దీనియందుండి వెలువడుచున్నది, దీని లోనికి తిరిగి పోవుచున్నది, దీనిచే నిలిచియున్నది. ఇది విశ్వాతీతము, ఐనను విశ్వము నిది తనయం దావిష్కరించుచున్నది. విశ్వముయొక్క సర్వరూపములందును ఇది దాగియున్నది, మఱియు తన్నుఁదాను వెలిపుచ్చుకొనుచున్నది. ఇది దేశ కాలాతీతము, నిమిత్త నియతుల కావల; ఐనను దేశకాలములందు, నిమిత్త నియతుల యందు తన్నుఁ దాను ప్రపంచించుకొనుచున్నది. అతీతత్వమునందు దీనిని సర్వాతీతమైన కేవల సత్త, లేక పరబ్రహ్మ మనవచ్చును; లేదా, ఏ కేవలమైన యాత్మ ద్వారమున దీనిని జేరుచున్నామో దానికిని ఇది యావలగాఁ దోఁచుటచే, దీనిని సర్వాతీతమైన అసత్త యనవచ్చును. కాని ఈయనుటలు ఒకేతత్త్వమును లక్షించుటయందలి భిన్నమార్గములు. వ్యతిరేకమార్గము బుద్ధిచే సత్తగా నిరూపింపఁబడు సర్వమునకును అతీతత్వమును ద్యోతనచేయుచున్నది. కావున నది బుద్ధియందు ప్రతిషేధ ("నేతి నేతి"); కాని ఆత్మయం దుపలబ్ధి- కేవలమును, నిరుపాధికమును ఐన ఆనందముయొక్క ఉపలబ్ధి. మన సత్తయొక్క లేక అసత్తయొక్క సర్వాతీతమైన తత్త్వమును అట్టి నిరుపాధికమైన ఆనందము ద్వారముననే

యెఱుఁగనగును. ఏలన, కేవల సత్తయందలి నిరుపాధిక మైన చేతన* కదియే చిహ్నము.

కాని యీ పరమతత్త్వముయొక్క స్వరూప స్వభావములకును, దానినిగూర్చిన మన యుత్తమానుభవ మునకును అత్యంతవిరుద్ధము లై తోఁచెడు ధర్మము లీ సంభూతియందు, లేక విశ్వముతోడి సంసర్గచే జనించెడు మన అనుభవమునందు చూపట్టుచున్నవి. ఈ విరోధమును సమన్వయించుట యెట్లు? ఈ సంభూతిని భ్రాంతిగా, పరస్పరప్రతిషేధకములైన ధర్మముల విరోధాభాసగా, స్పర్శాత్మకమైన లేక భావాత్మకమైన మనస్సుయొక్క సృష్టిగాఁ దలపోయవచ్చును; స్వయంభువైన మూలసత్త నిత్యశుద్ధమయ్యును, నిరంజనమయ్యును, భ్రాంతిజనక

* తెలియికయందు లెక్కలేని విధములు, విశేషములు. ఇంద్రియముల తెలియిక, మనో బుద్ధి హృదయముల తెలియిక, అతీంద్రియ మైన తెలియిక అని యిట్లు పలుతీరులు. మఱియు మనుష్యుల యొక్కయు, జంతువులయొక్కయు, తరులతాదులయొక్కయు తెలియికయందు తారతమ్యములు. మఱియును తెలియని తెలియిక - అద్భుత మైన విరోధాభాస - సత్తయొక్క గుహయందు. ఈ తెలియికల సర్వ విశేషములందును గల సామాన్యధర్మమును దెలుపుటకై చేతనాశబ్ద మిచట వాడఁబడుచున్నది. బుద్ధ్యుపహితమైన చైతన్యమే చేతనయని వేదాంతశాస్త్రమునందు వాడుక.

మగు వ్యామోహకశక్తి యై యీ మన స్వేల్లో జగత్సత్త లోనికి వచ్చి పడెనని అప్పుడు మన మూహింపవలసి వచ్చును. ఈ విరోధమును త్రెంపుట కిది సులభోపాయము కావచ్చును, కాని సమన్వయము కాదు. సత్తాసంభూతులకుఁ జూపబ్డెడు విరోధ మిచట శమింపఁజేయఁబడుట లేదు; రెండిటిని కలిపిచెప్పి, ఒకదానిని భ్రాంతి యని ఎగురఁగొట్టుట తటస్థించుచున్నది. దీనితర్కము బుద్ధి నిర్మితమైన ఒక యభ్యూహపై నాధారపడియున్నది. ఈ యభ్యూహను విమర్శింతుమేని, ఇది విడఁదీసెడు చిక్కుల కన్న ముడివెట్టెడు చిక్కులు మెండు. మఱియు ఆధ్యాత్మికానుభవమందలి యొకసత్యము ఈవాదమునకు వేఱొక యాధారము. ఈసత్య మాధారముగా, సత్తాసంభూతుల విరోధ మాత్యంతికము చేయఁబడుచున్నది; ఈ విరోధమును శమింపఁజేయఁగల అన్యానుభవము నిరాకరింపఁబడుచున్నది. కాని ఇట్లు నిరాకరింపక ఈ యనుభవము ననుసరించినచో, పైఁజెప్పిన విరోధముయొక్క ఉభయ పక్షములకును ఐక్యముజేయు రహస్యము లభింపఁగలదు. సర్వాతీతమైన సత్తయొక్క అనుభూతి యొకపక్షము, దానికి పరమవిరుద్ధమై తోఁచెడు ఈ సంసారముయొక్క అనుభూతి రెండవపక్షము. ఈరెండు పక్షములకును విరో

ధము లేదన దీ యన్యానుభవము, ఈ రెంటికిని సామరస్యమును కలిగించుచున్నది. మనకు సాధారణముగా అనుభవమయ్యెడు చేతన పరిచ్ఛిన్నము, పరిమితము, మొగదలయందలిది. ఇది ప్రాణముయొక్క కానుపు; పునాది దీనికి భౌతికశరీరము. కాని వేఱొకచేతన కలదు-మిక్కిలి యూర్ధ్వమున; దానిప్రసారము మిక్కిలి విశాలతరము, దానియవగాహన అగాధము. జగత్సత్తకును తదతీతమైన సత్తకును గోచరించెడు విరోధము మనుష్యుని ఈ చేతనయందు శమించుచున్నది. వ్యష్టిజీవితముయొక్క సంపూర్ణోద్దేశము ఇచట సువ్యక్తమగుచున్నది. మఱియు ఈ ఊర్ధ్వచేతనయందలి ధ్రువనిష్ఠ ఆమూలాగ్రముగా మన సర్వజీవితమును మార్చి వైవఁగల శక్తికి మూలమగుచున్నది.

ఇఁక మనబాహ్యదృష్టికి గోచరించెడు భౌతికాది తత్త్వముల యథార్థము నరయవలసియున్నది. ముని మొదటిదిగాఁదోఁచు భౌతికపదార్థమును బరిశీలింతుమేని, అదియు మూలతత్త్వము కాదు, కార్యజాతములోనిది; స్వతస్సిద్ధముకాదు; స్వయంభువు కాదు. ఆకారణముచే అవి అసత్య మనరాదు, సత్తయే; ఇంద్రియమునకు గోచర మగునట్లుగా తన్నుఁదా నాకారించుకొనెడు సత్త.

ఈయింద్రియము వ్యక్తిదని, ప్రత్యేకతఁబడసినమనుష్యుని దని కాదు; సర్వవ్యాపిమైన విశ్వచేతనయొక్క యింద్రియ జ్ఞాన మిచ్చుట నుద్దిష్టము; సర్వానుభువగు ఈ విశ్వచేతనయందు పరిచ్ఛిన్నమైన ఆంశికవ్యాపారము మాత్రము మనుష్యుని ఈ ఇంద్రియాదిజ్ఞానములు. అందుచే, ఇంద్రియగోచరత్వమునకనువుగా తన్నుఁదా నాకారించుకొనెడుశక్తి అనఁగా స్రష్టృత్వము వ్యష్టిచేతనయందుండఁజాలదు; అది సమష్టిచేతనయందు. తనచిచ్ఛక్తియొక్క ఒకానొక విశిష్టవ్యాపారముచే తనచేతనకు తనుఁదా నిరూపించుకొనుసత్తయే భౌతికతత్త్వ మగుచున్నది. ఇది భౌతికజగతియొక్క పునాది;ఇదిలేనిది శరీరగతములై ప్రాణము, మనస్సు, ఆత్మ యనునవి వికసింపవు. కాని యీహేతువుచే, భౌతికవాది తలపోయునట్లు, ఇదియే మిగిలిన యన్నింటికిని మూలము, ఉపాదానము, సత్యమును కానేరదు. భౌతికతత్త్వమును ఆత్మయు సత్యమున నొక్కటియే; ఇంద్రియగోచరమైన ఈ జగమంతయును వాస్తవముగా బ్రహ్మమే; అన్యమేమియును కాదు,— 'సర్వం ఖ ల్విదం బ్రహ్మ'. కాని ఆత్మ, లేక చైతన్యము సత్తయొక్క స్వతస్సిద్ధమైన పరమసత్యము, మఱిభౌతికపదార్థమానసత్తయందలిశక్తియొక్క ఒకానొక

బాహ్యఫలితము, దానిని సమగ్రముగాఁ దెలుపలేని ఒక చిహ్నం, విశ్వవ్యాపారమునందు చైతన్యముతనుఁ దా నావిష్కరించుకొనెడు బహ్వాంశములలో ఒకానొకయంశము.

బాహ్యదృష్టి కీ విషయము గోచరింపదు; ఏలన భౌతికపదార్థము ఏశక్తియొక్క వ్యూహముగా, ఫలితముగా లేక ఆధారముగాఁ జూపట్టుచున్నదో, ఆశక్తి అనాధ్యాత్మికముగా, అచేతనముగాఁ గాన్పించుచున్నది. భౌతికపదార్థమునుండి ప్రాణము వెలువడిన తరువాత, ఆ ప్రాణమునందు చేతన * ధాతు † బద్ధమై, మనోగతమై తలచూప వచ్చును గాక; కాని భౌతికశక్తి జడశక్తిగానే మనకు మొదటఁదోఁచుచున్నది. ఐనను అది నిశ్చేతనము కాదు, నిమగ్నచేతనము. మనుష్యులందును జంతువు

---

* ప్రాణ చేతన పదము లిచట భిన్నతత్త్వములను దెలుపును. ప్రాణధాతువు లేక ప్రాణతత్త్వము యొక్క లక్షణము చేష్ట, స్పందము; చేతనధాతువుయొక్క లక్షణము తెలియిక, ఎఱుక. వాడుకయందు చేతనము అనుపదమునకు ప్రాణముకలది యను వ్యవహార ముండుటచే, ఇచట గ్రహింపఁబడిన భేదము విశదము చేయవలసివచ్చినది. వేదాంతములందును ప్రాణము వేఱు, చేతనము వేఱు.

† ప్రాణవాహకములైన సూక్ష్మతంతువులు, ధాతువులు Nerves ధాతుశబ్దము తత్త్వము (Principle) అను నర్థమునందుఁగూడ వ్యవహరింపఁబడినది.

లందును కనఁబడు మానసికచేతనయే చేతనయొక్క సర్వరూపమును కాదు, దానికి పైనను ఉత్తరోత్తర వికాసము గల చేతనయొక్క ఆరోహణ కలదు. దానికి క్రిందను, పోయినకొలఁదిని ముడుచుకొనిపోవు చేతనయొక్క అవరోహణ కలదు. మనయందును నిగూఢమైన వేఱొకచేతన కలదు; అందు కొంత మన సాధారణ బాహ్యచేతన కధఃస్థితము, కొంత ఊర్ధ్వ స్థితము. మఱియు నది మన నిదురయందును, అగ్రహణ యందును జాగరూకము, సవ్యాపారము. అట్లే భౌతిక పదార్థముయొక్కయు, భౌతికశక్తియొక్కయు నిదుర యందును, అగ్రహణయందును ఒకానొక చేతన కలదు; వ్యాపారమునందు, అతిశయమునందు, అవయవవ్యూహ మునందు భేదించినను, చేతన అన్నింటియందును, అందఱి యందును తత్త్వమున నొక్కటియే. కావున నీభౌతిక పదార్థము సత్తయొక్కరూపముమాత్రమేకాదు, సచేతన మైన సత్తయొక్కరూప మనవలయును. అవయవి సా ధారణమైన మనస్సుయొక్కచిహ్నము లేకపోయినను, మనస్తత్త్వము దానియందు కలదు; కావున భౌతికపదా ర్థము విశ్వగతచైతన్యమందలి సత్తాశక్తియొక్కఫలితము, కార్యము, స్వాంకితమైన చిహ్నము.

ఏహేతువుచే మనుష్యులందును జంతువులందును తప్ప ఇతరత్ర చేతనలేదని మనము సాధారణముగా అనుకొనుచున్నామో, ఆహేతువుచేతనే ప్రాణమునుగూడ కొన్నింటియందే కలదానినిగాఁ దలపోయుచున్నాము. మనమునిర్జీవములుగాఁదలపోయువానియందును బ్రాణము కలదు. లోహమునందును, ఇతరభౌతికపదార్థములందును గలప్రాణమును తరులతాదులయందుఁ గల ప్రాణమును తత్త్వమునం దొక్కటియే; కాని లోహాదులయం దది ధాతుసూత్రములచే సంనద్ధము కాలేదు, తరులతాదులందువలె దాని యావిష్కార మంతపైకి రాలేదు. కావున శక్తిరూపముగాఁ బ్రవర్తించు చైతన్యముయొక్క బహు స్థాయి భేదములు గల ఒకానొక వ్యాపారముగాఁ బ్రాణమును మనము నిరూపింపవచ్చును. దీనిప్రథమస్థాయి భౌతికపదార్థము నందు; తరువాత దీనిని లుకుధాతువ్యూహము కల అవయవి యందు; (ఇట్టియవయవియే మనము ముఖ్యముగా ప్రాణమని వ్యవహరించుదానికి ప్రతిష్ఠ లేకయాధారము); తరువాత మనస్సుకల సత్త్వయందు. ప్రాణ మీ యన్నిస్థితులందును ఏస్థాయికిఁ దగిననిర్మితిభేదముతో, వైలక్షణ్యముతో, అతిశయముతో ఆస్థాయియందు కనఁబడుచున్నది; ఐనను ఈసోపానదశల

యం దన్నింటను అది తాత్త్వికముగా నొక్కటియే. మఱియు నీయారోహణ మింతటితో ఆగిపోవునని యేల తలంపవలయును? మనస్సునకు పైన చైతన్యముయొక్క ఉచ్చతరశక్తు లున్నచో, అయ్యవి బయల్పడినపుడు ప్రాణముయొక్క అతిశయమును ఈ ఆరోహణక్రమమునం దింకొక ఉచ్చస్థాయిని జేరుననుట న్యాయ్యము.

భౌతికపదార్థము సత్తయొక్క రూపము, చైతన్యశక్తియొక్క చిహ్నం, క్రియాఫలితము; ప్రాణము సత్తయొక్క విశ్వవ్యాపియైన వ్యాపారము, చైతన్యశక్తియొక్క క్రియా విధానము. మఱియును ఈ ప్రాణవృత్తియం దెల్లప్పుడును చేతన, లేక తెలియిక కలదు; ఈ తెలియిక ఒకప్పుడు కేవలము తనవ్యాపారమందు నిమగ్నమై తన్నుం దాను మఱచిన ట్లుండును మాత్రము. కాని యిక మన స్సేమి? సత్తయం దంతర్గతమైన చేతన ఇట్టి నిమగ్నతలోనుండి బయలువెడలి, తన్నును, తన బాహ్యమును ఏవృత్తిద్వారమున చూచునో ఆవృత్తియేమనస్సు. తాను నిర్వహించిన, నిర్వహించుచున్న, నిర్వహింపనున్న కార్యము నంతను సరిగాగ్రహించి, పరీక్షించి, తెలిసికొని నియమించుటకై చేతన నిర్మించుకొన్న ఉపకరణ మిది. నిమగ్నదశయందు ధాతుతంతువుల ప్రతి

స్పందరూపముగా మాత్ర ముండియున్న చేష్టితము ఇపు డింద్రియ మగుచున్నది; అంతర్లీనమును, నైసర్గిక మును, యంత్ర క్రియాసదృశమును ఐ యుండిన గ్రహణ ఇపుడు బుద్ధి యగుచున్నది; అంతర్లీనమును, నైసర్గికమును, యంత్ర క్రియాసదృశమును ఐయుండిన ఆవేగము, చిత్సత్తయొక్క శక్తియందలి యొక ప్రకారమే, ఇపుడు సంకల్పము, లేక ఇచ్ఛ యగుచున్నది. ఇవన్నియును క్రొత్తగా సృష్టింపఁబడుటలేదు, సత్త యొక్క అన్నిరూపులయందును, పరమాణువునందును పరమాణువుయొక్క విద్యుదంశములయందును, తమ తత్త్వాంశయందు, జడవృత్తియొక్క విధానముతో, పూర్వమునుండియు నిలిచియే యున్నవి. కాని మను ష్యునియందు వానివ్యాపారము విలక్షణమై తోఁచుటచే, ఆ విలక్షణతగల వృత్తులకే ఇంద్రియ- బుద్ధి - సంకల్పము లని పేరిడి, వానిని మనుష్యునందు (జంతువులందును) క్రొత్తసృష్టి యై దిగినట్లు భావించుచున్నాము. కాని యివన్నియును తత్త్వాంశయందు సర్వగతములై యుండి, మనుష్యునందు విలక్షణరూపమున పరిణమించుచున్నవి. కావున ఏవిధముగా ప్రాణము సర్వవ్యాపియని గ్రహించి తిమో అట్లే మనస్సును సర్వవ్యాపియని గ్రహింపఁగలము.

కాని యీవిషయమును ఊహతో గ్రహించుట కాక, ప్రతిపత్తియందును, అనుభవమునందును ఆరూఢము చేసికొనవలయునేని, శారీరమును, ప్రాణబద్ధమును ఐనమనస్సుయొక్క బహిరాకృతులనుమాత్రమే చూచి తృప్తిపడఁజనదు. అట్లు తృప్తిపడితిమా భౌతికవాదమో, ప్రాణవాదమో అవలంబింపవలసియుండును. అనఁగా మొదటిపక్షమున మనఃప్రాణములు సచేతనమును, సక్రియమును కాఁజాలిన భౌతికపదార్థ మనవలయును; లేదా రెండవపక్ష మవలంబించి, ప్రాణమే మూలమైన ఏకతత్త్వమనియు, దానిపైకార్యము మనస్సనియు, క్రిందికార్యము భౌతికపదార్థ మనియు గ్రహింపవలయును. కాని మనస్సుయొక్క బాహ్యమునుమాత్రమే చూడక లోన ప్రవేశించితిమేని, ఇచటను అనేక సోపానములు గలవని గ్రహింపఁగలము. అధోవ్యవస్థితమైన చేతనయందు, లేక అధశ్చేతనయందు (Sub-Conscience) మనస్సు తత్త్వాంశయం దున్నను ఒకరూపమును ధరింపలేదు ; తన్నుఁదా తెలిసికొను వృత్తికైన ఒకానొక ఉపకరణమై మొదట నది పశువునం దేర్పడుచున్నది ; స్వసంవేదనయొక్క అతిశయముతో, ఉచ్చతరస్థాయియందు కుశలతర నిర్మాణముతో నది తరువాత మనుష్యునం దేర్పడు

చున్నది ; మనుష్యుని తెలియికకు పైనున్న చేతన యందు, అనఁగా ఊర్ధ్వచేతనయందు (Super-conscience) మనస్సుయొక్క శక్తు లత్యంతమైన యతిశయమున కెత్తఁబడుచున్నవి. చేతనయొక్క ఈఉచ్చభూమిక లందు మనము మేల్కొనవచ్చును. ఇపు డీమనస్సు మనయందలి వ్యాపారములను నిరీక్షించుచు, నియమించుచు, వాని కొక అర్థమును, ఉద్దేశమును ఎట్లు వెలయించుచున్నదో, అట్లే కొంతగడచితిమేని ఈమనస్సును వీక్షించుచు, దీనిసర్వవృత్తులను వ్యాపారములను భాసింపఁజేయుచు, నియమించుచు, దీనికంటె సర్వవిధముల శ్రేష్ఠమై యున్న ఒక చేతనాశక్తియందు మనము చేరఁ గలము. ఈ ఉచ్చతరమైన చేతనాశక్తి కిచట విజ్ఞానము (Supermind) అను పే రిడఁబడుచున్నది. ఇది ఇంద్రియద్వారకముగాని అంతర్జ్ఞానము లేక స్వతఃస్ఫురణము (Intuition) యొక్కయు మఱియు ప్రత్యక్షానుభవము యొక్కయు వెలుఁగును మనస్సులోనికిఁ బాఱఁజేయును. ఇది బుద్ధిని కొంతగాఁగాని లేక నిండుగాఁగాని స్వతఃస్ఫురణముచేతనే ప్రవర్తించెడు ఇంద్రియముగా నిర్మింపఁగలదు. మానసముయొక్క ఉచ్చతమస్థాయికిని పైనిదై, సమగ్రములైన జ్యోతిఃశక్తు

లతో నిండినది దీనిస్వస్థానము. సృష్టి కతీతమైన పుట్టుక కలదై, సృష్టియందంతటను వ్యాపృతమైయున్న యనంత దివ్యప్రజ్ఞయొక్క వృత్తియై, సంపూర్ణతత్త్వజ్ఞానమునకింద్రియమై, ఈవిజ్ఞానము తనస్వస్థానమునందు వెలువడును.

ఈవిజ్ఞానముయొక్క వెలుఁగు మనబుద్ధిపై పడుటతోడనే చైతన్యముయొక్క సత్యము మనకు భానమగుట తటస్థించుచున్నది. ఈ భానము మెఱపులలోవలెను, ఆంశికమైన అనుభవముల ద్వారమునను మొదటమొదట కలుగును; కాని కొంత గడచువఱకును ఇది మనసాధారణవృత్తులకు పైనున్న ఊర్ధ్వచేతనయొక్క ఒకానొక ప్రతిబింబమువలెమాత్రమే అనుభూత మగును కాని, ఆ ఊర్ధ్వచేతనలోనికి మనము ప్రవేశింపవచ్చును; మన యిప్పటిస్థాయి నందులోని కెత్తవచ్చును; అప్పుడాయూర్ధ్వచేతన మన సాధారణజ్ఞానమునందు జాగరూకమగును. ఎల్లప్పుడును చైతన్యమే మనవాస్తవమైన సత్తయై యున్నదనియు, మనయందలి మిగిలిన వన్నియును దాని ఆంశిక రూపములందు, లేకదానిఅవరోహణక్రమమునకుఁ జెందిన క్రిందిరూపములందు ఆచైతన్యముయొక్కయే పరిచ్ఛిన్న వ్యాపారము లనియు మన మప్పుడు గ్రహింపఁగలము. అనఁగా మన జ్ఞానము, సంకల్పము, మనసత్తయొక్కశక్తి,

ఆకృతి, మన సత్తయందలి సుఖానుభూతి- ఇవన్నియు ఆ చైతన్యముయొక్క క్రిందియునికిగా నపుడు వీక్షింతుము. మన యథార్థపుటునికిమైన ఈ చైతన్యము కేవలసత్త. దీనియం దాత్మజ్ఞానము, ఆత్మానందము. ఇందు దేశ-కాల- నియమములు లేవు. దీనియునికి దీనికార్యశక్తి యొక్క రూపములపై నిలువఁబడదు; దీనియెఱుక దీని బాహ్యావస్తుజ్ఞానముపై ఆధారపడదు; దీనియానందము స్థూల సూక్ష్ములైన దీనిబాహ్యాస్పర్శలపై అధీనపడదు. ఇదియే ఆత్మ. ఇది మనయం దెట్లున్నదో అందఱియం దును అట్లేయున్నది. ఈభూతజాతమునం దిది విభక్తము కాలేదు, కాని యన్నిఁటను ఒక్కటిమైయున్నది; ఇదియే దేశ కాలము లందును, ఘటనల యందును వ్యాప్తమై యున్నది. ఇది సర్వగతము, సర్వమును సృజించునట్టిది. ఇది సర్వాతీతము, సమస్తము, వ్యస్తము. ఒకటిగా నుండియే ఇది యనేకము : ఈభూతజాతమంతయును ఏన దేదియో అదియే ఈసత్త. ఇదియే ఒక్కటిమైన మూల తత్త్వము. దీనిని సరిగా నెఱిఁగితిమేని సర్వము నెఱుఁగవచ్చును, ఏలన ఇదియే సర్వము. అందు కనియే, "యస్మిన్విజ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం" అని చెప్పఁ బడినది.

కాని ఈయాత్మను సమగ్రముగా నెఱుఁగుట విజ్ఞానమునకే సాధ్యమగును. బుద్ధియందలి జ్ఞానముచే మొదట, దాని నన్నింటియందున్న తత్త్వముగాఁ దెలిసి కొందుము; తరువాత దాని నన్నింటియందును నివ సించెడునట్టియు, మఱియు నన్నియెడలను వ్యాపించెడు నట్టియు ఆత్మగాఁ దెలిసికొందుము; ఆపై దానిని సర్వ భూతములకును, సర్వకార్యములకును నివాసమైన యాత్మగాఁ దెలిసికొందుము—"ఆత్మానం సర్వభూతేషు, సర్వభూతాని చాత్మని" అని; పిమ్మట ఈఅన్నిభూతము లును, అన్నిఘటనములును, అ దొక్కటే అనియు, ఇ దంతయు ఏసత్త అయ్యెనో అట్టిదే అది యనియు మఱియు దీని నంతయు నతిక్రమించియు ఉన్న దదియే అనియుఁ దెలిసికొందుము; అనఁగా స్వయంభువగు సత్తయే ఈ కల దంతయు నయ్యె నని—"ఆత్మా అభూత్ సర్వాణి భూతాని"—అని.

ఇఁక బుద్ధి కిక్కడ క్లిష్టము. అది సత్త-సంభూతి, బ్రహ్మము-జగము, ఈరెంటిని పరస్పరవిరుద్ధములఁగాఁ దలఁచుచున్నది; తన ఆధ్యాత్మికానుభవముతో, ఈ రెంటికిఁ దోఁచు విరోధమును శమింపఁజేయలేకున్నది. చైతన్యము, లేక యాత్మ సర్వాతీతమును, అనంతమును,

సర్వవ్యాపియును, అపరిచ్ఛిన్నమును ఐనసత్త; కాని జగమునందు మన మొదటి యనుభవము పరిచ్ఛిన్నమైన, వ్యష్టిసత్త- ప్రత్యేక శరీరము, ప్రత్యేకమైన ప్రాణము, ప్రత్యేకమగు నహంత. ఆత్మ సర్వాతీతమును, అనంతమును, సర్వవ్యాపియును, అపరిచ్ఛిన్నమును ఐనచేతన; కాని మన మెఱిఁగినది మనప్రత్యేకసత్తకుఁ జెందిపరిచ్ఛిన్న మైనట్టియు, ప్రత్యేక మైనట్టియు మానసము. చైతన్యముయొక్క-శక్తి సర్వాతీతమును, అనంతమును, సర్వవ్యాపియును, అపరిచ్ఛిన్నమును ఐన సంకల్పము, లేక ఇచ్ఛాబలము; కాని మన కనుభవమైనది, ప్రత్యేకములైన మన మనః ప్రాణ శరీరాహంతలకుఁ జెంది, మేరలం దరికట్టఁబడిన ఒక ప్రత్యేకమైన ఇచ్ఛాశక్తి. మఱి చిత్సత్తమైన ఆత్మయొక్కయు అందలి సంకల్పముయొక్కయు, అందలి గత్యాత్మకమైన సకలవ్యాపారముయొక్కయు నైజమే ఆనందము —సర్వాతీతమైన, అనంతమైన, సర్వవ్యాపియైన, అపరిచ్ఛిన్నమైన ఆనందము; ఇఁక మన మెఱిఁగినది సుఖదుఃఖముల ద్వంద్వము, లేక ఈరెంటియొక్క అగ్రహణ, లేక సుఖమును దుఃఖమునుగాని యొకమధ్యమస్థితి. ఈసందర్భమున, ' ఈ జగత్సత్తయంతయు నొక భ్రాంతి, బ్రహ్మము తన కేవలసత్తయందే సత్య

ము, యథార్థము; బ్రహ్మముయొక్క ప్రాతిభాసికమైన, అనఁగా ఈ కనఁబడునట్టి వ్యాపారమంతయు మిథ్య, స్వవ్యామోహాకము, భ్రాంతిసత్యము మాత్రమే మైన వ్యావహారికసత్యము' అని యూహించుట సహజ మగు చున్నది. ఈయూహ నిజమైనచో జీవితమునుండి తప్పించుకొని బైటపడుట పూర్ణమైన యాధ్యాత్మికత కావశ్యక మగును.

కాని అది నిజము గాదు. ఏలన జీవి లేక ఆత్మ తన అనంత సచ్చిదానందముల గుణక్రియారహిత మైన కేవల శాంతిని బడయుటచేత నే తన పరిపూర్ణతను బడ యదు. దాని పరిపూర్ణత, తనసత్తయొక్క విశ్వాతీతత్వ విశ్వగతత్వము అగు యుగపదను భూతిచే చేరుపుట యందు; ఒక్కటనేఅతీతత్వమునందును విశ్వవ్యాపారము నందును, మఱియును ఆ హేతువుచేత నే, విశ్వాంతర్గత మైన వ్యష్టిచేష్ట సకలమందును, సత్తయొక్క సర్వదశా భేదమునందును సంపూర్ణమైయున్న ఆనందము ననుభ వించుటయందు. ఇదియే ఆత్మయొక్క పరిపూర్ణత. చైతన్యము విశ్వాతీత మయ్యును, విశ్వగతమైనసత్తయు నానందమును ఏక కాలీనమై దానియందుఁ గలవనుట తెల్లము; లేదేని యీవిశ్వ మొక్కక్షణము నిలువనేరదు.

కాని మనుష్యుఁడీపూర్ణస్థితికి చేరఁగలఁడా యని ప్రశ్న. నిష్క్రియమైన అనుభూతియందును, ప్రతిబింబమువలె నైన గ్రహణయందును చేరుటమాత్రమే కాదు; అట్లు చేరఁగలఁడనుటయందు సునిర్ధారితమైన యాధ్యాత్మికానుభవముయొక్క యంగీకారము కలదు; సక్రియమైన యనుభూతియందును, స్థిరమును, ధ్రువము నైన ప్రాప్తియందును మనుష్యుఁడీస్థితికిఁ జేరఁగలఁడా యను విషయమును విచారింపవలయును.

మనస్సున కూర్ధ్వగతమైన విజ్ఞానము అనేకత్వమందును ఏకత్వమును స్థిరముగా నూఁదియున్నది; అంతవంతమందును అనంతముయొక్క అనుభూతి దానికిఁ గలదు; వ్యష్టిచేతనయందును సర్వాతీత- సమష్టిచేతనల నది యెఱుఁగును; పరస్పరము ఘర్షణపడు ఇచ్ఛల అసంఖ్య బాహుళ్యమునందును వానినన్నింటిని మేళవించెడు పరమేచ్ఛ నది యనుభవించును; పరస్పర ప్రతియోగికములైన మానసికజ్ఞానముల కన్నింటికిని సంవాదము కలిగించు సూత్రము దానియందుఁ గలదు; మనయునికి యందు పైకిఁగనఁబడు ఈమర్త్యధర్మమునం దది యమృతత్వమును రసించును; మనస్సుపట్ల సుఖదుఃఖనిర్వేదరూపమైన సర్వానుభవమునందును అది తొలఁగి

పోఁజాలని స్వతస్సిద్ధమైన యానందము ననుభవించును. మనుష్యుఁ డీవిజ్ఞానముయొక్క శక్తిస్వభావముల నందు కొనఁగలఁడేని, పోనీ దానిని తనయందు ప్రతిబింబింపఁ జేసికొని తనయునికియం దంతటను దానితో సామంజస్యమును నెలకొల్పుకొనఁగలఁడేని, పైవివరింపఁబడిన ఆత్మపరిపూర్ణత నతఁడు చేరఁగలఁడు. ఇది చేయలేఁడేని అతని ఈ ఉత్తరోత్తరపరిభవము కల ఐహికయాత్రకు, సంభూతికి అపజయమే అవసానము. లేదా నిజమగు ఉత్తరోత్తరాతిశయ మిచట లేదనవలయును; అతని ప్రకృతి విరుద్ధధర్మమయమును, దోషజుష్టమునై, ఇప్పటి గిఱిలోపలనే ఎప్పుడును వర్తింపవలయును; సృష్టిలో నుండి తన్నుఁ దా రద్దుచేసికొనుట యొకటియే అతనికి ముక్తిమార్గము కావలసివచ్చును.

పై పరిపూర్ణతయొక్క సాధ్యాసాధ్యతలను నిర్ణయించుటకు, చైతన్యము (లేక యాత్మ) ఏవిధమున ఈ విజ్ఞానముచే విశ్వమును సృజించి, దీనియందుఁ బ్రవర్తించుచున్నదో ముందెఱుఁగవలయును. విశ్వమందన్నింటియందును ఆత్మ కలదు; మఱియు ప్రతిరూపు వెనుకను ఆత్మయొక్క యునికి యంతయును ఉపస్థితమై యున్నది; మఱియు నది యిచట విభక్తమైలేదు. ఏలన

ఈ ఒక్కయాత్మయే యన్నింటియందును కలదు. ఇది మొదటివిషయము. ఇఁక రెండవవిషయము: ప్రతిదాని యందును, అన్నింటియందును విజ్ఞానము కలదు; ఇది ఆయా ప్రత్యేకసత్తకుఁ జెందినధర్మమును తనయందు వహించి, తనగ్రహణయందు లక్షించి, స్వైరముగా నిర్వహించును; విశ్వవ్యాపియైన ఈవిజ్ఞానము అణువు అణ్వాంశముకడనుండి సమస్తమునందును నిహితమై యున్నది. ఇదియే సర్వసత్తయందును స్వగతమైయున్న దివ్యప్రజ్ఞ, దివ్యసంకల్పము. ఇదియే ప్రతిసత్తయందును దాఁగి, దానిదానికర్మయందు దానిని ప్రేరించెడు అంతర్జ్ఞానము; ఇదియే సృష్టియొక్క సకలకార్యమును ప్రారంభించుచున్నది, నియమించుచున్నది, మార్చుచున్నది, పరస్పరము మేళవించుచున్నది. ఆత్మ యిట్లు మఱుఁగునందుండి వర్తించెడు నీచందమంతయును భౌతికప్రపంచమునందు మాత్రము. మన సాధారణానుభవమునందు మనః ప్రాణములు భౌతికపదార్థమునం దవరుద్ధములు; మఱియు చైతన్యవిజ్ఞానములుకూడ భౌతికములైన ప్రాణమనఃశరీరములయం దవరుద్ధములైయున్న రీతిగాఁ దలఁచుచున్నాము; కాని సృష్టియందంతటను ఇది సత్యము కాదు. ఏలన, చైతన్యముయొక్క ఆవిష్కారమందు

భౌతికపదార్థము మొదటిరూపు కాదు, కడపటిది; అట్లే చైతన్యముయొక్క వ్యాపారమునందు భౌతికసృష్టి మొదటిసోపానము కాదు, కడపటిది. భౌతికసృష్టికంటె పూర్వములైనట్టియు, ఉన్నతములైనట్టియు భూమికలు కలవు. ఇయ్యవి భౌతికసత్త్వయొక్క కార్యములు కావు; ప్రత్యుత భౌతికసత్త్వయొక్క ఉనికియే వానిపై ఆధార పడియున్నది. కావున విజ్ఞానమయమగు స్వభావమును సంపూర్ణముగాఁ జేరి పరిపూర్ణతఁ బడయవలయునన్నచో, ఈభౌతికమైన యునికియందుండియు మనుష్యుఁడు తన చిత్సత్త్వయందలి ఉచ్చభూమికలను తెఱచివేయవల యును.

ఉనికి యనునల్లిక సత్త్వయొక్క సప్తధాతువులతో* నేయఁబడియున్నది; ఈసప్తధాతువుల నవలం బించియే వేర్వేఱు భూమికలు. సచ్చిదానందముయొక్క కేవలమైన యునికికిఁ జెందిన మొదటి మూఁడు ధాతువులును చైతన్యమయములు. అవి అనంతసత్త్వ, అనంత చితి, అనంతానందము. ఇందొక్కొక్క తత్త్వము క్రమ ముగా ప్రధానమై మిగిలినవి అప్రధానములై నిలుచుట చేత సత్త్వయొక్క భిన్నఛందస్సులై ఊర్ధ్వభువనము

---

* సచ్చిదానందములు, విజ్ఞానము, మనః ప్రాణ భౌతికములు.

లేర్పడుచున్నవి. సచ్చిదానంద ధాతుత్రయాత్మకమైన ఉనుకువయందు, చైతన్యముయొక్క ఈపరమోన్నతము లైనలోకస్థితులయందు, ఆనంత్యముయొక్క అనుభూతియు, మఱియు సమష్ట్యనుభూతి వ్యష్టియందును, వ్యష్ట్యను భూతి సమష్టియందును ముఖ్యధర్మములై యుండును. కాని ఏ లోకమందైనను, దాని ఉనికి యెచటనైనను, నాసిస్థాయి యేదైనను, పరస్పరములైన సంబంధము లును, వానిని నియమించెడు ధర్మమును ఉండి తీర వలయును. ఈధర్మము దివ్యవిజ్ఞానమునందు కలదు; ఐక్యబహుత్వము లను రెండుపోగులుగల దీనికర్మసూత్ర మువలన, ప్రతీతి స్థిరమై నిలిచియున్న ఐక్యమను పునా దిపై బహుత్వము నిర్మింపఁబడుచున్నది. విజ్ఞానమునందు సత్తయొక్క చిచ్ఛక్తియే జ్ఞానసంకల్పముల రూపమును బొందుచున్నది. వీనియొక్క జ్యోతిరైశ్వర్యముల సాయ మున, తనయందు శక్తిరూపమున లోనిమిడియున్న సర్వ మును విజ్ఞాన మభివ్యక్తము చేయుచున్నది. దీనిభావమే వస్తువు, వస్తువే భావము; ఇచట భావమునకును అర్థ మునకు లేక వస్తువునకును తాదాత్మ్యము; విజ్ఞానము యొక్క భావసర్గమే వస్తుసర్గ మగుచున్నది. దీని సృష్టి అవస్తు వగు భావమాత్రము కాదు, వస్తువు

వాస్తవము. ఇది కేవల ప్రాతిభాసికరూపముల సృజించు ఇంద్రజాలముకాదు; సత్తయొక్క వాస్తవాంశముల సృజించెడు సత్త యిది. కావున ఈ విజ్ఞానమును స్రష్టమైన వాస్తవభావ (Real Idea) మనఁ దగును. విజ్ఞాన ప్రధానమైన భూమికయందు ఏకము తన ఐక్యమందలి బహుత్వమును వెలిచేసి దానియం దానందించుటయేకాక, ఆ బహుత్వమునందలి ప్రతిదియును ఐక్యమును గ్రహించి, యనుభవించి, దానియం దానందించుటయుఁ గలదు. అనేక మిచ్చటబయలుపడి ముందునకు వచ్చుచున్నది; అనేకమందలి ప్రతిదానికిని ఇచట ప్రత్యేకసత్త; ఐనను తదితర సత్తలనుండి యది పృథక్కృత మగుటలేదు, పూర్తిగా వేఱుపడదు; ఏలన సమస్తమునందు వ్యస్తము, వ్యస్తమునందు సమస్తము, లేక సర్వమునందు ప్రతిదియును, ప్రతిదానియందు సర్వమును అను ధర్మ మింకను చేతనయందు నిలిచియున్నది. మనఃప్రాణభౌతికము లిచట స్వతంత్రధాతువులు కావు; ఇచటి సత్త యం దింకను అవి అప్రధానవృత్తులు; అవి యిచట చేతననుండి విడిపడని భావము, శక్తి, సత్తాపదార్థముగామాత్ర మేర్పడియున్నవి. ఇఁక మనఃప్రాణభౌతికములు క్రమముగా, తమతమ భూమికలలో ఒక్కొక్కటిగా, ప్రధానధాతువులైనప్పుడు,

చేతననుండి ప్రాణముయొక్కయు, ప్రాణమునుండి భౌతికము యొక్కయు విడిపాటు అనుభూతియొక్క ముఖ్యవిషయ మగుచున్నది. ఇంక నీ యనుభూతి పృథక్త్వమునం దిమిడియున్న వైవిధ్యము నానందించుకొఱకు. ఈ వైవిధ్య ముపై మానసిక ప్రాణిక భౌతికప్రపంచములు ప్రతిష్ఠింపఁ బడియున్నవి.

కాని పృథక్త్వ మీ భూమికలయందును బాహ్యము, మొగదలయందుమాత్రము. ఏలన ఐక్య మెల్లప్పుడును ఉనికియొక్క పునాదియైయుండక తప్పదు. ఎట్లన, పృథక్కృతమైన యీశరీరము విశ్వగతమైయున్న ఒకేపదార్థముయొక్క ఒక ప్రత్యేకాకారము; అట్లే పృథక్కృతమైన యీప్రాణము విశ్వప్రాణమునందలి ఒక ప్రత్యేకకళ, మఱియును పృథక్కృతమైన యీమనస్సు సమష్టి మానసమునందలి ఒక ప్రత్యేకాంశ. మన పై తెలియిక యందీ ఐక్యమే శక్తివలన మఱుఁగుపడి ఎఱుక కందకున్నది? తన సత్తయందలి ఒకభావ మందు, ఒక క్రియయందు, ఒక ఆకృతియందు చిత్సత్త అవధానతత్పరతతో నిమగ్నమై నివసింపఁ గలదు; ఇదియే దీనిస్సృష్టిశక్తి, లేక తపస్సు; ఈశక్తియొక్క ఒకానొక పరిణామమువలననే ఐక్య జ్ఞానముయొక్క

విచ్యుతి కలుగుచున్నది. తనయొకానొక అగ్రతలవర్తి యనఁదగు వ్యాపారమునందు, పృథక్కారులగు ఈభావ క్రియాకారములలో చిత్సత్త కొంతనిమగ్నమై, తన మిగిలిన చేతననంతయును వెనుకకొదిగించి, అగ్రతలము నందు పరివర్తియైయున్న వ్యాపారమునకు తన్ను మఱుఁగుపఱచుకొనుచున్నది. ఆత్మయు దానిచేతనమును సంపూర్ణముగా వెనుకనిలిచియే యున్నవి; కాని ఈ ఉపరివర్తియైన వ్యాపారమున వానిగ్రహణ లేదు; ఐనను సకలమగు నాత్మచేతనే సమగ్రమైన దానిజ్ఞానము చేతనే ఆ వ్యాపారము నిర్వహింపఁబడు చున్నది. చిత్సత్తయొక్క ఉపరితలవృత్తియందలి భాగ మీ విధమున బహిర్గోచరమైన పృథక్త్వమునందు నివసించి, సర్వమును పృథక్త్వ దృష్టితోఁ జూచు చున్నది. ఇదియే మనముండెడు అజ్ఞానము — సమగ్రమైన, అనఁగా సర్వగతమైనట్టియు, సర్వాతీతమై నట్టియు మన సత్త నెఱుఁగలేకపోవుట. ఇందుచే మనయునికి ఆత్మయందుఁ గాక భౌతికపదార్థమునం దున్నట్లు, ఆత్మయొక్క అనంతచైతన్యమునందుఁగాక విభక్తమైన మనస్సునం దున్నట్లు మనకుఁ దోఁచుచున్నది. కాని మనయథార్థమైన యునికి మనయెఱుక కందని దాని

యందు; మిగిలిన యీయెఱింగినది దాని పరిమితమును, ఉపరిగతమును ఐనవ్యాపారము. ఇట్లు పరిమితి ఏర్పడుటయే ఈ బహిర్గోచరమైన పృథక్త్వమునకు మూలము; ఇదియే అజ్ఞానముయొక్క ముఖ్యధర్మము. ఇది, మనసత్తయొక్కయు చేతనయొక్కయు శక్తిని పరిమితము చేయుటచేతనే, సత్తయందలి యానంద సామర్థ్యమునుగూడ పరిమితము చేయుచున్నది; సచ్చిదానందమునందలి సత్యమును ప్రతిషేధించుచున్నట్లు తోఁచు వ్యతిరేకానుభూతిని మనకుఁ గలిగించుచున్నది. స్వవ్యాపారనిమగ్నతచే చిత్సత్త తన్నుఁదా విస్మరించుట యీ భౌతికశక్తియందును, భౌతికపదార్థమందును అవధి నంటుచున్నది. ఈ శక్తియొక్క కర్మవిధానములయందు చేతన సంపూర్ణముగా తిరోహితమై లీనము; ఈ పదార్థముయొక్క ధర్మము నిశ్చేతనము. భౌతికసత్తయందు తిరోహితమైన చైతన్యము తిరిగి యాత్మజ్ఞానమును బడయుటకై పట్టినదారియందు మనయజ్ఞాన మొక మజిలీ. ఈ ఇహలోకపు టునికియొక్క నిబంధనమునందు ఆ ఆత్మజ్ఞానమును బడయుట, ఇప్పటియునికిని సత్తయందలి ఉచ్చభూమికలధర్మముచే నియమించుట, కడకు చైతన్యముయొక్క పూర్ణధర్మము

నందు దీనిని నిలుపుట—ఇదియే మానవజాతియొక్క యాత్రకు గమ్యమైన పరమావధి, ఇదియే పరిపూర్ణత.

జగమునందలి పరిణామధర్మముచే మనుష్యున కీ పరిపూర్ణత సాధ్యమగుచున్నది. ఇచటి భౌతికపరిణామమునందు భౌతికధర్మమును భౌతికనిబంధనయు మొట్టమొదటివైనను, భౌతికపదార్థమునందు సత్తయొక్క మిగిలిన ధాతువులన్నియును అంతర్నిహితియందుపస్థితములై యున్నవి. ఈ అంతర్నిహితియందుండి యవి వెలువడుట యనివార్యము: ఇదియే పరిణామము. మొదట ప్రాణము, పిమ్మట మనస్సు, తరువాత నాత్మయు వ్యక్తమగుచున్నవి; ఇక నాత్మవ్యక్తమై విజ్ఞానమును, మఱియు తన మూలధాతువులైన సచ్చిదానందములను వాని సంపూర్ణతతో వ్యక్తముచేయక తప్పదు. ఇచట మనుష్యుడు మనోమయసత్త్వము, ఇతనియందాధ్యాత్మికమైన పరిణామము సాధ్యమగుచున్నది. కేవలము భౌతికప్రపంచమే యుండెనేని, భౌతికసత్తయొక్క నిబంధనమునందే ఆ పరిణామముయొక్క వ్యాప్తి నిలిచియుండవలసివచ్చెడిది. కాని మనుష్యుఁ డందుకోఁగల ఉచ్చభూమికలు కలవు; యథార్థమునకు, వాని నతఁడు తన తెలియికకు పైనున్న ఊర్ధ్వచేతన ద్వారమున, తన యాత్మయొక్క

పూర్ణసత్తయందు,పడసియేయున్నాఁడు;వానితో నతఁడు కలిసియే యున్నాఁడు. ఇచటి తన ఐహిక జీవితమునందు వానికి రూప మేర్పఱచుట; వానియొక్క మహత్తర సత్యములకు తన్నుఁదాఁ దెఱచుకొనుట; చైతన్యముయొక్క ఉత్తరోత్తరము లైన ధర్మముల ననుసరించి, వానిచే అవరసత్తయందలి తన సకల జీవితమును శాసించి నియమించుట— ఇది ఆతని పరిపూర్ణత కావశ్యకమైన విధానము. ఇప్పటి కతఁడు మనస్సుచే ప్రాణమును, శరీరమును నియమించు యత్నమువఱకు మాత్రము చేరినాఁడు; కాని ఆధ్యాత్మికములగు నంశ లిదివఱకే అతనియం దభివ్యక్తము లగుచున్నవి. విజ్ఞానముయొక్క శక్తిస్వభావములను తనయందు సమృద్ధముచేసికొని, తద్ద్వారమున మనోమయ—ప్రాణమయ—అన్నమయ శరీరములను నియమించుటయేగాక, చైతన్యసత్తచే వానిని రూపాంతరమొందఁజేసి, పరిపూర్ణత నతఁడు సాధింపఁగలఁడు. ఇది క్రమక్రమముగా ఉత్తరోత్తర వృద్ధిచేఁగాని సాధ్యపడదు. ఈ క్రమవృద్ధికొఱకే భూమిపై మనుష్యరూపమున జీవియొక్క జన్మప్రవాహము; ఇందుకొఱకే మృత్యు-పునర్జన్మల యంతరమునం దుత్తరభూమికల కతఁడెక్కి, తన యనుభూతికి క్రొత్త రూపిచ్చుటకై, మానుష్యకము

నందు బయలుపడు చైతన్యముయొక్క ఆవిష్కృతికి సాయపడుటకై మఱల తిరిగి వచ్చుచున్నాఁడు. తన్నుఁదా అధికాధికముగా తెలిసికొనుట, తన్నుఁదా అధికాధికముగా ఆవిష్కరించుకొనుట— ఇది మనుష్యుని ఉనికియందలి ధర్మము. ప్రతి జన్మయును అతని అభియానమునందలి యొక ఘట్టము.

ఆత్మయొక్క ఈ అపావృతియు, ఆవిష్కారమును వ్యక్తియందు సాధింపఁబడవలసియున్నవి. ఏలన అతీతమునందు ఆత్మయొక్కయు జగతియొక్కయు సంపూర్ణోపలబ్ధి ఎల్లప్పుడును కలదు; సమష్టియందును జగత్సత్తయొక్క సంపూర్ణోపలబ్ధి కలదు, మఱియు నది అతీతముతోడి పూర్ణ సంబంధమున నిలిచియున్నది. వ్యక్తియందే అతీతముయొక్కయు సమష్టియొక్కయు సరియైన ఉపలబ్ధి లేకున్నది; ఈ రెంటిని వ్యక్తి జయింపవలయును. చైతన్య మీ అనేకమునందు, ఈ వ్యక్తియందు అవిద్య లేక అజ్ఞానముయొక్క మహోద్యమమును ప్రారంభించుచున్నది; కాని ఈ యనేకమునందుఁగూడ, ఈ వ్యక్తియందుఁ గూడ చైతన్యము తన యైక్యము నానందించుచున్నది. వేఱుచేసెడు అహంత యను ముడియందు ముడివడియున్న మనః ప్రాణ శరీరముల పృథక్త్వమును

పడఁగొట్టి సమష్టి-అతీతముల యుపలబ్ధికి తనుఁ దా తెలి చుకొని, వానితో వ్యక్తి ఒక్కటి కావలయును; నూతన మైన ఈ యాత్మానుభూతిచే తన ముక్తసత్తయందు ఆత్మ యొక్క జ్యోతిరైశ్వర్యములను సమృద్ధము చేయవల యును; ఇది మానవాత్మయొక్క లిఖితము, నియతి. ఏలన నిత్యవ్యక్తిమైన యీ మనుష్యుఁడు, అనేకత్వమున బద్ధమైన జీవియందలి యీ ఆత్మ, తన బాహ్యానుభూతి యొక్క నియతభ్రమణమునందు తృప్తిపడఁజాలక, అందుండి వెలువడి, తన స్వపరిణామమును తానే నిర్వ హించుకొనుటకై ప్రేరితుఁడగుచున్నాఁడు. భౌతిక జీవు లందెల్ల మనుష్యుఁడే తన్నుఁదా నతిక్రమించిపోవుటకు యత్నించుచున్నాఁడు, తన ఉత్తమాత్మతో తాదా త్మ్యమును బొంద నుద్వేగపడుచున్నాఁడు, ఉపరిమర్త్య మైన దివ్య మానవత్వమును గమ్యముగా లక్షించు చున్నాఁడు. మఱియు వ్యక్తి ఈ యున్నతికిఁ జేరుటయే జాతియును ఈయున్నతికిఁ జేరఁగలదనుటకు భావిసూచన, పరిణామశక్తియొక్క భవిష్యత్ఫల వాగ్దానము. ముక్త పురుషుఁ డీ గమ్యవిషయమై జాతి కాదర్శమగుటయే కాక ఆ గమ్యమునకుఁ జేర్చు కార్యమునందు పురోహితుఁడును సాధనమును కావలయును.

ఈ తిరోధాన మేల, ఈ యావిష్కార మేల? ఏల చైతన్యము తన నిష్పందమైన ఆనంత్యమందు నిమగ్నమై నిష్క్రియమై యుండదు? అని ప్రశ్నింపఁబడు నేని దానికి సమాధాన మిది: అనంతసత్తయొక్క స్వభావమునందే ఐక్యాంతర్గతమైన నిత్యబహుత్వము కలదు; దాని చిత్-శక్తియొక్క ప్రవృత్తియందే బహుత్వమునందలి తన యానందముతో తన యైక్యానందముయొక్క సంక్రీడ కలదు. గాయకుఁడు గాన మేల సృజించుచున్నాఁడని, కవి తన ఛందస్సుల నేల స్వరించుచున్నాఁడని, గణితజ్ఞుఁ డవకాశమునకును సంఖ్యకును సంబంధించిన ప్రశ్నల నేల ప్రపంచించుచున్నాఁడని మన మడుగవచ్చును. సత్త యందు తన యైక్యములయొక్కయు బహుత్వముల యొక్కయు ఆనందముకలదు. ఆత్మయుండఁగా విశ్వసర్గ మనివార్యము.

ఇఁక ప్రతియోగికములైన ఈద్వంద్వములేల, అశుభ ఫలములైన ఈ జడత, అవిద్య, అజ్ఞానము, ఇవియేల? అని ప్రశ్నయేని ఇది సమాధానము: పృథక్కరణము నందలి ప్రవృత్తి తన కట్టకడపటి యవధివఱకును పోయి తీరవలయును; దానిని వాస్తవమందుఁ జేరుటకై ఆత్మ యందు సంకల్ప ముద్భవింపఁగలదు; మఱియు తాను

చేయుదానియందు, తాను తనయందు సృష్టించుదాని యం దేకాగ్రతచే నిమగ్నమైపోవు శక్తి ఆత్మయం దున్నది; ఇదంతయు ఎచ్చటనో ఒకచోట క్రియలోనికి రాక తప్పని ఒక కార్యాంకురము నుత్పన్నము చేయు చున్నది. సర్వానంత్యమును వెనుక కొందుగఁజేసి తన్నుఁ దాఁ బరిమితము చేసికొనుటయందు, సర్వమైన ఆత్మా విష్కారమును ముంగల నిలుపుకొని తన్నుఁదా మఱపు గొనుటయందు, సర్వవిధమైన ఆత్మవశిత్వమును ఊర్ధ్వ మునసుంచి పోరుటయందు, శ్రమించుటయందు ఒక యానందము కలదు. భేద మైక్యముయొక్క ఆనందము నొసఁగుచున్నది; పోఁగొట్టుకొనుట, దాఁపురముచేసి కొనుట అను వీనిరూపుచే ఆత్మ తన ఐక్యములకును ఐశ్వర్యములకును నవనవత్వము కల్పించుచున్నది. అది మన జగతియొక్క అర్థము.

---



# శ్రీ అరవింద దర్శనము

---

## సృష్టియెడ నాల్గు దృష్టులు

ప్రపంచముయొక్క సత్య మిదియని, ఈ యునికియొక్క యుద్దేశ్య మిదియని ఒప్పుదలయేని, అనఁగా పైఁజెప్పిన తత్త్వదర్శన మంగీకారమగునేని, దీని కనుగుణముగా, జీవితమునెడ మనకుఁగల దృష్టియును, దాని లక్ష్యమును నిర్ణయింపఁబడవలయును. సత్తను దాని క్రియావిధానములనుండియు, వానివలన జన్యమగు కార్యజాతమునుండియు విడిపఱచి, దానియొక్క మూలతత్త్వములను మూలధర్మములను నిరూపించుటయే దర్శనముల లేక తత్త్వశాస్త్రముల ప్రయత్నము. కాని యావిధానములా మూలతత్త్వముల నాశ్రయించియే యుండును. మఱియును సత్తయొక్క సత్య మిదియని మనము గ్రహించిన దాని కనురూపముగా మనజీవితముయొక్క విధానమును

నిర్వహణమును, లక్ష్యమును ఏర్పఱుపవలయును; లేదేని బౌద్ధముగా నంగీకరించిన సత్యమునకు మనమున తప్పి వారమగుదుము. ఏది మనకు జీవితముయొక్క పరమార్థమో, అదియే మన స్వజీవితముయొక్కయు అర్థమును, ఉద్దేశ్యమును, లక్ష్యమును కావలయును. లోకమునఁగల ఈ యుద్దేశ్యములును, లక్ష్యములును స్థూలముగా నాలుగువిధముల క్రింద పరిగణన చేయవచ్చును; అవి పరమార్థమునుగూర్చిన నాలుగు భిన్నభావనల నాశ్రయించియున్నవి. సౌకర్యముకొఱకై ఈ క్రిందివిధమున వానిని పేర్కొనవచ్చును. ఒకటి, అతి జాగతములు లేక మాయావాదములు; రెండు, జాగతములు లేక ఐహిక వాదములు; మూఁడు, ఆముష్మికములు లేక మతవాదములు; నాల్గవది పై సూచించిన దివ్యపరిణామవాదము. ఈ దివ్య పరిణామమునందు మానవజీవిత మొక మహాఘట్టము, మఱియు పరిపూర్ణతకు త్రోవతీసెడు ముఖ్య తీర్థము.

మాయావాదములందు మానవజీవితమునకు వాస్తవమైన ప్రయోజనము లేదు. అది జీవియొక్క ప్రమాదము, లేక జీవితతృష్ణయొక్క విభ్రమము, ఏదో చెప్పనలవిగాని విధమున కేవలము నందుఁ బ్రవేశించిన

భ్రాంతి, అజ్ఞానము; అసలు నిజమైననిజము విశ్వాతీతము, కేవలము, పరబ్రహ్మము అగునేని మంటిపైఁగాని స్వర్గమునందుఁగాని సకలవిధమైన జీవితమునుండియు సాధ్యమైనంతశీఘ్రముగా తప్పించుకొనిపోవుటయే కర్తవ్యము. మాయలోనున్నంతవఱకును మాయ సత్యమేకావచ్చును గాక, మాయలోనున్నవానికి దాని నిబంధన పాటింపవలసినదియే యగునుగాక; ఐనను అదంతయు కనఁబడు రూపు, కలరూపుకాదు; వ్యావహారికము, పారమార్థికము కాదు. యథార్థజ్ఞానమునకు దాని నిబంధన విశ్వముతో సమానవ్యాప్తికల ఉన్మాదగృహముయొక్క నిబంధన వంటిది. పిచ్చివదలనిహేతువుచే ఈపిచ్చియింట నుండవలసినంతవఱకును, దానికట్టుబాటుల ననుసరించుట తప్పదు; కాని లక్ష్యము, మనపిచ్చిమాన్చుకొని, కట్టుబాటులనుండి బైటపడుట. ఈపక్షమున మనలను జీవితమునుండి విడిపించి, నిర్వాణమునకు, వ్యష్టిసమష్టులయొక్క విలయమునకు, కేవలమునం దాత్మనిమజ్జనమున కే విధానము మిక్కిలి దగ్గఱదారి చూపునో ఆవిధానమే మన జీవితముయొక్క ఉత్తమవిధానము కాఁగలదు. బౌద్ధులచే నీయాత్మనిర్వాణము నిస్సంకోచముగా నిస్సందిగ్ధముగా పరమలక్ష్యమని చాటఁబడుచున్నది; ఐనను

యిదియే మాయావాదమునం దాత్మప్రాప్తిగా నిరూపింపఁ బడుచున్నది. కాని యిది స్వపరిణామముచేత, స్వపరిపాకముచేత వ్యక్తి తనకేవలమైన యథార్థసత్తను జేరుట కాదు; ఆపక్షమున వ్యక్తియును కేవలమును రెండును యథార్థముకావలయును. మిథ్యయైనవ్యక్తి తనప్రత్యేక సత్తను ప్రవిలయముచేసి, తనమిథ్యావ్యక్తిత్వముయొక్క యెఱుకకు సమస్తముగాను వ్యస్తముగాను దోఁచు సత్తను సర్వమును నశింపఁజేసి, కైవల్యమును జేరుటయే మాయావాదమునం దాత్మప్రాప్తి; మఱియు నీప్రాప్తివలన బ్రహ్మముయొక్క మిగిలిన అజ్ఞానమునందు, బ్రహ్మముయొక్క విశ్వగతమును, శాశ్వతమును, అనశ్వరమును ఐన అవిద్యయందు, భ్రాంతి ఎప్పటియట్లు చెల్లుబాటగుచుండుట కేమియు చెఱుపు వాటిల్లదు. కాని పేరునకు నిర్వాణమన్నను, ప్రాప్తియన్నను ఈమార్గముల ఫలితమేమన, మానవజీవితమునకు సార్థకత లేకపోవుట; కాదేని, ప్రమాదవశమున ఈ జగత్సత్తలోనికి జారిపడిన ఏదోయొకానొకదానిని ఏదోవిధమైన నిర్వాణములోనికి తప్పించుకొని పోనిచ్చుట కీమానవజీవితము కడపటి కెప్పటికో అవకాశ మిచ్చుచున్నదనిమాత్రము సార్థకత కల్పింపవలయును.

## సృష్టియెడ నాల్గు దృష్టులు

ఐహికవాదముల దృష్టియందీ జగతియే, ఈజగత్సత్తయే సత్యము, మఱియును ఏకసత్యము. భగవంతుఁడు—భగవంతుఁడని యుండెనేని—నిత్యమైన ఒక మహాసంభూతి; భగవంతుఁడు లేఁడేని శాశ్వతమగు ఆ మహాపరిణామముయొక్క పేరే ప్రకృతి. ఈ ప్రకృతి వివిధముగా లక్షింపఁబడవచ్చును. భౌతికపదార్థముతోడి శక్తియొక్క క్రీడయే యీ ప్రకృతి; లేక విశ్వవ్యాపియైన బృహత్ప్రాణము ప్రకృతి; లేదా ప్రాణమునందును భౌతికపదార్థమునందును ప్రవర్తించెడు నొక సర్వగతమైన, అపూరుషమైన ప్రజ్ఞయే యీ ప్రకృతి. వ్యక్తిరూపమున నీ మనుష్యుఁడు నిశ్శేషముగా నశించును; మనుష్యజాతియును ఈభూమియొక్క ఆయుష్యమునందు బహుస్వల్పకాలము మాత్రము జీవించును; భూమియు తన సౌరమండలవాసముయొక్క అవధిలో పై పరిమితి కంటె కొంచెమెక్కువకాలముమాత్రము ప్రాణము నీనఁగలదు. ఈసౌరకుటుంబమును ఒకనాఁడు నశింపకతప్పదు; లేదా సంభూతియందు సక్రియమైన, అనఁగా నవీన ధర్మముల ప్రసవించునట్టి, ఒకానొక అవయవముగా నుండుటయైనను ఆగిపోకతప్పదు. జగద్వ్యాపియైన సంభూతిమాత్రమే నిత్యము. జీవితము తనయందుండి వెడలి

పోనంతవఱకును ఏదోవిధముగా బ్రదికినఁ జాలునని తృప్తిపడఁడేని, మనుష్యున కీసందర్భమం దుత్తమ కర్తవ్య మేది? సంభూతియొక్క నియమ నిబంధనల పరిశీలించుట; వాని సాయమున సంభూతిక్రమమునందు ముందు నెఱవేఱఁ దగియున్న వివిధ భవితవ్యముల గ్రహించి, బుద్ధియొక్క విచారణచేతనో, స్వతః ప్రతీతి యొక్క ప్రతిభచేతనో వానిని సాధించుట; మఱియును ఉన్నట్టిభావ్యాంకురముల పూర్ణముగా వినియోగించుచు, సంభూతిగర్భమునం దింకను అస్ఫుటస్థితియందున్న ఉత్తమభవితవ్యములకై ప్రయత్నించుట. ప్రత్యేకచేష్టల యొక్కకూడికచే, కాలక్రమమున, మానవజాతి యంతయు కలసి ఒకటిమైకాని, ఈపనిని నిండుఫలితము కలుగునట్లు నెఱవేర్పఁజాలదు; కాని వ్యష్టిగా ప్రతి మానవుఁడును తన కొలఁది మేరలందు ఈపనియొక్క నిర్వాహమునకు సాయపడఁగలఁడు; తనస్వల్పమైన ఆయుఃప్రమాణమునందు ఈపనిని కొంతవఱకైనను తన యందు నిర్వర్తించుకొనఁగలఁడు; ముఖ్యముగా తన చింతచే, చేష్టచే మానవజాతియొక్క మానసిక-హృదయిక- శారీరిక జీవితముల వర్తమాన స్వాస్థ్యము కొఱకును భవిష్య దభ్యున్నతికొఱకును ప్రయత్నింపఁ

గలఁడు. ఒక యాదార్య మతసిచెందికలోనిది; వ్యష్టి యగుతాను ముస్ముందు నిశ్శేషముగా నశించిపోవుట అని వార్యమే యన్నను, తనయందు పరిణామ పరిణతములై యున్న ప్రజ్ఞాసంకల్పములను ఉచ్చలక్ష్యములకొఱకు వినియోగింపఁ గలుగుటయేగాక, మానవజాతిచే ముందు ముందెన్నఁడో సాధింపఁబడవలసియున్న మహార్థముల కేసియు వానిని ప్రవర్తింపఁజేయఁగలఁడు. మఱియు మిక్కిలి మొఱలైన భౌతికవాదమునందు తప్ప, మానవ జాతియు కడకు నశించుపోవుననుమాట పైసందర్భమున కెక్కువ మార్పు కలిగింపదు; ఏలన ఎంతవఱకీ విశ్వ సంభూతి మనుష్యుని మనఃశరీరములరూపమును చేకొను చున్నదో అంతవఱకును, ఈమనుష్యుని ఉనికియందు దానిచే పెంపఁబడి యాకారింపఁబడిన భావసంకల్పములు తమనెఱవేఱికకై తాము యత్నింపక తప్పదు, చరి తార్థములు కాకతప్పదు; ఆహేతువుచే వానిని సజ్ఞాన ముగా ననుసరించుటయే మానవునిజీవితముయొక్క సహజధర్మమును, శ్రేష్ఠనియమమును కాఁగలదు. మానవ జాతి, మఱి యది యీనేలపై మనునంతకాలము దాని స్వాస్థ్యము మఱియు క్రమాభ్యున్నతియు - ఇవియే మనజీవితమును కేవల మైహికదృష్టితో చూచెడు వాద

ముల మేరలు; ఈమేరలందే వానిలక్ష్యములును నిబద్ధ ములై యుండును.

ఆముష్మికదృష్టి ఈభౌతికజగతియొక్క సత్యము నంగీకరించుచున్నది; మఱియు భూమియు మానవ జాతియు నశ్వరమనుట ప్రధానాంశముగా స్వీకరించి, కొంత ముందునకుఁ బోవుచున్నది; అనశ్వరములైన, లేదేని యీలోకమువలె నశ్వరములుకాని, యితర లోకములయొక్క, భూమికలయొక్క యునికి నది గ్రహించుచున్నది; మఱియు మనుజుని శారీరకజీవితము వెనుక నతనియందున్న అమృతత్వము నది వీక్షించు చున్నది. అమృతత్వమునందు, మనుష్యుని యాత్మ యొక్క నిత్యావస్థానమునందు విశ్వాసమే యీ జీవిత దృష్టియందలి ముఖ్యాంశము. దానిచే ఈ ఇహలోకము కంటె నుచ్చతరములైన భూమికలు కలవనువిశ్వాస మనివార్య మగుచున్నది; ఏలన ఈప్రపంచముయొక్క ప్రతివిధానమును భౌతికపదార్థమున భౌతికపదార్థముతో శక్తియొక్క ఒకానొకఖేల — ఆశక్తి ఆధ్యాత్మిక - మానసిక-జీవ - జడములం దేదియైనను కానీ. ఇట్టి ప్రపంచమందు అశరీరియైన ఆత్మకు చిరమైన నిలు కెట్లుండఁగలదు? మఱియు మనుష్యుని నిజమైన స్వగృహ

మావల యనియు, ఇహజీవిత మతని అమృతత్వమునం దొక అవాంతరఘటనమాత్రమే యనియు, లేదేని స్వర్గమును ఆధ్యాత్మికమును ఐన ఉనికియందుండి భౌతికమైన యునికి లోనికి భ్రంశమువంటి దనియు పైభావమునుండియే సహజముగా బయలుపడుచున్నది. కాని ఈభ్రంశము యొక్క స్వభావ మేమి, హేతువేమి, ఉద్దేశ్య మేమి? కొన్ని మతము లిట్లు: మనుష్యుఁడు మొదట సప్రాణమైన భౌతికశరీరముగా సృజింపఁబడు చున్నాఁడు; దివ్యమగు నవజాతమైన ఒకయాత్మ సర్వశక్తిమంతుఁ డగు సృష్టికర్త శ్వాసద్వారముననో, అతని స్వేచ్ఛానియతిచేతనో ఆశరీరమునందు సంక్రమించుచున్నది. మనుష్యుని యీజీవిత మేకాంతఘటన. దీనినుండి యతఁడు నిత్యసుఖమైన, లేదా నిత్యదుఃఖమైన లోకమునకుఁ జేరుచున్నాఁడు. అతని కర్మలు మొత్తముమీద మంచివైనచో మొదటి లోకము, చెడువైనచో రెండవలోకము; కాదేని, నమ్మిక యొక్క ఒక ప్రత్యేకమైన నిబంధన, ఒకపూజావిధానము, ఒక భగవత్ప్రాపకుఁడు—వీనిని దెలిసికొని యంగీకరించెనా, మొదటిలోకము, కానిచో రెండవలోకము; లేదా యీలోకప్రాప్తి సృష్టికర్తయొక్క నిర్హేతుకమును, భవితవ్యనియామకమును అగులీలావిలాసము ననుసరించి యుం

డును. కాని ఆముష్మికవాదముయొక్క ఈరూపములు హేతుబుద్ధికి మిక్కిలి సరిపడనట్టివి. భౌతికజన్మద్వారము ననే ఆత్మ సృష్టియగుచున్న దనుభావముతో ప్రారంభించియు, అన్నింటియెడను చెల్లెడు ఒకనైసర్గికనియతిచేతనే, ఈయాత్మ తనభౌతికకోశమునుండి విడిపడిన తరువాత, మనుష్యజీవితమునందలి కట్టకడపటిభాగము భూలోకమునకుపైఁగా నావల నిర్వహింపఁబడునని ఊహింపవచ్చును —కోశమునుండి బైట పడిన సీతాకోకచిలుక తేలికగా పలురంగురెక్కలతో గాలిపై తేలాడునట్లు. లేదా ఇహజీవితమునకు పూర్వ మాత్మ కలదనియును, భౌతికమునందది పతితమై గాని, లేక యవతరించిగాని, తిరిగి తనస్వర్గస్థాయిలోని కారోహించుచున్నదనియును ఊహింపవచ్చును. ఆపక్షమున ఈ భౌతికసృష్టి, ముఖ్యముగా ఈభూమి, ఈచిత్రమైన అవాంతరఘటనయొక్క ప్రయోగముకొఱకై దివ్యమగునొకశక్తి, ప్రజ్ఞ, లేక ఇచ్ఛావిలాసముచే నిర్మింపఁబడిన రంగ మగును. అప్పు డీభూమి, మన కంగీకారమగుదృష్టి ననుసరించి, పరీక్షాస్థానముగానో, స్వర్గోచితమైన పరిణామమున కేర్పఱుపఁబడిన క్షేత్రముగానో, లేక ఆధ్యాత్మికసత్తనుండి పతితులైన వారల కీయఁబడిన విదేశవాసముగానో కల్పింపఁబడును.

మఱియు నీవిషయమున భారతీయదృష్టియు నొకటిగలదు. అది యీప్రపంచమును భగవల్లీలయొక్క యుద్యానముగాను, ఈయునికిని అపరప్రకృతినిర్మితము లైన ఇహలోకపుకట్టడములయందు భగవత్సత్తయొక్క ఖేలగాను నిరూపించుచున్నది. అనేక జన్మపరంపరల ద్వారమున జీవి యీఖేలయందు పాల్గొనును; కాని కట్టకడపట భగవత్సత్తయొక్క స్వాభావిక కారోహించి, అచ్చట శాశ్వతమైన సాయుజ్యసామీప్యముల ననుభవించుట జీవుని నియతి. ఇది యెట్లైనను, ఆముష్మికదృష్టియొక్క వివిధనిరూపణములం దన్నింటియందును ప్రధానలక్షణము లైన మూఁడంశములు కలవు. ఒకటి, మనుష్యుని ఆత్మకు వ్యష్టిగా అమృతత్వము; రెండు, దీని కనివార్యమైన ఫలిత మీభావన: భూమిపై ఈ జీవితము, ఆత్మ తన ఉచ్చతమమును శాశ్వతమునగు స్వభావమునుండి తాత్కాలికముగా తొలఁగుటవలనఁగాని, ఆ... వము తాత్కాలికముగా మలినీకృత మగు... తటస్థించుచున్నది, మఱియును ఆవలి... స్వర్గమే ఆ ఆత్మయొక్క స్వస్థానము; మను... ష్యుఁడు తిరిగి తనస్వస్థాన మారోహి... యందలి ధర్మసత్తకును, ఆధ్యాత్మి...

గూర్చుటయే సాధనము, కావున నదియే జీవితమున కనలైన ఏకకర్తవ్యము.

ఈపైఁజెప్పిన మూఁడు దృష్టులయందు కేవల మొక్కదానినే ఆశ్రయించి, మిగిలినవానిని బహిష్కరించి, మనుష్యుఁడు తనజీవితము నెల్లపొడవునను నడపఁజాలఁడు; అక్కడక్కడ కొందఱరుదుగా అట్లుచేయఁగలిగినను, మొత్తముమీఁద మానవజాతి కది కార్యకముగా సాధ్యపడదు. మనుజుని స్వభావమునందీ పైఁజెప్పిన మూఁడు దృష్టులచేతను ఆకర్షింపఁబడు వివిధ ప్రవృత్తులును, మేల్కొల్పఁబడు స్ఫురణములును కలవు; కావున మనుష్యుఁడాదృష్టులలో రెంటినో లేక అన్నిటినో మిశ్రముచేసిగాని, తనజీవితోద్దేశ్యములను కొన్నింటి నొకదృష్టి కప్పగించి మఱికొన్నింటిని మిగిలినదృష్టుల కప్పగించి తా నా విరోధిలక్ష్యము [illegible]ంపిడిపోయిగాని, లేదా వీనికేదో విధమగు సమన్వ[illegible] సాధించుకొనిగాని వ్యవహరించును. సాధా[illegible] మనుష్యు లందఱును తమశక్తియందలి అధిక [illegible]హికజీవితముకొఱకు, అనఁగా వ్యష్టిసమ[illegible] యక్కఱలకొఱకు, ఇచటి ఉద్దేశ్యము [illegible] కోరికలను, లక్ష్యములను నెఱవేర్చు

కొఱకు వెచ్చింతురు. అది ఈవిధముగాక ఇంకొకరీతి ఎట్లు కాఁగలదు? ఏలన శరీరమును సంరక్షించుటయు, ప్రాణ మనఃసత్త్వల కభివృద్ధినొదవించుటయు, మఱియు ఇచటి సహజపరిపాకక్రమము ననుసరించియే మనుజుని పరిపూర్ణత ఈషదూనముగానో లేక సమగ్రముగానో ఇచట పడయువచ్చు నను తలఁపువలన నేర్పడు కొన్ని ఉదార లక్ష్యములను, వ్యష్టికేకాక సర్వమానుష్యకమునకును సంబంధించినట్టివానిని, ఆరాధించుటయు, మనయునికి యొక్క సహజరీతిచేతనే మనపై మోపఁబడుచున్నవి; ఇవన్నియును మనజీవితస్వభావముయొక్క స్వధర్మము నందలివి, దాని సహజ ప్రవృత్తికిని సహజ నియతికిని చెందినట్టివి, దాని యభివృద్ధికి వలసిన పరికరము నం దావశ్యకము లైనట్టివి; ఇవి వినా మనుష్యుఁడు తన పూర్ణమానవత్వమును జేరఁజాలఁడు. మనయునికిఁ గూర్చిన యేదృష్టియేని వీనిని లెక్కసేయదేని, అన్యాయముగా నిరసించునేని, సైరణలేక నిందించునేని, ఆ హేతువుచేతనే అది మానవజీవిత నిర్వాహవిషయమున సాధారణమును, సమగ్రమును ఐననిబంధన మొసఁగఁజాలదు. అట్టి నిరసనయందు వేఱుమేలు, గుణము, లేక ఉపయోగ ముండుఁగాక, మఱియు ఒకానొక స్వభావ

మునకు, ఒకానొక ఆధ్యాత్మికదశయందున్నవానికి అది వినియోగించుఁగాక. మనయందు నెఱవేఱవలసియున్న దివ్యోద్దేశమున కవసరములైన ఈయంశములను మానవ జాతి నిర్లక్ష్యము చేయకుండుఁగాక యని ప్రకృతియే తగినజాగ్రత వహించుచున్నది.

ఐనను, మానవత్వమున మొదటిదగు ఈ ఐహికా సక్తమైన స్వభావము నతిక్రమించియున్న యొకానొక వస్తువు మనకూర్ధ్వనందుకలదను ప్రతిపత్తిని ఆప్రకృతియే మనలోన పాదుకొల్పినది. మఱియు ఆహేతువుచేత నే ఈ ఉచ్చమగు సూక్ష్మప్రతిపత్తిని నిరసించి, జీవితమును కేవల మైహికమైనవిధానమునందు నిలుపుటకు పాటు పడెడు ఏప్రపంచదృష్టియు మానవజాతిని చిరకాలము వశముచేసికొనలేదు. ఆవల నేదో కలదను ఒక ఆంతర మైనస్ఫురణ, మనఃప్రాణశరీరములకన్న భిన్నమైనట్టిది, లేక మిన్నయైనట్టిది, అనఁగా వాని నిబంధనచే బద్ధము కానట్టిది, జీవి లేక ఆత్మ కలదను తలంపు, లేక అనుభూతి మఱలమఱల మనపై తిరిగిపడుచున్నది, కడకు స్వాధీనము చేసికొనుచున్నది. సాధారణుఁడీ అనుభవమునకు కొన్నివేళలను ప్రత్యేకించిగాని, తన ఐహికసక్తమైన స్వభావమందలి తృష్ణారభస మీఁదుచే

మెల్లనయ్యేడు పశ్చిమవయసు నర్పించికాని, లేదా ఆ యనుభవమును తనసాధారణచేష్ట కెచటనో, పైననో వెనుకనో, విడిగానున్నట్లు తలఁచి, తన స్వాభావికమైన యునికిని ఏదో అసమగ్రవిధమున దానివైపునకుఁ ద్రిప్ప యత్నించికాని, ఎట్లో సులువుగా తృప్తిపడుచున్నాఁడు. విలక్షణుఁ డొక ఆముష్మికమే జీవితముయొక్క ఏకలక్ష్యముగా, ఏకధర్మముగా గ్రహించి తన స్వర్గ్యస్వభావమును పెంపొందించు నాశతో ఐహికస్వభావమును కృశింపఁజేసి తపింపఁజేయుచున్నాఁడు. కొన్నికాలములయం దాముష్మికదృష్టి మిక్కిలి ప్రబలమగుటచే, మానవ జీవితము మిక్కిలి సంకుచితమగుటయు, మఱియును కఠినతాపసికతవలనను కృచ్ఛ్రత్యాగమువలనను బుట్టిన యొకానొక రుగ్ణమైన పరలోకతృష్ణ మనుష్యుల నావహించుటయు తటస్థించుచున్నది; ఐహికజీవిత మపుడు సహజమైన తనవిశాలప్రసారమును వహింపఁజాలదు; ఆముష్మికప్రవృత్తియు తన శ్రేష్ఠమును, విశుద్ధమును, సుకుశలమును ఐన నడకయందు నడువఁజాలదు. అందుచే ఐహికాముష్మికములమధ్య సాధారణజనులు సందిహానులై యూగులాడుచుండుట తటస్థించును. జీవితమునందు మిథ్యావిరోధముయొక్క సంక్షోభమును సృష్టించు

కాని, భగవద్విధానముచే నిర్మితమైన ఈ మన ప్రకృతి యం దెచ్చటనో యొకచోట దానివెలుపలి విరోధముల నన్నింటెని శమింపఁజేయుటకై యుండితీరవలసిన సమీకరణసూత్రమును గ్రహింపలేకపోవుటయే ఈ రుగ్ణతా చిహ్నములకు నిశ్చయమైన నిదానము.

మన మనోజీవితము లోతులలోనికిఁ బ్రసరించి నప్పుడు, మనసూక్ష్మజ్ఞానము వృద్ధియైనప్పుడు, తుదకు, ఈ ఐహికాముష్మికములీ భూస్వర్గములుమాత్రమే ఉనికి యొక్క చందములుకావనియు, అతిజాగతము లేక విశ్వాతీతమైన యొకానొకటి, మనయునికికంతయు ఉన్నతతమమును దూరతమమును ఐన ఉత్పత్తిహేతువు, కలదనియు తెలుపుభానము మనలో విరియుచున్నది. మన ఆధ్యాత్మికావేగము, మనబుద్ధియందలి పరమతాసహనము, మన ఇచ్ఛయందలి ఆతురత, జీవితముయొక్క కస్తిచేఁగాని దానిఅపఫలితములచేఁగాని నిరుత్సాహమైన మనప్రాణ సత్త్వయందలి రుగ్ణజుగుప్స-ఈయన్నిఁటితో లేక కొన్నిఁటితోకలసి యీభానము ఆ సుదూరమైన పరమముకంటె అన్యమగు సకలమును అవస్తువనియు, అయథార్థమనియు, మానవజీవిత మసారమనియు, జగములనిలు కసత్యమనియు, వెగటుకలిగించు వికారముతోడను, నిష్ఠురత

తోడను, క్రౌర్యముతోడను నిండిన దీ నేలయనియు, మనలనింపుటకు చాలనిదా స్వర్గమనియు తోపఁజేయును. మఱి యిచటను, సాధారణుఁడీభావములతో సమగ్రముగా నేకీభవించి జీవింపలేఁడు; మిక్కుటములై యివి, అతఁడనుసరింపవలసిన జీవితమును అశాంతి-అతృప్తుల తోధూసరము చేయునుమాత్రము. కాని అసాధారణుఁడు తానుచూచిన సత్యము ననుసరించుటకై సర్వమును పరిత్యజించును. సృష్టియెడ నిట్టిదృష్టి కొన్ని దేశములం దైనను కొన్ని కాలములందు చాల ప్రబలమగుట తటస్థించినది. ఆహేతువుచే జాతిలో చాలమంది సన్న్యాసమున కేసి, లోన నిజమైనప్రేరణయున్నను లేకున్నను, ఆకృష్టు లగుదురు. ఇతరులు సాధారణజీవితము ననుసరించినను, అది అయథార్థమను నమ్మికచే వారిసత్తువ తప్పుటయు, ఈవిశ్వస్థితియందు భగవంతుని యానందము నందుకొనలేకపోవుటయు, మఱియు ఏప్రాప్యనిష్ఠ సామాజికమగు సమున్నతికేసి మనుజుని తఱుముచున్నదో, మఱియు ఇచటి అవబోధములతోడి పోరులోనికిని, ఇచటిపరిశ్రమములోనికిని ఉదారమగు నుత్సాహముతో దుముకఁజేయుచున్నదో అట్టి ప్రాప్యనిష్ఠ హతమగుటయు తటస్థించుచున్నది. మఱి యిదియును ఒకానొక

దోషముయొక్క, కల్పితమైన యొక మిథ్యావిరోధము యొక్క చిహ్నం. దివ్యమగు అవిసంవాదసూత్రమిచటను అందుకొనఁబడలేదు.

బహ్వాంశ జటిలమైన మన యీ మానవస్వభావమునకును, మానవజీవితమునకును సృష్టియొక్క మహాగతియందుఁగల స్థానమేమో నిరూపించి, తద్ద్వారమున వానియుద్దేశమును గ్రహింపవలయును; మన యీమిశ్రస్వభావమునందలి ప్రతిఅంశకును, ఆస్థకునుగల ప్రయోజనమును, ఈయవలసిన విలువను సమగ్రముగా నెఱుఁగవలయును; మఱియు దాని ఐక్యముయొక్క కీలకమేదో కనిపెట్టవలయును; అప్పుడుగాని అవిసంవాదముయొక్క సూత్రమందుకోఁజాలము. మఱియు దీని నందుకొనుట సముచ్చయము లేక సమన్వయము ద్వారమున. జీవియొక్క ధర్మము ఉత్తరోత్తర వికాసమగుట విశదము. కావున, ఈసముచ్చితి లేక సమన్వయము పరిణామక్రమము ననుసరింపవలసియుండును. ప్రాచీన భారతవిజ్ఞానమందట్టి యొక సమన్వయమును సాధించుటకై యత్నము చేయఁబడెను-మనుష్యజీవితమునకు నాలుగర్థములు, లేక ప్రయోజనములు న్యాయములని గ్రహింపఁబడెను. మొదటియర్థము: అతని ప్రాణసత్తకుఁజెందిన అక్కఱలు,

ఈహాలు; రెండవది: అతనికోరికలు, అభిలాషలు మూఁడవది: నీతియందును మతమునందును అభివ్యక్త మగు నతని ఊర్ధ్వకాంక్ష. నాల్గవది: అతని ఆధ్యాత్మిక లక్ష్యములు. ఈనాల్గుపురుషార్థములను మనుష్యుని ప్రాణ-శరీర-హృదయాంశలకును, భగవంతుఁడు - ప్రకృతి - మనుష్యుఁడు అను నీత్రితయముయొక్క సంబంధ విధాన ముల జ్ఞానముచే ప్రవర్తించుచు నీతి మతపంథలందు వ్యాసక్తమయ్యెడు ధర్మాంశకును, మఱియు ఈయంత కును ఆవలనైన దానికొఱకై, జీవితమునుండి మెట్టకే లకు విడివడుకొఱకై, ఉత్కంఠపడు ఆధ్యాత్మికాంశ కును సంబంధించిన అక్కఱలని చెప్పవచ్చును. ఈ పురుషార్థదృష్టిననుసరించి కొంతవయసు విద్యకొఱకును, ముందు కావలసిన సాధనసంపత్తి నలవరించుకొఱకును, తరువాత కొంతవయసు ధర్మముయొక్కయు మతము యొక్కయు కట్టుబాటులలో అర్థకామముల తృప్తికైన సాధారణ జీవితము జీవించుకొఱకును, పిమ్మట కొంత వయసు జీవితమందుండి యొదిగి ఆధ్యాత్మికసాధనయందుఁ బ్రవర్తించుకొఱకును, కట్టకడపటివయసు సన్న్యాసము కొఱకును, మోక్షముకొఱకును నియమింపఁబడెను. ఈ జీవితవిధానము ఎల్లరకును సార్వజనీనముగా వర్తింపఁ

జేయఁబడునేని, ఈ పరిపాక క్రమము నంతయును అంచ
ును ఒకజీవిత కాలమునందు మెట్టలేరను విషయమును
గ్రహింపమియగును; కాని పరిపూర్ణ పరిపాకము దీర్ఘ
జన్మ పరంపరా ద్వారమునఁ గాని సాధింపఁబడదను నుప
పత్తిచే పై వ్యవస్థితియందు దశాభేదము ననుసరించిన
మార్పులకు తావు కల్పింపఁబడెను. పురుషార్థముల ఈ
సమన్వయము మానవ జీవితమునకు ఉదారతయు, ఉన్న
తియుఁ గల్పించుటయందు చాల సాధకమయ్యెను. కాని
కాలక్రమమున నది పతితమై, దాని స్థానము మిక్కిలి
అతిచేయఁబడిన సన్న్యాసప్రవృత్తిచే ఆక్రమింపఁబడెను.
ఫలితమున పూర్వ సమన్వయముయొక్క చతురస్రతకు
భంగము వాటిల్లెను; అందలి దూరాంతరములైన రెండు
జీవితపంథలుమాత్రము మిగిలిపోయెను. ధర్మార్థములయొక్కయు, మతవిధులయొక్కయు వ్యవస్థచే కొంత
హద్దు చేయఁబడిన అర్థకామములసాధారణజీవిత మొకటి;
రెండవది, అసాధారణమైన సన్న్యాసజీవితము. పూర్వ
సమన్వయమునందే నిజమున కీలతికృతియొక్క బీజము
కలదు, అందుచేతనే ఈ అతి కృతిలోని కది పడిపోవుట
యనివార్యమయ్యెను; ఏలన జీవితమునుండి తప్పించుకొని
పోవుటయే కోరఁదగిన పురుషార్థమని మనము గ్రహింతు

మేని, విలంబము సహింపనివై మనుష్యుని బుద్ధిసంకల్పములు సులభసూత్రములకొఱకు ఉద్వేగపడితీరును. విసువు కల్గించునట్టియు, చిరకాలముపట్టునట్టియు, పొడుగైన పరిపాకమార్గములను విడిచితీరును. శ్రేష్ఠమని యొకదానిని గమనించియు దానినివీడి, దానిక్రిందిదనియును, వికల్పముగా శ్రేష్ఠమనియును చెప్పఁబడుదానిపట్టున ఓపికతో శ్రమించుట స్వభావమునందలి దౌర్బల్యముచే అగత్యము కావచ్చును; కాని ఉత్తమప్రేప్సువగు ఉత్కాంక్షకది సహజనియమము కాఁజాలదు.

ఇచట స్థాపింపఁబడు వాదమైన దివ్యపరిణామమునకు భూమిపైని మనుష్యుఁడు ప్రధానకరణము, ఉచ్చస్థితికిఁజేరిన మానవజీవితము సంధిస్థానము. ఈవాదము మానవస్వభావమునందలి వివిధాంశలసాకల్యమును గమనించుచున్నది, పైఁజెప్పిన మూఁడువిధములైన అక్కఱల యాకర్షణమును అంగీకరించుచున్నది. కాని పరము యొక్క జ్యోతి - శక్తి - ఆనందములచే స్వాయత్తము చేసికొనఁబడి, పునర్నిర్మితమై, నవపరిణత మైనఁగాని అవరము తన పరిపూర్ణప్రయోజనమును [illegible] లేదు; మఱియు దానిని ప్రతిషేధించుటచేఁ
స్వాధీనమొనర్చుకొని రూపాంతరీకృత

ననే, పరమును అవరముతోఁడి సరియైన సంబంధమునః నిలిచినదగును. ఆధునిక విచారణయందు ప్రబలము లైన ఐహికాదర్శములు మనుష్యునకును, ఇహజీవిత మునకును, మనుష్యజాతియొక్క భవితవ్యమునకును తిరిగి న్యాయ్యమగు స్థానమిచ్చినవి; ఇదియే ఇవి సాధిం చిన గొప్పమేలు. కాని ఇవి మనుజుని మేర ననవసరముగా సంకుచితము చేయుచున్నవి; అతని స్వభావమునం దేది ఉచ్చతమమో, కడపటకన్నింటికంటె నేది ముఖ్యత మమో దాని నివి చూడకున్నవి; మఱియు ఈసంకుచితి చేత తమ స్వోద్దేశమునే కట్టకడపటదాక వెంబడింప లే కున్నవి. మనుష్యునియందును, ప్రకృతియందును మనస్సే ఉచ్చతమమగువస్తువయ్యోనేని ఇట్లనుట చెల్లదు; కాని మనస్సు చేతనయొక్క ఆంశికవికాసముమాత్రమే అయ్యో నేని, మనజాతియందు ప్రకృతి వెలిచేయఁగల అధికశక్తు లుండెనేని, ఆపక్షమున, ఆముష్మికముమాట యటుంచి నను, భూమిపై మన భవితవ్యాశ యంతయు ఆశక్తుల ఆవిర్భాతి - అభివృద్ధులపై ఆధారపడుననుటయేకాక, వానిని సాధించుటయే మన పరిపాకమున కసలుబాట యగును. ...ము ను ఏవిపులతరమును శక్తిమత్తరమును ... - సమీపమునుమాత్రమే యీమనస్సు

చేతఁగలదో ఆచేతనను తెలిచివైచుటవలనఁ గాని, మనఃప్రాణములు తమ పరిపూర్ణతనుఁ బడయఁజాలవు. సరియైన గ్రహణయందు దావిపులతరమును శక్తిమత్తరము నగు చేతనయే అధ్యాత్మచేతన; ఏలన అధ్యాత్మ చేతన మిగిలిన యన్నింటికంటె ఉచ్చతరముమాత్రమే కాదు, దానివ్యాప్తియు విపులతరము; అది విశ్వగత మును విశ్వాతీతమును అగుటచే మనఃప్రాణముల నది తనవెలుఁగులోని కెత్తి, వేనికొఱకవి యన్వేషించు చున్నవో వాని పూర్ణప్రాప్తిని చేకూర్పఁ గలదు. దాని యందు బలీయములైన జ్ఞానోపకరణములు; గభీరము లైన శక్తిసంకల్పములబుగ్గ దానియందు; మఱియు ఆనం దముయొక్క ఏయున్నతిగాని, తీవరముగాని దానిచేరిక కందనిది లేదు. ఈ జ్ఞానశక్త్యానందములకొఱకే మన మనః ప్రాణశరీరములు వెదకుచున్నవి. దేనిసాయమున నియ్యవి తమయంతిమమైన పూర్ణతను చేరునో దానిని నిరాక రించుటయన, వీని యుత్తమపరిపాకమునకు దారిని నిరో ధించుట. ఇఁక మాయావాదము ఆధ్యాత్మికసత్తయొక్క విగతవర్ణమైన యొకానొక స్వచ్ఛతనుమాత్రమే లక్షిం చుటచే చైతన్యముయొక్క సర్వక్రియను ప్రతిషేధించు చున్నది; స్వసత్తయందుండి యది వెలువరించు సర్వ

మును చైతన్యమునుండి అన్యముచేయుచున్నది; పరిణామగతమై పరిణతమైనదానియొక్క పరమనిష్పత్తిని లేక నెఱవేఱికనుగాక, దానివిచ్ఛేదమునే పరిణామముయొక్క చరమపరిపాకముగా, చరితార్థతగా నిరూపించుచున్నది. ఈ ఐహిక - మాయావాదముల రెంటినడుమనున్న ఆముష్మికవాదముల యందలి ఉచ్చ - కాంక్షయు పరమోచ్చమైన ఐక్యమువఱకునుపోక, ఉనికిని పైకడ కొలఁదిపఱచుచున్నది; మఱియు దిగువకడ, ఇహజీవితమును దానిన్యాయ్యమైన విశాలతాత్పర్యమును గ్రహింపక తక్కువపడఁజేయుచున్నది.

ఈ అర్థములను పరస్పరప్రతిషేధకములగాఁగాక, ఐక్యముయొక్క ఒకానొక విపులసంబంధమునందు గ్రహించినప్పుడే మనయునికియొక్క న్యాయ్యమును, సంపూర్ణమును అగునర్థము గోచరింపఁగలదు. అప్పుడే తన సమగ్రసత్యముయొక్క వెలుఁగునందు జీవితము వర్తింపఁగలదు. ఇచటి దివ్యపరిణామవాదము విశ్వాతీతమగు సత్యమును గ్రహించుచున్నది దానిఁజేరుట యందే మనతెలియికయొక్క ఉన్నతతమమైన ప్రసారము. కాని ఆ విశ్వాతీతమైన సత్తయన నేదియో అదియే ఈవిశ్వసత్త, ఈవిశ్వవ్యాపిమైన చేతన, ఈ

విశ్వాంతర్గతమైన సంకల్పము, ఈవిశ్వపర్యాప్తమైన ప్రాణము; అదియే ఈయన్నింటిని వెలువరించినది—తన వెలుపలఁగాదు, ఒకానొక ప్రతియోగితత్త్వమువలెఁ గాదు, లేక యొకబ్రహ్మాండమైన భ్రాంతివలెఁగాదు. ఈ యన్నింటిని తనయందే అది వెలువరించినది—తన స్వవికాసముగా, ఆత్మావిష్కృతిగా. ఈవిశ్వసత్త నిరర్థకమైన వేడుక కాదు, బుద్ధిహీనత చేసిన మోసమేని, ప్రమాదమేని కాదు; దివ్యమగు, భగవత్కృతమగు తాత్పర్యమును, సత్యమును అందు కలవు. మఱియు చైతన్యము యొక్క ఆత్మవికాసమే ఈ విశ్వసత్తయొక్క పరమ తాత్పర్యము, ఈవిషయమే ఈ విశ్వస్థితియందలి ప్రహేళికలకును, తికమకలకును విప్పుడు. మఱియును మనుజుని రూపునందు చైతన్యముయొక్క పరిపూర్ణమగు స్వావిష్కారమే మానవజీవితముయొక్క ప్రయోజనము. విశ్వాతీతమగు సత్త యుపలబ్ధముకానిది, ఈప్రయోజనము సరిగా సాధింపఁబడదు; కాని విశ్వసత్తయందలి సర్వమును వెలిపెట్టి, కేవలము విశ్వాతీతమునే యనుసరించియును, ఈప్రయోజనము సరిగా సాధింపఁబడదు. అతీత-సమష్టి-వ్యష్టుల యైక్య మున్నప్పుడే, స్వావిష్కారమొనర్చుకొను చైతన్యముయొక్క పూర్ణత సాధ్యము

కాఁగలదు; అట్టి ఐక్యమునకు కొలఁదిపడునట్టి దేదైనను, అసమగ్రమును, అనిష్పన్నమును ఐనరూపై తీరవలయును; పైమూఁడింటియందు ఏయొకవస్తువును విడుచునదైనను, ఆంశికోపలబ్ధిమాత్రము కాఁగలదు, కృత్స్న సత్యమును బయలుపఱచునట్టిది కాఁజాలదు. మఱియు కృత్స్నసత్యమును బయలుపఱచుటయే ఆధ్యాత్మికమగు పరిపూర్ణాత్మవికాసమున కావశ్యకము.

ఆముష్మికదృష్టియందలి సత్యమును ఇచట నంగీకరింపఁబడుచున్నది. మనయునికియొక్క భూమిక కేవలమీభౌతికముమాత్రమే కాదు, మనము చేరఁగల యితర భూమికలును కలవు. మనయత్నముచే అందనైయున్న ఆయుత్తరభూమికల నందక, వానియనుభూతిని సంపాదింపక, వానిధర్మము నెఱిఁగి మనయందు దానిని వ్యక్తము చేయకుండుట, మనయునికి తనయొక్క యున్నతిని, పుష్కలత్వమును చేరక కొలఁదిపడుటగును. కాని విశ్వమునందు చైతన్యముయొక్క స్వావిష్కారమునకు స్వర్గములుమాత్రమే ఏకరంగముకావు, అందువలననే దాని పూర్ణతాత్పర్యమును కావు. ఈప్రపంచము, ఈభూమి, ఈమానవజీవిత మివియును దానియందలి భాగములు; వీనికిని వీనిఆధ్యాత్మికభవితవ్యములు కలవు; ఇవియును

చైతన్యస్వవికాసమునం దొకభాగము. ఈయునికి అదివ్య
మును, నిష్ఠురమును, నిరర్థకమును, తుచ్ఛమునగు ఏదో
యొకదానియందు, ఊబియందువలె, అజ్ఞానముచే లేక
పాతకముచే పడిపోవుటకాదు; చైతన్యము తనకుఁ దాఁ
గాని, తనజీవులకుఁగాని, ఈయునికిని, అనుభవించిన
పిమ్మట పరిత్యజించుకొనుటకుమాత్రమే కల్పింపలేదు. ఈ
భూమిపై మనుష్యునందు చైతన్యముయొక్క వికాసము,
అనఁగా, తనజ్యోతిఃశక్తులతో ఆనందైక్యములతో మను
ష్యునం దది యిట విరియుట, భగవత్ - సంకల్పమునందలి
ముఖ్యాంశము, ఈ ఐహికమును మానవము నగు సృష్టి
యొక్క విశదతాత్పర్యము. ఆహేతువుచేతనే పృథ్విపై
ఈయునికియందలి సత్యమంతయును, మఱియు ఇట
దీనికాఁగల మేలురూపును ఇచటివాదమునం దంగీకరింపఁ
బడినవి. కాని తొలిచూపుల కిహజీవిత మేమిగాతోచు
చున్నదో దానియందే మనము నిబద్ధులమగుదుమేని,
శక్తిస్థితియందున్న మనదివ్యభవితవ్యమును నిరాకరించిన
వార మగుదుము; మానవజీవితముయొక్క విపులతర
ప్రయోజనమును కొలఁదిపఱచినవార మగుదుము;
రహఃస్థితమైన మనయునికియందు మన మేమయియున్నా
మో ఆ అధికమునంతయును అరయనివార మగుదుము.

మన అమృతత్వముయొక్క వెలుఁగునందే మనమర్త్యాత్వము సమర్థింపఁబడఁజాలును; స్వర్గములకు తన్నుఁదా తెఱచుకొనిగాని, భూమి సమగ్రముగా తన్నుఁదా నెఱుఁగఁజాలదు. భగవత్సత్తయొక్క వెలుఁగునుదర్శించి తత్-శక్తియందు వర్తింపనేర్చినఁగాని మనుష్యుఁడు తన్నుఁదా కలరూపునందు చూచుకొనలేడు, భగవద్విధానమున కనువుగా తనప్రపంచమును వినియోగించుకొనలేఁడు.

చైతన్యము క్రమితమైన ఆత్మాభివ్యక్తిని, లేక పరిణామముయొక్క ఆరోహణమును సృష్టియందనుసరించుటకుఁగా, పూర్వావశ్యమై యొకస్థితి యేర్పడియుండవలయుననుట తెల్లము; అది యెట్టిదన, చైతన్యముయొక్క తత్త్వమేదో అదంతయును తొలుత అంతర్హితమగుట, నిలీనమగుట. ఇటుకాక తనసత్తను జ్యోతిర్మయమగు ప్రసారణమునందు విరియఁజేసి, చైతన్యము స్వప్రస్తారమును చేసికొనఁగలదను కల్పము లేకపోలేదు; కానిఅట్లే, అంతర్హితిపిమ్మట స్వోపలబ్ధిద్వారమున స్వావిష్కారము చేసికొను విధానమును కలదు. ఈ భూమిపై చైతన్యముయొక్క ప్రసారణము క్రమితమైన ఆత్మప్రాప్తియొక్క రూపముధరించి, ఉత్తరోత్తరమైన అభి

వ్యక్తి ననుసరించుచున్నది. ఈ కల్పమే, ఈ విధానమే భౌతిక ప్రపంచమున చైతన్యముయొక్క అభిసంధి; ఈ ప్రపంచముయొక్క తాఱుమాఱున కంతకును హేతువు నీసందర్భమే తెలుపఁగలదు. మొదట, జడిమయందు, నిశ్చేతనము నం దంతర్నిహితి; పిమ్మట, అవిద్యద్వారమున అభివ్యక్తి — అనఁగా శకలజ్ఞానము లేక ఆంశికజ్ఞానము నవలంబించి భవితవ్యముయొక్క బహురీతులతో, సాధనీయముయొక్క భిన్నకల్పములతో క్రీడించుట; కడకు సత్తయొక్క జ్యోతిఃశక్త్యానందముల ఆనంత్యము నందు, తన స్వనిర్మితిపైమాత్రమే ఆధారపడెడు నిండు విరియికతో, తాత్త్వికమగు ఆత్మజ్ఞానము తనచరమ పరి పాకమును బడయుట — ఇవి ఆవిష్కృతిచక్రమునందలి మూఁడుదశలు. ఇందు కడపటిదశయే భాగవతజీవితము లేక దివ్యజీవితము. దీని కవశ్యమగు పూర్వనిబంధన మును కనుఁగొని, దానిని మనుష్యుఁడు తనయందు నెలకొల్పుకొని, పిమ్మట నా దివ్యజీవితము నందుకొనవల యును; అందుకొని ఆజీవితముఁయొక్క సమృద్ధిని జేర వలయును. ఇది మనుష్యుని స్వకీయమగుముక్తి, దీని నతఁడు పునర్జన్మయొక్క దీర్ఘపరంపర ద్వారమున వెం టాడుచున్నాఁడు. కాని యితరులతోడి ఐక్యమునం

దతఁడు గ్రువ్వఁబడియున్నాఁడు; ఆకారణముచే అతని స్వముక్తియే అతనికి చాలినలక్ష్యము కాఁజాలదు; అతని ముక్తియు, సిద్ధియు జాతియొక్క ముక్తికిని, సిద్ధికిని పూర్వావశ్యములు. అతనిపరిణామచక్ర మేకాంతరేఖ గాదు, విశ్వసత్తయొక్క పరిణామచక్రమునందలి యొక భాగము, మనుష్యునిరూపునందా విశ్వసత్తయే తన్నుఁదా చరితార్థ మొనర్చుకొనుచున్నది. కావున వ్యక్తిగతములైన తన అత్యున్నతము లగుశక్తులను, భవితవ్యములను కనుఁగొని, అటుపై మానుష్యకమునందలి చైతన్యముయొక్క దివ్యశక్తులను, భవితవ్యములను వికసింపఁజేయుటకు ఏ జీవితము సాధనమగునో ఆ జీవితమే దివ్యజీవిత మగును. కాదేని అట్టిజీవిత మొకదానిని, దివ్యసత్త తనయందెప్పుడును రక్షించుదానిని, కోల్పోవుచున్నది. ఆయొకటి ఇది: ఈ సకలమును కౌఁగిటఁబట్టు ఐక్యశక్తి.

---

శ్రీ కేసన గ్రంథాలయము,
తెలప్రోలు.

# శ్రీ అరవింద దర్శనము

---

## విజ్ఞాన సత్త్వయొక్క ఆవశ్యకత

మనుష్యునందలి చైతన్యముయొక్క శక్తి నభివ్యక్తము చేయుటయే మనజీవితముయొక్క పరమోద్దేశము. ఒకవైపునుండి, ఈ అభివ్యక్తి మన యీ తోఁచెడు నునికియందు బీజముగానున్న దానియొక్క క్రమ పరిణామము; మఱియొకవైపునుండి, అది మనయందెల్లప్పుడును ఉండినదయ్యును, లోన తన్నుఁదా నెఱిఁగినదయ్యును, మన యీ వెలిమెఱుక కింకను నిగూఢమైయున్న మన నిజమగు నాత్మయొక్క అపావృతి, సాక్షాత్కారము. ఒకటనే ఈ ప్రక్రియ స్వాతిక్రాంతి, మఱియును స్వసంభూతి, లేక స్వోపలబ్ధి. క్రమాభివ్యక్తియగు పరిణామముయొక్క దృష్టితోఁ జూచినయెడల నిది, మానవసత్త్వ దివ్యమైన అతిమానవత్వములోనికిఁ బెరుగుటగా తోఁచును—ఏలన

అతిమానవత్వ మన, మన యీపరినిబద్ధమైన మనుష్య ధర్మమును దాటిపోవుట; ఉన్నతమగు నధ్యాత్మదృష్టి తోఁ జూచినయెడల ఇదియే ఈతీరుఁ గైకొనును: మన మే భగవత్సత్తనుండి వెడలినామో, తెలియకున్నను దేనియందు మనము వర్తించుచున్నామో, అది తన సత్తాస్వభావముల ఐక్యములోనికి మనలను జేకొనుట; మఱియు మనయందలి, విశ్వమునందలి, తదూర్ధ్వము నందలి మనచేతనకు తన్నుఁ దాఁ బ్రకటించుకొనుట; మఱియు తద్ద్వారమున, తనతోడి సాధర్మ్యములోనికిని, ఐక్యములోనికిని పెరుగుకొఱకై, అనఁగా మనుష్యునకు సాధ్యమైన సర్వవిధమునను, మనము తనచైతన్యము లోని చైతన్యము, తన జ్యోతిలోని జ్యోతి, తనశక్తి యందలి శక్తి, తనసంకల్ప మనఃప్రాణములందలి సంకల్ప మనఃప్రాణములు, తనపదార్థమునందలి పదార్థమును అగుటకై మన కవకాశ మిచ్చుట. జీవితము భౌతికప్రకృతి యొక్క కందమునందుండి వెడలి మానుష్యకమను నాళ మున భగవత్సత్తయొక్క పూవును సారమును అగు చున్నది. ఉనికి కంతయు విశ్వాతీతమగు నవసానమును లేక గమ్యము నొకదానిని మనము కల్పించినను, ఈ తెలి పినది మనుష్యవిధమైన యునికికైనను విశ్వాంతర్గత

మగు గమ్యమును, ఆదర్శమును, పరమతాత్పర్యమును అనఁదగును. ఇది సాధింపఁబడనంతవఱకును లోకముల యందలి జననజీవితములందుండి తప్పించుకొనిపోఁజూచు తొందఱ, మనుష్యునం దీశ్వరసంకల్పముయొక్క సూత్రమును సమయమురానిదే ముందుగా తెంపఁబూనుట వంటిది.

మనయునికియొక్క తాత్పర్య మిదియని నిర్ణీతమై మనబుద్ధి సంకల్పములచే ఆనిర్ణీతియొక్క ఫలితము లంగీకరింపఁబడెనేని, ఇఁక జీవితముయొక్క యథాస్థితి ననుసరించి మనప్రయత్న మేవిధ మవలంబింపవలయునో, ప్రాణముయొక్కయు చైతన్యము యొక్కయు ఏశక్తులిప్పుడు బీజదశయందు మన కందుబాటున నున్నవో, కల స్థితిగతుల నేవిధముగా వినియోగించి వాని నతిక్రమింపవలయునో, ఉపలబ్ధములు కాని ప్రాప్తవ్యముల నెట్లు క్రమముగాఁ బడయవలయునో అను విచారణ మొదలిడవలయును; కాని అది ఇచటఁ బ్రసక్తముకాదు*. ఇచట నుద్దేశింపఁబడిన దేమన, మన యునికియొక్కయు విశ్వపుటునికియొక్కయు మూలసత్యముల విడిపఱచి వానిసాయమున మన యూర్ధ్వమేమో, జీవితము మనయం దేమి

* అది యోగమునందు చర్చింపవలయును.

సాధింప నుద్దేశించినదో యది గ్రహించుట. ఇంతకు పైకిఁ బోవుట దార్శనిక విచారణ ద్వారమునఁ గాదు, మన సత్త్వముయొక్క అవగాహనమువలన. ఇట్టి యవగాహనచే, మనుజుని ఉనికియొక్క స్థితిగతులయందు భగవంతుఁడు, ప్రకృతి, మనుష్యుఁడు, ఈ వీని పరస్పరసంబంధము లేవో తెలిసికొనవలసియుండును; మఱియు వీని అన్యోన్య సంసర్గలను నియమించు విధానము లేవో శక్తు లేవో గ్రహింపవలసియుండును; మఱియును ఏ ప్రత్యేకశక్తిచే ఈ మనుష్యునందలి 'అహ' మతిక్రమింపఁబడి విపులతరమైన యాత్మ చేకొనఁబడునో నిర్ణయింపవలసియుండును. ఇఁక ఆ ప్రత్యేకశక్తి అతిమనస్సు లేక విజ్ఞానమగునేని, అపుడా విజ్ఞానముయొక్క స్వభావ మేమో, అధ్యాత్మచేతన నభివ్యక్తముచేయుటకు దానిసహజమార్గ మేదో, మఱియు దానికిని మనస్సునకును మధ్యనున్న తెర తొలగింపఁబడినపుడు దానిశక్తులును, కర్మవిధానములును ఎట్టివై ప్రకటితములగునో ఎఱుఁగవలసియుండును. మఱియు నీ మనఃప్రాణశరీరముల ముడిని సడలించి, వీని ప్రవృత్తుల నే విధమున విజ్ఞానచైతన్యముల ఉద్భాసితములైన క్రిందినడకలుగా మార్పవీలగునో విచారింపవలసియుండును. కడకు ఈ ఆంతరమగు పరిణామముచేఁగలుగు కార్యికమైన

బాహ్యఫలితమును గమనింపవలసియుండును; జాతి జీవితమునందు దివ్యమగు నతిమానవత్వము నవతరింపఁజేయు సూత్రము నందుకొనవలసియుండును. కావున ప్రస్తుత మిచట, పైనవివరింపఁబడిన దార్శనికసత్యములనుండి సహజముగావెడలు కొన్ని ప్రధాన భావములుమాత్రము సూచింపఁబడును.

ఉనికి యొక్క ఏకసత్యము సచ్చిదానందము. అనంతములైన సత్తాచేతనానందములు దివ్యసత్తయొక్క నిత్యస్వభావము. దివ్యసత్త శాశ్వతమగు తన తత్త్వమందు దేశకాలముల యీజగమును వెలువరించి నిలుపుచున్నది. ఈ కలదంతయును ఈవెలువరింత పోతపోసిన అచ్చును, ఆకృతియును అగుచున్నది; దీనియునికి ఆ దివ్యసత్తకలదు కావుననే కలదగుచున్నది; ఇది దాని రహస్యచేతనచే ఆవిష్టమైయున్నది, దానిశక్తి సంకల్పానందములచే నిలిచియున్నది. కాని యిచట నాసర్వమును దానికి పరమవిరుద్ధమైతోఁచు నొక ప్రారంభరూపమం దంతర్లీన మగుచున్నది. అసత్తతో రమారమి పోల్పఁదగిన స్థితిలోనుండి సత్త బయలువెడలుచున్నది; ఒక మహా నిశ్చేతనముయొక్క గర్భమునందు చేతనము గోపనము చేయఁబడుచున్నది; సర్వగతమగు చిత్సంక

ల్పము ఒకమహాజడమనఁదగు భౌతికశక్తియొక్క రూపు చాటున మఱుఁగుపడుచున్నది. ఇఁక సత్తయొక్క ఆనందము అసుఖ దుఃఖమైన జడనిద్రయందు, అనుభూత్యవబోధములు లేని జడ చేష్టా ప్రతిగ్రహాణలయందు నిమగ్నమై కానరాకున్నది. భౌతికశక్తి యొక్కయు, తద్వ్యూహములయొక్కయు గర్భమందుండి, విశ్వగతములైయున్న ప్రాణ మనశ్చైతన్యముల యంశలై, జీవమును అనుభూతియు చేతనయును బయలుపడుచున్నవి. ఈ బయల్పాటు ముందుసాగినకొలఁదియు, వ్యక్తియందలి ప్రాణ మన శ్చైతన్యముల నుత్తరోత్తరస్థాయి కధిరోహింపఁజేయుచు, విశ్వాంతరములైన ప్రాణమనశ్చైతన్యములు సత్తయొక్క బహురూపములందు వ్యక్తము లగుచున్నవి. కాని వ్యక్తిగతములైన ప్రాణ మన శ్చైతన్యముల విన్యాసముల యందన్నింటను సత్తాజ్ఞానములును సామర్థ్యకర్మములును అనుభూతియును ఆంశికములు, పరిచ్ఛిన్నములు, విభక్తములునై తోఁచుచున్నవి. ఇఁక నియ్యవి ఈ ఆంశికత చేతనే సదోషములు; మఱియు అందువలననే ఏకాకారమైన జడిమ యను పటముపై పరస్పర ప్రతియోగికములైన ద్వంద్వములు నిరూపింపఁబడినట్లు సృష్టియొక్కచందము మన కగపడుచున్నది.

సుఖము, దుఃఖము, సుఖదుఃఖముల రెంటియొ క్కయు అగ్రహణ, లేక యీరెంటి యెడను తటస్థస్థితి అను ఈ యనుభవముల అన్నింటిద్వారమునను సత్తయందలి యానందము తన్నుఁదా నన్వేషించుకొనుచున్నది; అరికట్టఁబడి, పరిమిత మొనర్పఁబడి, తడవుడుచే వలసినది గ్రహించుచు, అది తన స్వానుభవములను జేరుచు న్నది. దాని శ్రేష్ఠములైన స్వానువాదములును వాస్తవమైన యానందముకావు, ఆ యానందముయొక్క దిగువ రూపు, ఆయానందముయొక్క అర్ధనిరూపణము లేక అప నిరూపణము. చేతన నిమగ్నదశయందుండి వెడలినదై ప్రాణికములు, ఐంద్రియకములు మఱియు మానసికములు నగు క్రియాప్రతిక్రియల పరిచ్ఛిన్నరూపములందు తన్నుఁదా నన్వేషించుచున్నది; తన దిగువ లోతులలో మునిఁగియున్న తన స్వవ్యాపారమే చాలవఱకు దానికి గహనము. తన యిప్పటి ఉత్తమములైన స్వానువాదములును దానిపరిమితములైన అవరరూపములు; మఱియు స్వతత్త్వముయొక్క యథార్థమగు ఉచ్ఛ్రాయమును ప్రసారమును దానియిప్పటి స్వనిర్మితికందరానివి. దాని ఇచ్ఛాశక్తులకును ఇదేచందము; స్వాధీనములైన సామర్థ్యములయందు, నెఱవేఱికకురాని పెనకువల

యందు, ఈ రెండునుకాని అశక్తతలయందు అవి వ్యత్యస్త ముగా వ్యక్తము లగుచున్నవి; మఱియు వాని ఉత్తమ స్వానువాదములును వాని ఇప్పటిచేరిక కావలదైన ఊర్ధ్వ చేతనయందు నిరూఢమైయున్న యొకశక్తిని సూచించు నట్టి అవరరూపములు. చేతన ఇంతవఱకు సాధించిన అన్యోన్యతలు వానిప్రాప్తికైన అన్వేషణోద్యమముల దశ యందలివి: ఒక యాకర్షణము, ఒకవికర్షణము; విసంవా దముల బాహుళ్యము, మఱియు అవిసంవాదమునకై కొంత మేళనప్రయాస. ఇదంతయు ఈ విరోధములకు చెలిమి కలుపఁగల యొక విపులశక్తికేసి ప్రాకులాట. ఏలన చేతన తా నుద్దేశించెడునట్టియు, దాని యాశ్రమ యంతయు సూచించుటయేకాక పూర్వభావియై అవశ్య ముండి యుండవలయు నని స్థాపించునట్టియు ఉనికి, ఇప్పు డీ నెఱ వేఱియున్న ఉనికికాదు; తన విభాగములద్వారమున నది వెదకుచున్న యొక ఐక్యము కలదు. అంతవంతములైన తనరూపములద్వారమున నది నిరూపింపఁజూచియు, విరూ పముచేయు నొక ఆనంత్యము కలదు; కాని ఆ ఐక్య మును ఆనంత్యమును ఇట నిలిచియేయున్నవి, మఱియు ఈకలదంతయు వానియందే వర్తించుచున్నదనియు, వాని చేతనే నిలువఁబడియున్నదనియు, వానినుండియే తన

శక్తులను గైకొనుచున్నదనియు విశదము. సకలమును తన ప్రత్యేకతను స్థాపించుకొనుటకు మొదట యత్నించు చున్నదనుట నిక్కము; కాని యదిగాక, తన్నుఁ దా విరివి యొనర్చుకొనుటకును, ఉచ్చత కెత్తుకొనుటకును, మఱియు సత్త, చేతన, ఈశిత, ఆనందము—వీనిని మఱింతమఱింత కవుంగిటఁబట్ట నేర్చుటకును, గూఢదశ యందున్న తన యాత్మను, మఱియు చుట్టునున్న తనపరి సరమును ఎల్లని అధికాధికముగా పడయుటకును, స్వాధీన మొనర్చుకొనుటకును ప్రయత్నించు చున్నది. మఱియు నిట సమష్టియు వ్యష్టియు పరస్పర మాశ్ర యించి యున్నవనుట తేటతెల్లము; కాని ఈ రెంటినడుమ నేదో కలత యున్నట్లు మనకు తోచుచున్నది; ఒక విధ మైన సామంజస్యమును సాధించియు, దాని ధ్రువస్థితినిగాని, స్వాధీనతనుగాని, అం దానందమునుగాని అవి యనుభ వించుట తోచదు. అదిగాక ఆ సామంజస్యమేని కట్ట కడపటిదియు కాదు, తృప్తికరమును గాదు. ఇపుడు సాధింపఁబడిన ఆంశికమగు సామంజస్యమును దృఢముగా నిలుపుకొన నేర్చుటకును, మఱియు దీనిని సార్వత్రికముగ నిష్పన్నముచేయఁగలుగుటకును రహస్యము, అతీతము నందు మెలకువఁ గనుట; ఏలన దానియందు సమస్తమును

వ్యస్తమును ఒక్కటైయుండును. మనుష్యసత్తయందు ఈ తెలిపిన స్థితియంతయు మొదట తన్నుఁ దాఁ దెలిసికొని సజ్ఞాన మగుచున్నది, మఱియు మనుష్యునందలి చేతనా సంకల్పములు స్వప్రయత్నముచే తమబంధనముల నతిక్రమించి, తమయునికియందుఁగల సామంజస్య-రహస్యము నందుకొన గమకించుచున్నవి.

మనయునికియందు విశ్వసత్తకు ద్వివిధమైన అభిసంధికలదని మనము తొలుత గమనింపవలయును; తన అసమగ్రమైన అభివ్యక్తియం దది యేస్థితియందున్నదో దానియందలి ఆనందమేకాక, రానున్న విపులతరాభివ్యక్తి కేసి తనగతియందలి యానందమును దానికికలదు. పరిణామముయొక్క ప్రతిపదమును ఈ ద్వివిధమైన యానందమును, ఈ ద్వివిధమైన అభిసంధిని వెలువరించుచున్నది; సాధింపఁబడినదానియం దభినివేశమును, దానిని కొంతగడువు నిలువఁబెట్టు ప్రయత్నమును గలవు; ఇవిగాక ఇప్పుడున్న రూపునందే ఇదివఱకునుండియు ఏర్పడుచున్నట్టియు, రహస్యముగా పూర్వలక్షితమైయున్నట్టియు ఉచ్చతరరూపము సాధించు నభిసంధియు కలదు. మఱియు ఆ ఉచ్చతరరూపము వెడలినపుడు పూర్వసాధితమునం దెంత ప్రధానమో, ఎంత రూపాంతరయోగ్యమో దానిని

గ్రహించి, విశ్వసత్త దానికి, చేతనాసంకల్పానుభూతుల వృద్ధివలనఁ గలిగిన నూతనశక్తి ననుసరించి, నవతరమైన లక్ష్యమును, ప్రయోజనమును, విపులతరమైన తాత్ప ర్యమును ఇచ్చుచున్నది. మన యారోహణయును ఈ ధర్మము ననుసరింపవలయును; ఐయున్న దానినుండి కాఁగలదానికి ప్రక్రమించుట, మఱియు పూర్వపు టునికియం దేది సారభూతమో, ఏది పరిణామార్హమో గ్రహించి, దానికి క్రొత్తరూపొసఁగుట. మఱియు నీప్రక్ర మము, కొంతవఱకు, అయియున్నదానిశక్తిచే, కాని ముఖ్యముగా, మనము కాగమకించు దానిశక్తిచే సాధింపఁ దగినది. కాని వాస్తవమునకు ఆశక్తియొక్క అవర నిర్మాణమునందు రహఃస్థితమై, అసమగ్రలిఖితమై పర నిర్మాణ ముండనే యున్నది. బీజదశయందున్న అధికతర స్థితియొక్క రహస్యము యథాస్థితియం దెప్పుడును కలదు; దేనిసూచనల నది వెలువరించుచున్నదో దాని యం దెక్కువభాగమును తనలోన దాచియు, దాని ఛాయను మాత్రము ముందుపడఁజేయుచున్నది, దాని ఇంగితమును పైకొత్తుచున్నది. ప్రాణముయొక్కయు, మఱియు ప్రాణము నుండి వెలువడు సర్వముయొక్కయు ఇంగితము భౌతిక ద్రవ్యమునం దెప్పుడును కలదు; మనసుయొక్కయు

మఱియు మనసునుండి వెడలు సర్వముయొక్కయు రహశ్శక్తి ప్రాణమునం దెల్లపుడును కలదు; మఱియు మనసునం దట్లే విజ్ఞానచైతన్యములశక్తియు నిహితమైయున్నది; ప్రమాదోపహతమయ్యును తానే శక్తియొక్క నిర్మితియో, లోన మఱుంగుపఱచియు మనసు దానిని ప్రతితరుణమునను మెఱపులవలెనైన సూచనలయందు వెలిచేయుచునే యున్నది. ప్రాణము భౌతికసత్తను చేకొనుచున్నది; మనస్సు ప్రాణమును భౌతికసత్తను చేకొనుచున్నది; తాను చేకొన్నదానికి ప్రతిదియును క్రొత్తసామర్థ్యములను క్రొత్తప్రయోజనములను కల్పించుటయేగాక, దాని నతిక్రమించి దాని కావలవస్తువుల తనయందు వ్యక్తముచేయుచున్నది. చైతన్య విజ్ఞానములును అభివ్యక్తములై, ఇట్లే మనఃప్రాణభౌతికసత్తల యీనిర్మాణములను గైకొనఁగలవు; కైకొని వాని నతిక్రమించి, వాని పరిణతి సాధింపఁగలవు. మఱియు, మనసత్త యందలి ఆ ఉచ్చతమశక్తుల స్వభావమును, వానితో ఈ క్రిందిధాతువులకుఁగల సంబంధమును కొంత విచారించితిమేని, ఇఁక నీరాఁగల పరిణామము ఆమూలవ్యాపి కాఁదగినదనియు, మఱియు నీఅతిక్రమణమును, తాస్పృష్టించు క్రొత్తనిలుకు వలనను స్థాయివలనను, తానోసంగెడు

చూడ్కి యొక్క విరివిచేతను ఔన్నత్యముచేతను అత్యంతపరివర్తకము కాఁగలదనియు గ్రహింపవచ్చును.

దివ్యమగు విశ్వసత్త ఉనికియందలి యీసతత పరిణామమును తన కవుంగిటఁ బట్టియున్నది. తొలుతటి ఈ ఆంశికమైన స్వనిరూపణమును, తరువాతి ఈ స్వాతి క్రమణమును సమానమైనయానందముతో నంగీకరించి యున్నది. ఈయంతకును ఆ ఆనందమే ధారకము. విశ్వ సత్తకు ఆరంభములయందును సమగ్రమైన యానందము. బాటయందును బాటప్రక్క మజిలీలయందును సమగ్ర మైన యానందము, మఱియు గమ్యమునకుఁ జేరుట యందును సమగ్రమైనయానందము. మునుపును ఇపుడును ముందును, ఉండిన ఉన్న కానున్న ఈసర్వ మును ఉత్పత్తిచేసి ఏది పాలించునో అట్టి తన అతిసర్వస్థితి, లేక అతీతమునందలి ఆనందముతోపాటు, విశ్వసత్త తన కాలగతమైన అభివ్యక్తియొక్క ప్రత్యంశమును తమలో నిడుకొని ప్రపంచించు నీ ఉత్తరోత్తరములైన విశ్వముల యందలి ఆనందము నేకకాలీనముగా ననుభవించును; మఱియును, తనస్థితిగతులయొక్క వివిధములైన యొత్తి డుల భరించుచు, లోన వహించియున్న నూతనస్థితిగతు లను క్రమవికాసద్వారమున వెలుపలఁగూడ నుపలబ్ధ

మొనర్చుకొని స్వాయత్తము చేసికొనుటకై ప్రక్రమించెడు వ్యస్తసత్తయందలి, అభివ్యక్తి చక్రముయొక్క బహుళీకృత కేంద్రమైన వ్యష్టియందలి ఆనందమును ఏకకాలమున విశ్వసత్త తనయందు వహించును. విశ్వమునందువలెనే ప్రతిసత్త్వమందును ఈ అతీతము, ఉత్తరోత్తరభూమికలు గల ఈవిశ్వసత్త, మఱి ఈవ్యష్టియు కలవు; ఏలన విశ్వమునందుఁ గల ప్రతిదియును ఆత్మసత్తయొక్క ప్రతి ప్రత్యేకగ్రంథియందును కలదు. మన యధ్యాత్మసత్త యందు నిలిచి, విశ్వసత్తను కవుఁగిలించి, దానిని మీఱి యున్న అతిసర్వచైతన్యము మనలోన కలదు; దేనికతమున మన మాంతరముగాను, మఱియు మన యథార్థమగు విశ్వప్రకృతియందును, ఉన్న యీ సర్వముతో ఒకటియై యున్నామో అట్టి విశ్వచైతన్యము లేక విశ్వాత్మయు మనలోన కలదు. మఱియు సమష్టిసత్తయొక్క స్వానుభూతియందు ప్రవేశించుచు, ఆసమయముననే వ్యష్టికేంద్రమునకు తనను లగింపఁజేసికొనునట్టి యనుభూతియొక్క ఆధారమున, సమష్టివ్యష్టులచే కలసి వహింపఁబడు ఈ విశ్వముయొక్క సంబంధములలో మెలఁగెడు వ్యస్తజీవి, లేక జీవాత్మయు మనయందు కలదు. సత్త తనయాత్మజ్ఞానగతమైన యీ త్రివిధసత్యమునం దెల్లపుడును

వర్తించునదై తనయూనికిని, స్వతత్త్వమునందేకాక సృష్టి యొక్క సంభూతి ప్రక్రియయందును, ఆనందముతో వహించుచున్నది.

కాని విశ్వసత్త ప్రకృతియందు తన్నుఁదా సోపానముపలెనైన ఉత్తరోత్తర దశలందభివ్యక్తము చేసికొనుచున్నది; మఱియు వ్యష్టియగుజీవియు ఈదశలందలి యనుభూతి కనువుగా తన్నుఁదా నాకారించుకొనుచున్నది. విశ్వాత్మ ఈ వేర్వేఱుదశ లన్నింటికిని తావలమై ఒకే కాలమున వీనినన్నిఁటిని వీక్షించుచున్నది; మఱియు వ్యష్టియగు నాత్మకును ఆంతరముగా అట్టి ఉనికియును శక్తియును కలవు. అనఁగా వ్యష్టియును ఒకటనే సచ్చిదానందాత్మకమగు చిన్మయానంతసత్త, మఱియు ప్రాణ మనశ్శరీరములవలనఁగలిగిన పృథక్త్వములలో వ్యవహరించెడు వ్యస్తసత్త, మఱియును ఉనికియొక్క ప్రతియోగివిధములై తోఁచు ఈరెంటికిని, ఏకకాలికమైన ఏకత్వ బహుత్వానుభవముచే సంబంధమును గలుపు అతిమానసికమైన విజ్ఞానసత్త. కాని ఇయ్యది లోలోన; తనపై పయిచేష్టకు తావలమైన బాహ్యప్రకృతిలో; జీవి ఒకసోపానమునుండి వేఱొక సోపానమునకు ఆరోహావరోహములఁ గావించును, జన్మప్రక్రియాద్వారమున ఒకభూమికయందుండి

యింకొకదానిలోనికిఁ బ్రవేశించును, మఱియు వెలుపలి దగు తనమనస్సునందు ఆభూమికయందు మాత్రమే తన యునికి యని తలపోయును. కాని అది పృథివిపై నవతరించినప్పుడు దానిసత్తయందలి ఇతరభాగమంత యును దాని వెలుపలి మనస్సునందలి చేతన కూర్ధ్వగతమై అల నిలిచియేయున్నది. మఱియు జీవియొక్క ఈ పార్థివ స్థాయియందుఁగూడ, దానికాఁగలదంతయు, చేతన కధః స్థితమైయున్న తనయునికియందు, కొంత నిబద్ధమై కొంత సంసిద్ధమై, కలదు. మఱియు జాగ్రచ్చేతనకు దిగువనున్న యీభాగమే దానిపార్థివమగు అనుభూతికిని వివృద్ధికిని మిక్కిలి విరివియైనట్టియు రహస్యపులోతులందున్నట్టియు పునాది. కావున మన మనస్తత్త్వమంతయును ఈమూఁడు ప్రధాన విషయములపై నాధారపడియున్నది:— మొదటిది: విశ్వాతీతము, సమస్తము, వ్యస్తము అను వీని యొక్క ఐక్యము, మఱియు పరస్పరసంబంధము; రెండవది: అంతరసత్త, బాహ్యప్రకృతి, వీనియందొకదానిపై ఇంకొకదాని కార్యము; మూఁడవది: మన తెలివియొక్క మూఁడు తెఱఁగులు—ఊర్ధ్వచేతనము (Super-conscience), అధశ్చేతనము (Sub-conscience), జాగ్రచ్చేతనము (Waking-consciousness).

మన పరిణామము చేరినట్టి యవధి, ఈమన వెలితెలియిక; దీనిని మన మతిక్రమింపవలసి యున్నది; ఎల్లప్పుడును, మనలోని రహస్సునందునను, మఱియు ప్రాకృతికమైన యునికియొక్క యిప్పటి స్థాయి కూర్ధ్వమందునను, యథార్థముగా మన మేమయియున్నామో అది యీ వెలితెలియికయందు వ్యక్తము చేయవలసియున్నది; అధశ్చేతనయొక్క అధస్తమదశమైన నిశ్చేతనమని (In-conscience) పిలువఁబడు దానియందు బీజరూపమున గుప్తమైయున్న సర్వమును పైకిఁ గొనిరావలసియున్నది. మన వెలితెలియికయందు, సచేతనమగు నొక 'అహము' తో సంబంధపడియున్న మానసిక ప్రాణిక భౌతికమైన ఒక పృథక్త్వముగా మనకు మన మగపడుచున్నాము; కాని యీ అహము అధ్యాత్మపురుషుని యొక్క, వ్యష్టిదైవముయొక్క మాఱువేషము మాత్రము. అహంతతో నేకమై, పుట్టునట్లును చచ్చునట్లును మనము తలఁచుచున్నాము; కాని వాస్తవమునకు మనుష్యుని ఆత్మ పుట్టుటయు లేదు, చచ్చుటయు లేదు; ఈపార్థివశరీరము యొక్కయు, జీవితముయొక్కయు ప్రాకృతిక రూపమును ధరించుచున్నది, దానిని లయమొనర్చి యటుపై అట్టిదే వేఱొక క్రొత్త రూపమును

ధరించుచున్నది. స్వర్గము, పృథివి, ఇతరలోకములు, వీనిమధ్య నది సంచరించుచున్నట్లు మనకు తోచు చున్నది; కాని యిదంతయు దాని వెలితెలియిక యందలి స్థాయియొక్క మార్పుమాత్రమే. యథార్థమునకు, మన యందలి యొకానొక భాగముతో మాత్రమే మన మీ పృథివిపై జీవించుచున్నాము; ఏలన ఇతరలోకము లెల్లప్పుడును ఇచటనే మనయందున్నవి. బాహ్యప్రకృతి యందు మన మొక లోకమునందు - ఈ లోకమునందో వేఱొకలోకమునందో - ఉన్నట్లు తోచుచున్నది; కాని మనయాత్మ సత్తయందు విశ్వము మనలోనిదే యగు చున్నది. మన చేతన కదియొక ప్రతిభాస లేక దృశ్యము మాత్రము. ఏలన తన సత్తయందు విశ్వము నభివ్యక్తము చేసిన సచ్చిదానందమగు చైతన్యమునకు విశ్వమట్టిదియే. ఈ విషయమును మనము బుద్ధిచేత నేగాక ఆత్మయందు గ్రహింపఁగలమేని, ఈ జ్ఞానమునందు మనము జీవింపఁ గలమేని, మన మానసికమైన నిలుకంతయు ఆమూలా గ్ర పరివర్తనముఁ జెందును; జీవితముయొక్క బాహ్యా ర్థము మాఱిపోవును; పైచూపులకు దానఁగల యసత్యము లేక శకలసత్యము జారిపోవును; దాని యథా ర్థము నది చేకొనును. అప్పుడు మనము మన ఆత్మసత్త

యందు జీవింప మొదలిడినవార మగుదుము. అటనుండి మనశ్శక్తిని మనప్రాకృతసత్తపై ప్రవర్తింపఁజేసి, సాంకేతికములైన దానిరచనలందు అంతరములై అంతరతరములై యున్న అర్థములను ఉత్తరోత్తరముగా ఆవిష్కరించియు చక్కఁబఱచియు, దాని ప్రతిభాసలకును స్థాయిప్రకారములకును సంపూర్ణమైనట్టియు న్యాయ్యమైనట్టియు వినియోగము కల్పింపనగును.

దీనికి సూత్రము యథార్థజ్ఞానమునకుఁ జేర్చునట్టి ఆత్మజ్ఞానము; ఆహేతువుచేతనే ప్రాచీన విద్యయందు మన యభ్యున్నతి అజ్ఞానదశయందుండి జ్ఞానములోని కెదుగుటగా నిరూపింపఁబడినది. మన మజ్ఞానమునందు స్థాయిగా నిలిచి యుండుటకు హేతువు అహంతయొక్క ముడి. మన యారోహణక్రమమందు అసలుమెట్టనఁదగునట్టియును, మన యునికియొక్క కూర్పునంతయు మార్చివేయునట్టియును అంతర్ముఖత్వము, లేక ప్రత్యావర్తనము సాధింపఁబడనంతవఱకును, మనసత్తయందలి సర్వఘటనమును మనయహంతకు ముడిపెట్టుచున్నాము. మనయందలి ఆత్మ తన ఆంతరసత్తయందును, బాహ్యప్రకృతియొక్క సకలఘటనలయందును సమానమైన యానందము ననుభవించును; అవిద్యలో తికమకపడు

మనసుయొక్క కస్తియందుఁకూడ దానికి రహస్యమై లోనిమిడియున్న యానందము గలదు; కాని బాహ్యమగు మనమనస్సు అహమునందు వర్తించునంతకాలము, ఛాయఛాయగానో సాపేక్షికముగానో తప్ప, ఆత్మయొక్క యానందమునందు పాల్గొనలేదు. ఐయటిస్థితిచేతను ప్రతిభాసచేతను అది నిబద్ధమగుచున్నది. వేదకుటయందును పడయుటకైన యత్నమందునను కల దుఃఖము సమస్తమును అనుభవించుచున్నది, తన ప్రగతియందును సోపద్రవమైన న్యూనసుఖమును మాత్రమనుభవించుచున్నది. మఱియును ఈ సుఖమును ఈ ప్రగతియు మనోమయ సత్తయొక్క ఇప్పటి ఈ యసమగ్ర నిర్మితియొక్క మేరయందు, ఇప్పుడది మెట్టఁగల బాటయొక్క పొడవునందు, ఇప్పుడది విశ్రమింపఁగల మజిలీలయందును బద్ధములై యున్నవి. ఈ యహంతను దాటినఁగాని, స్వాతిక్రమణమునందలి తరువాతి మెట్టుత్రొక్క సాధ్యముకాదు. ప్రాణ-మనః-శరీరముల అడ్డగోడలనడుమ ప్రత్యేకమైయున్న అహంతచే నేర్పడిన యిప్పటిస్థాయితో ఏకీభావమున నుండుట మానవలయును. కావున అహంకారమునువీడని అతిమానవత్వముండఁజాలదు. వాస్తవమున కిది స్వోక్తివ్యాఘాతము.

ఏలన అట్టి యతిమానవత్వము మేరలందు బంధింపబడి యున్న యిప్పటి మానవత్వముయొక్క ధర్మములను నిజముగా నతిక్రమింపదు, అంతగా చేసినచో, వానిని విపులములను, ఉన్నతములను జేయును మాత్రము. ఆపని సాధింపఁదగినది కావచ్చును; కాని యది ప్రకృతి-పరివర్తకమైన స్వాతిక్రమణముగాని స్వానంభూతిగాని కానేరదు.

అదియునుగాక మనోమయ సత్తయొక్క స్థాయి నంతను అతిక్రమించినఁగాని, ఆరోహణ సమగ్రముగా సిద్ధింపదు; ఒకవేళ సిద్ధించుననన్నను, సంపూర్ణముగా క్రియాశీలము గానేరదు. మన అహమును వీడి అధ్యాత్మ సత్తయొక్క ఉపలబ్ధిని మనోభూమికపైఁ బడయవచ్చును. మనము తాత్త్వికముగా నేమైయున్నామో, దేని యందున్నామో, అట్టి సచ్చిదానందముల యానంత్యము నచ్చటఁ దెలియవచ్చును; కాని ఇది మనస్సునందు చైతన్యముయొక్క ప్రతిబింబ మగును; లేదేని చైతన్యమునందు మనస్సు మిగుల మిగుల నిమగ్నమైపోవుట యగును. మఱియు ఈనిమగ్నత కడముట్టినదై, మన కర్మసామర్థ్యముయొక్క కేంద్రమును రూపఱఁజేయును. ఏలన, మనస్సు పృథక్కారి యగుటచే దాని కర్మ

కేంద్రముకూడ పృథక్కారి కాక తప్పదు; దివ్యసత్తి మన యందు మన అహంతద్వారమున ప్రవర్తించును. కావున ఈమార్గమును మన మనుసరించితిమేని, అది యీ మనస్సృష్టిగతమైన సంభూతియొక్క విరామము కొంటకును, చైతన్యముయొక్క ఒకానొక స్థితిశీలమైన నైశ్చల్యమునందు నిద్రించుకొంటకును, బహుశః తద్ద్వారమున విశ్వాతీతమైన సత్తలోనికి తిరిగి చేరుకొంటకును సమర్థమైనచో కావచ్చును. వ్యష్టి విశ్వాతీతమైన స్థాయి యందు తనను దా లగించుకొనును, అపుడతని యానందము గాఢ సుషుప్తియందలి యానందమువంటి దగును. అతఁడు సచ్చిదానందముయొక్క పరసత్తతో కలసికొని అందు తననుఁ దాఁ గోల్పోవును. ఎల్లప్పుడును సాగుచుండునట్టియు, ఎన్నటికిని కడపటితుదిని చేరనట్టియు అభివ్యక్తియందు అతీత సచ్చిదానంద మనుభవించెడు ఆనందమునందుండి యతఁడు తననుఁ దా విడిపఱచుకొనుచున్నాఁడు. ఏలన దివ్యసత్త తన యతీతత్వమునందే నిబద్ధమై యుండలేదు; సంభూతియందు దుఃఖముగాని, దానియెడ భయముగాని దివ్యసత్తకులేవు. మనోమయమొనర్పఁబడిన వ్యక్తివలె నివృత్తిముక్తియందు దాసంభూతి నుండి శరణుగొనుట దివ్యసత్తకు అవసరము గాదు.

మూలమగు అసంభూతి యందు నిత్యముక్తమై, సంభూతి యందును అమృతమగు దివ్యసత్తవలె మనమును ఉండఁగోరుదుమేని, అనఁగా ఉపనిషత్తనఁదగునట్లు, 'అసంభూతిచే మృత్యువును తరించి, సంభూతిచే అమృతత్వమును బడయుదుమేని'*, సత్తయొక్క సంకల్పచేత నానందముల కేంద్రమును వేఱొకదానిని— ఎచట విశ్వాతీతమును విశ్వమును వ్యస్తమును తమ ఐక్యమును, ఐక్యమునందలి బహుత్వసంబంధములను సహజవశిత్వమునందు జేపట్టియుండునో అట్టి కేంద్రమును —మనము కనుఁగొనవలయును. అది మనోమయమైన సత్తయందును చేతనయందును గల అపరోక్షభూమిక పై (ఇట్టిభూమిక కలదు) సంపూర్ణముగా వశము కాదు; అది మనోఽతీతమైన విజ్ఞానమునందే గ్రహింపఁబడవలయును. కావున మనోమయసత్తను విజ్ఞానమయసత్తగా పరిణతము చేయుటయే మార్గము.

---

# శ్రీ అరవింద దర్శనము

## చిన్మయ విజ్ఞాన సత్త

పరిమితమైన మానసికతనుండి, విభాజకమైన చేతన నుండి, అవిద్యాగతమైన అహంతకుఁ జెందిన ఆలోచించుట, జీవించుట, ప్రవర్తించుట, అనుభవించుటల యొక్క పద్ధతులలోనుండి, స్వప్రతిష్ఠితమైన అధ్యాత్మ సత్తయొక్క ఆనంత్యములోనికిని, అతీతముయొక్క సన్నిధానముచే జ్యోతిచే నియమింపఁబడు విశ్వచేతన లోనికిని, విజ్ఞానమయుఁడైన అధ్యాత్మవ్యక్తికిఁ జెందిన ఆలోచించుట, జీవించుట, ప్రవర్తించుట, అనుభవించుటలయొక్క పద్ధతులలోనికిని ఎదుగుటయే దివ్య జీవితములోని కారోహించుట. మనుష్యునందలి ప్రకృతి యొక్క పరిణామమున కీ పరిపాకము సాధ్యమని మన మరయఁగలము; ఇది మనుష్యుని ఇప్పటి యునికి

యొక్క శిఖరములం దంతటను సూచింపఁబడుచున్నది. ఇది ఇప్పటి అవాప్తిరేఖ కావల సాధ్యమైయున్న మఱునటి ప్రాప్యము. జాతివ్యక్తుల రెంటిని ఉచ్చస్థితికి తఱుము ప్రేరణకును, సంపూర్ణతకొఱకు తపింపఁజేయు క్షుధకును ఈప్రాప్యమే లక్ష్యము కావలయును.

ఉనికియొక్క అల్లికయం దంతటను పరిణామము యొక్క సూత్రము. దేశకాలములందు వ్యాప్తమైన తన ఆత్మ - భావన ఉపాదానముగా, మాతృకగా, నిత్యుఁ డీప్రపంచమును సతతమును తనసత్తలోనుండి అభివ్యక్తము చేయుచున్నాఁడు. తన అధ్యాత్మసత్తను విశ్వమునం దంతరితము జేసి విశ్వముయొక్క రూపము లందు దాని నావిష్కరించుచున్నాఁడు. కాని పరిణామ మనఁగా బీజస్థితియం దున్నదానియొక్క క్రమితమైన యభివృద్ధి,దృశ్యమునం దంతర్హితమై కనఁబడకున్నదాని యొక్క యభివ్యక్తి. ప్రథమజీవపదార్థముయొక్క క్షుద్ర బీజమునందు — ఇచటను చైతన్యము జీవపదార్థము యొక్కరూపునం దంతర్లీనమైయున్నది — దివ్యప్రజ్ఞ లేక "భావము" (Idea) మనుష్యునియొక్క భౌతికాకృతి నెట్లు దాచియుంచినదో,మనుష్యునిపశుత్వ మత్యంత ప్రబలమైయున్న దశయందును మఱియు పరిమితమైన మనుష్య

త్వమునందలి స్వాభిమానము సునిరూఢమై యున్నదశ యందును దివ్యవ్యక్తియొక్క ఆధ్యాత్మికాకృతిని అశ్లే మనుష్యునందు దాచియుంచినది. దాని నభివ్యక్తము చేయుట మనుష్యుని నియతి. స్వాజన్మపరంపరల చక్రము నందు లేక మానవజాతియొక్క ప్రళయప్రభవముల యందు మనుష్యుఁ డితర మేమి చేసినను, ఏస్థితిని ప్రాపించినను, ఏమి నిష్పన్న మొనర్చినను అదంతయును అతని పెరుగుటయందలి భిన్నదశలయొక్క పని, అతని యాత్రాపథమునం దతఁడు చూపు శక్తియు, ఆనందమును; కాని లోని దివ్యు నభివ్యక్తముచేయుట కొదువలేని సమాప్తి, చేరవలసిన గమ్యము. ఇది క్రమికమైన పరిణామముచే, సంవర్ధనముయొక్క సతతగతిచే, జన్మముల యుగముల వివిధపరిసరముల శ్రేణీపరంపరలలో, అనేకదశల ద్వారమునను, అనేకక్రమముల ద్వారమునను నెఱవేఱునట్టి ఆవిష్కృతి. దీనియందు ఆరోహణ పతనము లనేకములు. తననుఁ దా నత్యంతము దాటి దూసికొనిపోవుటకైన తహతహ, మఱియు తన మిక్కిలి దిగున "నేను" లోనికి తిరిగి తిరిగి పతనము; కాని దీని కంతయు మొత్తముమీఁద ఫలితము, రహస్యముగా నున్న ఒక భావితముకేసి, ఒక ప్రాప్యము లేక

ఆదర్శమునకేసి మనుష్యుఁడు ముందునకు నడచుట. జంతువట్లు తన యిప్పటిస్వభావమునందు అజ్ఞానముచే తృప్తిపడి నిలుచుట అతని నియతియందు వ్రాయఁబడ లేదు. అతనియందు పశుసత్త్వ కలదు; అతిక్రమింపఁ బడిన దయ్యును, అది యింకను అతని ఆత్మపరిజ్ఞాన మునకును, అతని సంకల్పిత లక్ష్యములకును సంకోచ మును కల్గించుచున్నది. కాని అతనియందు దేవతయుఁ గలదు. అయ్యది రహఃస్థితమై ఇంకను జన్మపడయనిదై జన్మమును కాంక్షించుచున్నది. మానవుని సామర్థ్య ములయొక్కయు, వర్తనములయొక్కయు ఉదారోచ్ఛ్రిత ములైన ఒత్తిడులయందు, ఎచట నతఁడు తనలోని రహఃప్రేరణయొక్క వెలుఁగురభసముల ననుభవించునో అచట నది జన్మగ్రహణమున కాయత్తమగుచున్నది.

పార్థివప్రకృతిచే సృష్టింపఁబడిన జీవులన్నింటిలో మనుష్యునకు ప్రత్యేక స్థానమిచ్చెడు ఒక విలక్షణత కలదు. అతనియందు ప్రకృతి తనుఁ దాను బుద్ధిపూర్వక ముగా, సజ్ఞానముగా అతిక్రమించుకొనుటకై ప్రయ త్నించుచున్నది. ఈ ప్రయత్నము మొదట మాన సికము, తరువాత క్రమముగా నాధ్యాత్మికము. మనుష్యు నందు తప్ప వేఱుచోట ప్రకృతియొక్క యీ స్వాతి

క్రమణప్రయత్నము వేకువకు క్రిందివైయున్న శక్తి సంకల్పముల ద్వారమునను, కేవలము భౌతికములును ప్రాణికములును నగు సాధనములవలనను జరుగుచున్నది. మనుష్యునం దీ విలక్షణమైన క్రొత్తకు హేతు వేమన, అతఁడు తన ఊర్ధ్వమున కేసియు, తనచుట్టును, తన క్రింది వైపునకును చూచెడుమనస్సు; అతఁ డతిక్రమించిన ఒక క్రిందియాత్మ యుండుట నతఁ డెఱుంగుచున్నాఁడు, తన మొదటిదశలయందలి ప్రవృత్తులయొక్క ప్రస్మృతిచే, ఇంకను అచటి క్రిందియాత్మచే ఆకృష్టుఁడగుచున్నాఁడు; దాని నిప్పటికిని సునిశ్చితముగా అతిక్రమింప వలసియే యున్నాఁడు. మఱియు తన యిప్పటి ఆత్మయందు విపుల మొనరించి సమగ్రము చేయవలసియున్న సామర్థ్యముల కలిమి నతఁడు గమనించుచున్నాఁడు; తనయం దొకా నొక జవము వేఱొక ఉచ్చమైనట్టియు, అధిగమ్యమై తోఁచునట్టియు ఆత్మలోనికిఁ జేర శ్రమించుట ననుభ వించుచున్నాఁడు. ఈప్రేరణయొక్క తాత్పర్యము పూర్ణ వైశద్యముకల రూపుతో మనుష్యునం దింకను వెలయుట లేదు; అట్లే మనుష్యజాతియును వృద్ధివైపుల్యములఁ బడయవలసిన యక్కఱను సర్వసాధారణముగా అనుభ వించుట లేదు. ఏలన మిక్కిలి దిగువ తెఱఁగు మను

ష్యునం దింకను ప్రకృతి తనస్థూలమును, జడమును, అప్రాప్తచేతనమును అయిన క్రియావిధానమును, అంధ ప్రక్రియను నిలిపియుంచినది; మఱియు మిక్కిలి పై తెఱఁగు మనుష్యునందును కొంత దృష్టిశక్తితో, కొంత యాత్మజ్ఞానముతో, కొంతయూర్ధ్వకాంక్షతో మొగదల మెఱుకనుమాత్ర మించుక వెలుఁగు చేసినది. మానసికముగాను, ఆధ్యాత్మికముగాను మఱింత మఱింత విరివియైన ఆత్మజ్ఞానమును బడయుటయు, మఱియు నీపరమసంసిద్ధిని లక్షించు స్వపరిజ్ఞానసహితమైన ఉద్యమమునందు మన మానవసత్త్వ నంతను సాకల్యమునఁ గైకొనుటయు, మఱియు ఆ ఉద్యమముయొక్క బల వేగములను మనసత్త్వయొక్క అన్నివిధములపై, వృత్తులపై ప్రయోగించుటయు భాగవతజీవితమును జేరుటకు మొదటి యావశ్యకము.

మన యాత్మజ్ఞానము లోలోనికిఁ బ్రసరించిన కొలఁదియు, దేనిని మన మిపుడు స్వాతిక్రమణమని నిరూపించుచున్నామో వాస్తవమున కది స్వసంభూతియే యని కనుఁగొందుము. స్వాతిక్రమణ మన, ఈ ప్రకృతి యొక్క యిప్పటి బాహ్యావిధానము నతిక్రమించుట; కాని మఱియును అది యొక ఆంతరవాస్తవముయొక్క,

రహోగత తత్త్వముయొక్క సంభూతి. ఆవాస్తవమే మన యథార్థసత్త; ఇప్పటి మనయునికి దానియందుండి మనము గైకొన్న ప్రారంభసామగ్రి, మఱియు మన స్వావిష్కృతి కేర్పడిన యొకరంగస్థలము. ఆ హేతువుచే, పశుధర్మమైన మన దిగువకడ యాత్మను మఱియు మనోధర్మమైన యిప్పటి యాత్మను అతిక్రమించుటయన, ఈ నిర్మాణములయందు చైతన్యముయొక్క స్వావిష్కారవిధానమున కేది సారభూతమో దాని నశింపఁజేయుటయు, ఉన్మూలించుటయు కాదు. వానిని వాని యావలి శక్తియొక్క ఉపకరణములను గావించియు, వాని క్రియావిధానములను ఆశక్తియొక్క కర్మక్రమములోని కెత్తియు, వానిసహజములగు ప్రయోజనములను అర్థములను ఆ శక్తియొక్క ఉత్తర ప్రయోజనముల లోనికిని అంతరార్థములలోనికిని అనువదించియు, వాని ప్రవృత్తియొక్క పద్ధతులను ఉద్దేశములను పూర్తిగా మార్చివైచుట. శరీరమున వర్తించు మనోమయసత్త యీ మనుష్యుఁడు. శారీరక జీవితముయొక్క తొలుతటి స్వాభిమానములచేతను, శక్తిసంకుచితికి హేతువులైన దానియొక్క నిలుకడ సుతారములచేతను అతఁడు మిగుల నడ్డగింపఁబడుచున్నాఁడు, వానికి చాల అధీనుఁడగు

చున్నాఁడు. తన మనోమయసత్త్వముయొక్క శక్తియందతనికి చాలినంత నమ్మకము చిక్కకుండుటయు, మనస్సుయొక్క ధర్మముల విషయమునను, సామర్థ్యముల విషయమునను చాలినంత జ్ఞానము కలుగకుండుటయు దీనికి హేతువు. ఏలన అతఁడు మనస్సుయొక్కయు తద్వర్తనముయొక్కయు ఇపుడున్నరూపును, అనఁగా జడపదార్థాంతరితమైన చైతన్యముయొక్క గతపరిణామప్రక్రియయందది యేరూపుపొందినదో ఆరూపునే మిక్కిలి యధికముగా చూచుచున్నాఁడు. వాని స్వధర్మమునందు వానిరూప మేమో, వానికి నివాసమైన శారీరక జీవితమును పూర్తిగా అధీనముచేసికొన్న పై అవి యేరూపు చేరఁగలవో ఆరూపును మిక్కిలి స్వల్పముగాఁ జూచుచున్నాఁడు. ఐనను ఈ కాఁగలరూపునందలి శక్తి నొకింత నతఁ డేదో చూడకపోలేదు; చూచి దానిని బడయుటకును విస్తరించుటకును ప్రయత్నించుచున్నాఁడు. కాని ఈ చూచుట ఆశక్తి తన ఉరవడిచే నెచట నెచట పైకడ బయల్పడినదో అట్టి తావులందు; కాని ఆ తావులందది యింకను శరీరప్రాణముల అధికారములను, అభినివేశములను, అభ్యంతరములను మన్నింపక తప్పదు. మనస్సులోపలనున్న విశాలశక్తులే అతని కింకను గుహ్యా

ములు, అద్భుతములు; మఱియు నివి చైతన్యవిజ్ఞానముల యందలి గుహ్యాతరములైనట్టియు, అద్భుతతరములైన ట్టియు శక్తులకడకుఁ గొంపోవును. మనస్సుయొక్క బహిర్గతములైయున్న ఉత్తమశక్తులేనియు — బుద్ధి, భావన, స్వవశిత్వమునుసాధించిన ఇచ్ఛాసంకల్పములు, రసవృత్తియొక్క వీక్షణము, ఇవన్నియును వాస్తవమునకు విజ్ఞానముయొక్క జ్యోతినుండి ప్రసరించి దారియందు వంపఁబడిన కిరణములు, విజ్ఞానముయొక్క జవములోనుండి వెడలిన బలములయొక్క మోటురూపములు. ఇవి మనస్సులోనికి దిగినవై, దాని నైజమును చేకొన్నవై, సశరీరమును ప్రాణవశమును అయిన మానసికతకుఁ జెందిన వ్యాపారములయొక్క శ్రుతికి తమ్ముఁ దాదింపి కొనినవై తమ సమగ్రకార్యము నాచరింపలేవు. కావున చైతన్యవిజ్ఞానముల స్వవ్యాపారమునకు మనస్సును తెఱచి వానికార్యముల కవరోధమును తొలగించుటయు, మనస్సునందలి వివిధప్రయోజనములను చైతన్య విజ్ఞానముల యందలి విపులతర సంగీతియొక్క స్వరములుగా మార్చుటయు దివ్యజీవితమును చేరుటకై వలసిన వేఱొక ఆవశ్యకము. భూమిపైన ఈమనుష్యుఁడు సశరీరమైన చైతన్యసత్తయు విజ్ఞానసత్తయు కావలయును.

ఆధ్యాత్మికతను సాధించుట అన్నింటికంటెను ముఖ్యమైనట్టియక్కఱ, ఏలన విజ్ఞానము లేక అతిమానసము ఉపకరణముమాత్రము. భౌతికపదార్థమందు సచేతనమై, తనబాహ్యానిర్మితియందు దింకను తన్ను దాఁ నెఱుఁగకున్నట్టి ఆత్మకును, దాని భౌతికజీవితమునకును మనస్సెట్లు విలక్షణమైన ఉపకరణమో, అట్లే సంపూర్ణమైన ఆత్మజ్ఞానముతో జగమునందు వర్తించు ఆత్మకు విజ్ఞానము విలక్షణమైన ఉపకరణము. మనోవిజ్ఞానములనఁబడు ఈచేతనాశక్తులు రెండును సత్తయందు భూమికపై భూమికగా నేర్పఱుపఁబడిన యునికియొక్క, లేక విశ్వబింబముయొక్క అధరోత్తర బింబార్థములకు, అనఁగా క్రమముగా అపరార్థమునకును, పరార్థమునకును జెందినవి. మనస్సు పరిచ్ఛేదకమును విభక్తమునైన క్రిందిచేతనకుఁ జెందినది; విజ్ఞానము అఖకలమును ఐక్యకారియునైన పై చేతనకుఁ జెందినది. మనము చేయవలసినది మన యునికియొక్క స్థాయినిమార్చుట, ఉనికియొక్క ఉత్తరగోళార్ధమున కధిరోహించుట, మన యథార్థమైన, అపరిచ్ఛిన్నమైన యునికిని ఇప్పటి మన ఆంశికమును, పరిచ్ఛిన్నమును, విసంవాదమయమునైన యునికినుండి వేఱుచేయు సరిహద్దు గీటును దాటుట.

ఈ దాటుటయే మన బాటయందు మహోఘటన; ఇఁక ముందు వాస్తవమైన స్వసంభూతి ప్రారంభించును; ఇంతటితో మన పరిణామమునందలి క్రిందిసాధన దశ యాగిపోవును. బంగరుమూతను తెలిచుటగా* ఉపనిషత్తు నందు చెప్పఁబడిన దిదియే; ఈ తెఱచుటచే విఁయు మహా త్తరజ్యోతియందు మన నిజమైనయాత్మను మనము చూచి తెలిసికొని, 'అతఁడే నేను', 'సోఽహం', అని పలుకఁ గలము. మఱియు నిది మనము మనయాత్మను స్వవశము నందుఁ గైకొనుట, ఆత్మయును బ్రహ్మమును అగుట, దివ్య స్వభావములోనికి మాఱిపోవుట. దీనికి మొదటఁ గావలసి నది ఆత్మజ్ఞానము, ఏలన ఆత్మజ్ఞానము లేనిది, ఆత్మసంభూతి యుండఁజాలదు. మఱియును, మనయందున్న ఉత్త మాత్మయే జగముయొక్కయు, సర్వసత్తయొక్కయు ఆత్మగావున, ఆత్మనెఱుఁగుటయే భగవంతునెఱుఁగుట, బ్రహ్మము నెఱుఁగుట, నిత్యమును సమస్తమును ఐన దాని నెఱుఁగుట. ఈ పై మార్పును నిర్వర్తించు ఐంద్ర జాలిక రహస్యమును మనోబుద్ధు లెఱుఁగవు; దానికొఱకు వీనికి పైనున్న యొకశక్తికడకుఁ బోవలయును. మన

* హిరణ్మయేన పాత్రేణ సత్యస్య అపిహితం ముఖం; తత్ త్వం పూషన్ అపావృణు " ఈశ.

యందలి అధ్యాత్మసత్తయే మన మానవసత్తను ఆధ్యాత్మికము చేయఁగలదు; మనయందలి భగవంతుఁడే భాగవతజీవితములోనికి మనల నెత్తఁగలఁడు.

కావున మనయందలి ఆత్మను, చైతన్యమును కనుఁగొనుటయే అన్నికనుఁగొనుటలలో పరమమైనది. మన మానవసత్త నీయుత్తమజ్యోతికిని, ఈ మహా పరివరనమునకును సంసిద్ధముచేయుటయే మన మానసికతయొక్క శ్రేష్ఠసాధనకెల్లకును ఏకప్రయోజనము, పరమమైన ఆంతర్యము; మన తత్త్వానుశీలనమునకు, మనమతమునకు, మన ధర్మకాంక్షకు, రసానుభూతికొఱకైన మన యాశంసకు, మఱియు మనస్సాత్కృతమైన ప్రాణభూమిక యందలి క్రియాసంకల్పమునకుఁ గూడ ఇదియే పూర్వనియతమైన సాఫల్యము. కాని దీనిని గనుటకివి మొదట తమ ఉత్తమములైన సామర్థ్యములను, రహఃప్రయోజనములను గ్రహింపవలయును. తత్త్వశాస్త్ర మాత్మయొక్కయు జగముయొక్కయు సమ్యగ్జ్ఞానమును బోధింపవలయును; కాని కేవలము దృశ్యమును మాత్రమే పరీక్షించు ప్రకృతిశాస్త్రము లందించెడు బాహ్యజ్ఞానములను గైకొని, అందుండి అనైకాంతికము లగు వ్యాప్యవ్యాపక సంబంధములను నిరూపించుటయే తన

పనిగా పెట్టుకొనునేని, లేక, బుద్ధియొక్క సామాన్య విభావనలను (Concepts) పరిశీలించి వాని నొక నిబంధనయందు కూర్చుటయే కర్తవ్యమనుకొనునేని, అది మనలను మనచుట్టును గీయబడియున్న గిఱిలోనుండి దాటింపఁజాలదు. ఈవిధమున నది ఆగిఱిని కొంత పూరింపవచ్చును, అందు మనకు కొంత ఎక్కువ సావకాశమును కల్పింపవచ్చును. దృశ్యజగమును గూర్చిన జ్ఞానము మన మనోదృష్టికిని బాహ్యజీవితమునకును అధికశక్తిని ప్రాపింపఁ జేయఁగలదు; కాని ఆత్మనుగుఱించినట్టియు భగవంతుని గుఱించినట్టియు జ్ఞానమే మనకు ముక్తిని కైవసము చేయఁగలదు. ప్రపంచమునకంటె గొప్పదయగు సత్యమును మొదట గ్రహించి, దానిని మన యనుభవమునకు నిజముచేసికొన్నఁగాని ప్రపంచమే యథార్థముగా ఎఱుఁగఁబడదు. తత్త్వశాస్త్రము మొదట నీదృశ్యజగతియొక్క హైతుకతను విచారింపవచ్చును; మనజ్ఞానమునందలి విషయివిషయముల పరస్పరసంబంధములను మొదట పరిశీలింపవచ్చును. కాని యిది బాహ్యమును, ప్రారంభదశలోనిదియు నగు క్రిందిపని—సత్త యొక్క అధరగోళార్ధమునకు, అవరార్ధమునకు మాత్రమే చెందిన జ్ఞానము. ఇంతకంటె అధికతరమైన ఆత్మ

జ్ఞానమును, లోనున్న యథార్థమైన ఆత్మయొక్కయు, విశ్వమునందును విశ్వమువెనుకను కల చైతన్యము యొక్కయు జ్ఞానమును అది అన్వేషించుట మొదలిడి నపుడే, దాని ఉత్తమమైన ప్రయోజనము ప్రారంభ మగును. మఱియు కడకు జీవితముయొక్క సర్వమైన ఉచ్చప్రయత్నమునకువలెనే, దానికిని కడ కదియే యథార్థప్రయోజనము. ఈ సందర్భమే మతమునకుఁ గూడ వర్తించును.

మతములందలి బాహ్యాంశ, జీవితమునందు ధర్మమును ఆస్తికతను నెలకొల్పఁ బ్రయత్నించునట్టిది, మన అవరసత్తయొక్క శిక్షావిధానమునకుఁ జెందనది. ఎప్పుడు మతము మానవుని సర్వసత్తను దైవముయొక్క దర్శనాన్వేషణములకై అంతర్ముఖము చేయునో, అవర మైన అతని యీమనోమయాత్మను పరమైన చైతన్య మయాత్మలోనికి మార్చుటకును, అతని దివ్యత్వము నభివ్యక్తము చేయుటకును అది మనుష్యుని ప్రేరించునో, అప్పుడు మతముయొక్క స్వాలక్ష్యము వెల్లడియగు చున్నది. మఱియు నీతియును సాధారణ మానవజీవిత మును హద్దుచేయు ఒకనియమముగా నున్నంతకాలము, దానియుద్దేశ్యము నెఱవేఱుటలేదు; కాని ఎప్పుడు

మనుష్యుని ఇప్పటి స్వభావమున కసాధారణమైన యొకా నొకవస్తువు నతనియందు సృష్టించెడు లక్ష్యము దాని యీ సాధారణ నియమ నిబంధనముల క్షుద్రతలోనుండి బయటపడునో, మనుష్యునందలి దివ్యత్వమును నిర్ముక్తము చేయుటయు, పశుమనోధర్మముల మిశ్రమై ప్రతినివిష్టమైయున్న అతనిస్వభావము నాదివ్యత్వమున కలవఱుచుటయు తనముఖ్యోద్దేశముగా ప్రసన్నోదార మైన దృష్టితో నెప్పుడు వీక్షించునో, అప్పుడు నీతి తనప్రయోజనమును నెఱవేర్చిన దగును. ఇంక రసాస్వాదనవృత్తియు శారీరకము, ఐంద్రియకము, మానసికము నైన సంతృప్తిఁబడసి చరితార్థ మగుటలేదు; సౌందర్యము నాధ్యాత్మికముగా నుపలబ్ధము చేసికొనుటయే రసానుభూతియొక్క పరమార్థము: మఱియు అట్టి ఆధ్యాత్మికోపలబ్ధియందు, క్రిందివిధమగు రసాస్వాదనము పైశ్రుతికెత్తఁబడినదై, పవిత్రితమై, తీవ్రతరమైన సంతృప్తికి హేతువగుచున్నది. ఇంక మనసత్త్వయందలి కార్యపర మైన ప్రాణభాగమునకును శరీరమునం దీ మనోఽధ్యక్షమైన సాధారణ వ్యాపారమును ప్రవర్తింపఁజేసి తృప్తిఁ గూర్చుటయే ఏకప్రయోజనముకాదు, ఉచ్చతరమైన అంతరజీవితమునకు వాహనమగుట దాని పరమప్రయో

జనము. ఇదంతయు సాధారణముగా గ్రహింపఁబడ కున్నది; ఏలన మన యీవివిధవ్యాపకములందు మెట్టుపై మెట్టు చందమున నున్న వైవిధ్యముల విచక్షణచేయక, ఆ అన్నిఁటిని మనము కలగలుపుగా గ్రహించుచున్నాము. ఈభేదముల ననుసరించియే యీ వ్యాసంగములయొక్క ప్రయోజనములందును తారతమ్యములు; ఇవియును స్వరగ్రామము చందమున ఉచ్చనీచస్థానములు కల వగుచున్నవి. కావున మనము సాధింపనున్నదానికి, మనము కాంగమకించుదానికి ఈప్రయోజనగ్రామము నందు ఉచ్చతమమైన దేదో అదియే శ్రుతి నొసఁగ వలయును. మనుష్యుని ఆధిక్యాతిశయ్యముల ననాదరించి సాధారణత్వమునే పూజించునట్టియు, కార్యికత్వ - ఉపయోగత్వముల నారాధించునటియు ఆధునికవిచారణ వలెఁగాక, ప్రాచీనవిచారణ మనుష్యప్రకృతియందలి యీ తారతమ్యముల యొక్కయు, మఱియు ఉత్తమా ధమ మధ్యమము లైన తన వివిధసామర్థ్యములమధ్య నది తూఁగాడుచుండుట యొక్కయు తాత్పర్యమును గ్రహించియుండెను. ఉత్తమమును గుర్తించి సర్వవిష యములందును దానిని లక్షించుటయు సాధించుటయు పూర్వదృష్టియందు, ప్రకృతి ఆత్మకు విధిగా భుక్త

మొనర్చవలసిన హక్కుగా గమనింపఁబడెను. మఱియు ప్రకృతియే మన మానసికవ్యాసంగముల యన్నింటి యొక్క అగ్రములనుండి ఒకే లక్ష్యమును నిర్దేశించు పెక్కు చూపుడువ్రేళ్లను పైకెత్తుచున్నది: ఈ లక్ష్యము దివ్యమును ఆధ్యాత్మికమునైన యొకానొకవస్తువు; ఇది మనము చూడఁగలట్టిది, ఎఱుఁగఁగలట్టిది, ఆనంద ముతో ననుభవింపఁగలట్టిది, మన మారాధింపఁగలట్టిది; ఇదియే యగుటకై మనము యత్నించుటకును, మఱియు నట్లె మనయెల్లయునికియందును దీనిని బ్రకటించుటకును వీలయినట్టిది.

ఈ మానసిక సాధనలవలన మనసత్తయొక్క మనోమయ ప్రాణమయాంశలందు పరసత్తయొక్కదీప్తిని కొంత ప్రతిబింబింపఁ జేసినచో చేయవచ్చును. కాని దానిలోఁ నెదుగుటకు మనము చేయవలసిన దంతకంటె నధికము — మన చేతనయొక్క స్వభావము నంతను మార్చివేయవలయును. పరిచ్ఛేదకమగు నహంత నాశ్ర యించిన వ్యష్టియగు మనుష్యుఁడు సమష్ట్యాత్మకమైన వ్యష్టిగా మాఱుట దీనికి మొదటియావశ్యకము. ఏలన మన యిప్పటి యీ స్థాయియందు వ్యక్తి స్వకేంద్రము నందు తనకై తానుజీవించుచున్నాఁడు, భగవంతునుండి

విడిపడియున్నాఁడు, తన 'అహము'కంటె అన్యమైన సర్వమునుండియు చీలియున్నాఁడు, పరిచ్ఛేదక మగు నహంత నాశ్రయించిన అనుభూతి హేతువుచే సమష్టి నుండి పృథక్కరింపఁబడియున్నాఁడు. ఇదియే అజ్ఞానము యొక్క మిక్కిలి బిగుతుముడి. కాని అధ్యాత్మసత్త యందు విశ్వాతీత-సమస్త-వ్యస్తములు ఐక్యచేతన యొక్క యానందము ననుభవించును; దానిలోని కెదుగుటయన్న మన పృథక్త్వముయొక్క అనుభూతిని వీడి, ఇతరులతోడను సమష్టితోడను దివ్యసత్తతోడను ఐక్యము ననుభవించుట. మన ప్రయత్నముఁ దన్నింటను ఇదియే సారవిషయముగా స్ఫుటముగానో అస్ఫుటముగానో గుర్తింపఁబడుచున్నది. ప్రేమచేఁగాని అన్యమార్గమునఁగాని, భగవంతునకును మానవునకును దగ్గఱ యగుటయే మతములయొక్క లక్ష్యము; జ్ఞానము పురుషభేదముచే భేదింపనిదానిని—అనఁగా పురుషతంత్రము కానిదానిని గావించి, తద్ద్వారమున వ్యష్టికల్పితములైన వికారములచే స్పృశింపఁబడని సార్వత్రిక సత్యమును సాధించుట తత్త్వశాస్త్రమునకును ప్రకృతిశాస్త్రములకును లక్ష్యము; విశ్వవ్యాప్తమైన సౌందర్యము ననుభవించి యావిష్కరించుట శిల్పము

యొక్క మూలధర్మము; పరార్థముకొఱకు స్వార్థ త్యాగ మొనర్చుట ధర్మచేష్టయొక్క ఉత్తమ ప్రయత్నము; మానుష్యకము కొఱకు జీవించుట సంఘ జీవనముయొక్క విపులతమమైన యాదర్శము. మన మానసికతయొక్క యిప్పటి మట్టముపై మనము కట్టుపడి యున్నంతకాలము, ఇవన్నియు చాల సాపేక్షికముగా మాత్రము సాధింపఁబడఁగలవు. మన సత్తయందలి సమష్టివృత్తియొక్క నిజమైన నిజమును మన మెప్పుడు చేరఁగలమన్న, మనయునికి చిదాత్మ యొక్క విశ్వచేతనలోనికిఁ బెరిగినప్పుడు. ఇపుడు మనము క్లేశపూర్వకముగా యత్నించి స్వల్పముగా, ఆభాసగా, మొదటిమెట్టుగా సాధించెడు నిదంతయు ఆచేతనయందు సహజస్థితియు, సహజవృత్తియు, వాస్తవమును శక్తి నీనెడు వస్తువును అగును. కావున, ప్రాచీనవిజ్ఞానము విస్పష్టముగా లక్షించినవిధమున, సర్వముతో ఏకాత్మ యగుట ప్రథమలక్ష్యము; కాని ఆత్మయొక్క ఈవిశ్వ చేతన విశ్వమునందు తన్నుఁ దానభివ్యక్తము చేసికొను భగవంతునియొక్క ఒకానొక యచ్చుమాత్రము. వ్యక్తి భేదమును తొలఁగించుటచే చేతనయందు సర్వాత్మ భావమును బడయుటయేగాక, సక్రియమైన ఐక్యాను

భూతియందును సర్వముతో నేకాత్మ కావలయును. ఇది యెట్లు సాధ్యమగు నన్న, ఈ ఐకాత్మ్యమును, మన సామర్థ్యముయొక్క పరమపరిమితివఱకును, భగవంతుని తోడి ఐకాత్మ్యముగా పరిణమింపఁజేయుటవలన. సర్వ భూతుఁడును భగవద్భూతుఁడును ఐన వ్యక్తిద్వారమునఁ బ్రవర్తించు భగవచ్ఛక్తియందు జీవించుటయే, భాగవత జీవితమునం దారోహింపఁదగిన ఉత్తమశిఖరము.

తన అత్యున్నతమైన ఉన్నతస్థితియందు, తనకు సామాన్యమును సహజమునైన స్థాయినివీడి ఒక అసామాన్యమైన మానసికతలోనికి మన స్సారోహించి నపుడు, ఆధ్యాత్మికమగు విశ్వచేతనయొక్క యనుభూతి నది పడయఁగలదు. కాని ఈ పడయుట వైవశ్యావహమై మనస్సునందు పడునట్టి ఒకచైతన్య ప్రతిఫలనము; లేదేని, మనస్సు చిదాత్మయందు తన్నుఁ దాఁ గోల్పోవుట, జ్యోతియందు గ్రస్తమైపోవుట, పురుషావిశేషతయందును, సమష్టిత్వమునందును మునిఁగిపోవుట. నిష్క్రియమైన ఆధ్యాత్మికత కిది చాలినది కావచ్చును; సక్రియమైన ఆధ్యాత్మికత అన్యాయముగా ఇందు ప్రాపింపఁబడదు. సక్రియముగా సర్వముతో ఏకాత్మయగుట యన, సర్వముతో క్రియయందును

ఒకయెడఁద, ఒకమతి, ఒకయొడలును అగుట; అనఁగా అధ్యాత్మయొక్క సమష్టిమానసమునందును, సమష్టి ప్రాణమునందును, సమష్టిభౌతికసత్తయందును ప్రసరించి జీవించుట; కాని యిది మనస్సునందలి చైతన్యమున కెప్పుడును పూర్ణముగా సాధ్యము గాదు, ఏలన భేదము నాశ్రయించి వ్యవహరించుటయే మనస్సుయొక్క లక్షణము; దాని చర్యలందును, సంబంధములందును అది ఆవరణముల మీఁదుగా, ఒకానొక స్పర్శచేవలె, చాచిన చేతుల నందుకొనుటచేవలె, అన్యమును కలిసికొనును. ఇది ఆవరణములనుగూల్చి సతతమైన ఐక్యమునందు జీవించుట కాదు. తన ఐక్యమునందు, విశ్వమును జూచు తన అఖండవీక్షణమునందు, చైతన్యముయొక్క సహజమైన వృత్తి అతిమానసము; మానసవృత్తి, ఎంత గొప్పగాఁ జూచినను, అప్రాథమికము, జన్యము. ఈ అప్రాథమికము నందుండి ప్రాథమికము లోనికి, మానసికచేతనలోనుండి విజ్ఞానచేతనలోనికి చేరుట ఆరోహణమునందలి ముందు యత్నము. కాని ఈయత్నము సఫల మగుటకు మనస్సు కొంతవఱకైనను ఆధ్యాత్మికతయందు స్థిరపడియుండవలయును. అంతవఱకును సాధ్యమైనది భాగవతజీవితమునందలి యొకమాదిరి

ప్రారంభదశ, అధ్యాత్మభావముచే భావితమగుచున్న మనసుతో ప్రవర్తించుట. ఈదశయందు మానసిక భౌతికావరణములమీఁదుగా మనసుతో మనసు, ప్రాణముతో ప్రాణము కలియుట తఱుచై, సులభమును శీఘ్రమునై, సతతమై, కడకు సహజమగును. అంతట మనయునికి చాల స్వల్ప మొనర్పఁబడిన భేదముపై, యించుక వికల్పముగల ఐక్యముపై ఆకారింపఁబడ వచ్చును. ఇట్టి గాఢతరమగు జీవితములోనుండి యింకను పైకిఁ జని, మన చేతనయొక్క సామర్థ్యములను, అభ్యాసములను చైతన్యమునందలి అతిమానసికశక్తుల యొక్క ప్రతిఫలనములఁగా, నిమ్నవృత్తులఁగా మార్చుట యింకొకమెట్టు. మనయం దిట్టి ప్రతిఫలనము కొంత యిదివఱకే కలదు: కాని యిది క్వాచిత్కము, ఆంశికము, అనియతము. అధికపరిణతి గల మనుష్యులందది అధికమైన వెలుఁగుతో స్ఫురించినను, సాధారణ మానసికతయం దది విక్షిప్తమును, అశిక్షితమును, అవరుద్ధమును, మిశ్రితమునై చూపట్టుచున్నది. దానిని విశుద్ధమును, నిశితమును చేయనగును; మఱియు కడకు దానినే మన బుద్ధి - సంకల్ప - రసగ్రహణ - సంవేదనలయొక్క సహజవృత్తి యగునట్లు సాధింపవచ్చును.

ఈకష్టసాధ్యమైన అవాప్తికిఁగూడ ఆవలనైయున్న మెట్టు మన పరిధినిదాటి పూర్తిగాఁ బైకిఁజేరుట, విజ్ఞాన ముప కరణముగాఁగల చిత్సత్తలోనికి మనయునికిని సునిశ్చిత ముగా మార్చివైచుట.

ఉనికియొక్క అవరార్ధమునందు, అనఁగా మనః ప్రాణశరీరములయందు, విజ్ఞానశక్తియొక్క ప్రతిఫలన మునకు, లేక ప్రతినిధియైన వృత్తికి స్వతోభాస లేక స్వతఃస్ఫురణ యని (Intuition) పేరిడుచున్నాము. కాని ఈస్వతఃస్ఫురణయందు పెక్కు లంతరువులు. జడ ద్రవ్యమునకు సహజమైన యొక భౌతికస్ఫురణ గలదు; మఱియు ప్రాణికమైన స్ఫురణ, అట్లే హృదయికమగు స్ఫురణ, ఐంద్రియకమగు స్ఫురణ, ఆఱవ ఇంద్రియమై ప్రవర్తిల్లు మనస్సునకుఁజెందిన స్ఫురణ. మఱియును బుద్ధియందలి స్ఫురణ. ఇఁక నీబుద్ధి స్ఫురణయందు ధర్మ గ్రహణకును, రసానుభవమునకును, ఇచ్ఛా క్రియాశక్తు లకును, ప్రత్యేకముగాఁజెందిన భేదములు; కాని ఇవ న్నియు తమ యవకాశమునం దణఁగినవై ప్రవర్తించును. మఱియు ఈస్ఫురణయొక్క అతిబౌద్ధమైన శక్తియు నొకటి గలదు; కొంత సాధారణములైన పైఁ దెలిపిన స్ఫురణభేదములకంటె ఇది చాలయరుదు, విజ్ఞానవ్యాప

రముయొక్క స్వాలక్షణికమైన, సహజమైన మార్గమున
కిది చాలదాపు; కాని యిది యింకను మనస్సుయొక్క
బంధనములలో నిలిచియున్నది, మఱియును ఒకవిధ
ముగా, లేక చాలవఱకు, మనోవృత్తియొక్క పై సరి
హద్దుక్రింద హద్దుపడుచున్నది. మానసికమైన మనుష్య
ధర్మముతో మనుష్యుఁడు చేరఁగల ఉత్తమ మిది; ఇది
యతని మనోమయ సత్తయొక్క ఉన్నతతమమైనశక్తి;
ఈ అసామాన్య శక్తి నతఁడీ ఐహికజీవితమునకు సహజ
మైనదానినిగా పరిణమింపఁజేయవచ్చును. కాని కేవ
లము స్వాధికారమునందు ప్రవర్తించువిజ్ఞానము, దాని
సామర్థ్యములనుగూడ స్వతఃస్ఫురణ (intuition), శ్రుతి
(inspiration), దృష్టి (revelation) యని మనో
భూమికలోని వాని యనుకరణములయొక్క పేరుల
చేతనే తెలిపినను, మిక్కిలి భిన్నమైనది; అది విజాతీయ
మైన విధమున స్వతఃప్రవృత్తము, నిరంకుశము; తన
ప్రకాశముచేతనే తనయాజ్ఞ నది యన్నిఁటిపై మోపును.
దాని ప్రశాంతమైన అధిరాజత్వము కారణముగా స్వార్థ
సిద్ధి దానికి స్వగతమైయున్నది. అది దైవవిభూతి, మఱియు
దివ్యమైన ద్రష్టృత్వము. స్వవశిత్వమే కాక, అదియున్న
పరిసరముపై ఈశిత్వమును విజ్ఞానమునకుఁ గలదు;

అనఁగా అందు స్వరాట్త్వ సంరాట్త్వములు.

మనస్సుయొక్క పరమోచ్చదశను జేరుటకైనను, లేక మనస్సుయొక్క సరిహద్దునేదాటి ఆవలకుఁ జేర వలె నన్నను, మన యిప్పటి పరిచ్ఛిన్నమైన సత్తను గడచిపోవలయును. ఇది ఒక నూతనమైన ఆవిర్భావము ద్వారమునను ఒక పరివర్తనము ద్వారమునను ఘటించును. ప్రకృతియొక్క ఆరోహణక్రమమునం దెల్లెడను ఇదియే నియమము. జడద్రవ్యమునుండి జీవమున కధిరోహించుటకు విధానము ధాతుగతమైన ప్రాణశక్తియొక్క నూతనావిర్భావముద్వారమున; ఈ నూతన శక్తి జడపదార్థమునందలి మొఅకైన వృత్తి ప్రతివృత్తులను గైకొని వానిలక్ష్యమున కౌన్నత్యము కల్పించి, వానివ్యాపారము నతిశయిత మొనర్చుచున్నది. మనస్సున కధఃస్థితమైన ప్రాణమునుండి జంతువుయొక్క ప్రాణమున కధిరోహించువిధానము ఐంద్రియక మానసముయొక్క ఆవిర్భావముద్వారమున; పరిణామావిష్కృతములయిన ఈ క్రొత్తశక్తియు వెలుఁగును ఉద్భిజ్జస్తరమునందు ధాతుబద్ధమైయున్న ప్రాణమును జేకొని, దాని లక్ష్యమున కౌన్నత్యము కల్పించి, దాని వ్యాపారముల కతిశయాతిరేకములను గూర్చుచున్నవి. జంతువు-మనసు

నుండి నరునిమనసున కధిరోహించువిధానము, స్వనియా మకమును స్వసంవేదకమును అయిన బుద్ధియొక్క ఆవి ర్భావముద్వారమున; ఈ స్వసాక్షికమైన క్రొత్తచేతన యందలి వెలుఁగుచే పశువునందలి మొఱటుబుద్ధియు, మఱియు నైసర్గికమును (instinctive), ప్రాణికమును, ఐంద్రియకమును అగు విచారణయుఁ గైకొనఁబడి, క్రొత్త విలువ కెక్కింపఁబడి తమ వ్యాపారము నం దాతి శయ్యమును బడయుచున్నవి. మానసికమైన మాను ష్యకమునుండి విజ్ఞానమయమైన మానుష్యకమున కధి రోహింపఁ గనుట, సంపూర్ణముగా స్వసంవేదకమును, సమష్టీకృతమును, అఖండమును, స్వప్రకాశముచే గ్రహించునట్టిదియు నగు ఒకనూత్న చేతనయొక్క ఆవి ర్భావముద్వారమున ; దీనియందు బుద్ధి, ఇచ్ఛ, రసాను భూతి, హృదయము, ఇంద్రియము, మనోమయము గావింపఁబడిన ప్రాణము, వీనిశక్తులన్నియును గ్రహింపఁ బడి క్రొత్తవిలువల కెచ్చింపఁబడినవగును ; మఱియు వీని చేష్టయు శ్రేష్ఠములును ప్రకాశాత్మకములును అగు క్రియావిధానముల రాకచే క్రొత్తవిధమున అతిశయించిన దగును. మఱియు తమ పరిణతి యందీ విధానములు, పశువిచారణకన్న బుద్ధి యెంత అధికమో బుద్ధికంటె

నిస్సందిగ్ధముగా నంత యధికములై కాన్పింపఁగలవు. ఈ పరివర్తనమునందు, సారభూతమయిన దేదియును విసర్జింపఁబడదు; కాని నూతన సామర్థ్యముల మేలు చందములందు నిర్వహింపఁబడుటచే ఏ క్రిందివ్యాపారముల అక్కఱ తీఱునో అవిమాత్రము విడువఁబడును. ఈ పరివర్తనము అతిమానవత్వమునందు మానవుని ఆత్మసంసిద్ధి, మఱియు మనుజుని మనుష్యత్వమునందు సూచనగానున్న సర్వముయొక్కయు వికాసము.

కాని ఇట్టిమార్పు ఈ క్రిందసత్తపై ఒత్తిడిచేయు ఊర్ధ్వతరాత్మయొక్క పరివర్తకశక్తిచేఁ గాని ఘటింపదు; విచ్చుకొనెడి మనస్సునందలి ప్రకృతియొక్క ఊర్ధ్వకాంక్షచే, తీవ్రాశంసచే నీశక్తి ఆహ్వానింపఁ బడవలయును. భౌతికముగా, పశువుయొక్కరూపము క్రింది ప్రాణుల రూపమునుండి పరిణామక్రమమున వెలువడి యుండవచ్చును, ఉండకపోవచ్చును; అట్లే మనుష్యుని శరీరప్రాణములు జంతువుయొక్క శరీరప్రాణముల యందుండి వెలువడి యుండవచ్చును, ఉండకపోవచ్చును; కాని ఒకానొక పై భూమికకుఁ జెందిన నూతనాత్మ వానిపరిణామమున సాయపడుటకై క్రింది కొరఁగకుండెనేని, అవతరింపకుండెనేని, వానియందభివ్యక్తము

కాకుండెనేని, ఆశరీర ప్రాణము లింకను పశుబుద్ధికే నివాస మయ్యెడివి కాని, మనుష్యబుద్ధికి నివాసమయ్యెడివి కావు. కాని యింకముందటి పరిణామమునందు నాయపడవల సినది, విజ్ఞానబింబమునందున్న యాత్మ. అది భగవ దాత్మయే. కావున మనుష్యుని ఉత్క్రాంతికడకు భగవ త్సత్తయే యొరగినంగాని యీ మహాపరివర్తనము సాధింపఁ బడదు. ఏలన, మనుజునందు విజ్ఞానముయొక్క అభివ్యక్తి యన, స్వాలక్షణికములైన శక్తులలో దివ్యమగు నాత్మ యావిర్భవించుటయే యగును. ఆశక్తులు దివ్యమైన జ్ఞానము, దివ్యసంకల్పము, దివ్యమైనస్వభావశుద్ధి, దివ్య మగు నానందము, ప్రేమమయమును ఐక్యమయమును అయిన దివ్యహృదయము. మఱియును కడపటకు (ఏలన సిద్ధియం దిది కడపటిది) అధస్తమములైన ప్రాణ భౌతిక ములును ఉత్తమసత్తను వహించుకోశములుగా రూపాం తరము చెందవలయును. కాని మనము మాత్రమే భగవంతునియందుండి భగవత్సత్త మనయందు లేదేని, అతని ఆనంత్యమునందు ఒక ప్రత్యేకమైన అంతవంత మైన అంశమాత్రమే మన మగుదుమేని, లేక అంతర్వ్యాపి యైన భగవంతు నెఱుఁగుట మన కసాధ్యమగునేని, ఈ పరివర్తనముఁగూర్చి భావించుటకుఁగూడ నవసరము

కలుగదు. కాని మనుష్య సత్త్వయందలి ప్రకృతి యెంత శ్రమించి యేని తనలోని దైవము నెఱుఁగుచున్నది. కావున మనుష్యుని ఆత్యంతికమైన అంతిమనియతి యని యన కున్నను ఈపరివర్తనము, కాలముయొక్క విశాలవిభాగముల దృష్టియందు, అతని ఆసన్నమైన అంతిమ నియతి. ఇదిసైతము అతని నియతియందున్న ఆరోహణమున కేవలము తరువాతి సోపానపంక్తియొక్క యగ్రమును జేరుటకుమాత్రమే తరువాతి మెట్టయి యుండును.

# శ్రీ అరవింద దర్శనము

---

## సమాప్తి

మనుష్యునందు నెలకొల్పఁబడియున్న అధ్యాత్మ భావనిష్ఠయు ఊర్ధ్వముఖమైన యాశంసయు, ప్రపంచమునందలి విపర్యయములచేతను, జడవాదినియగు బుద్ధియొక్క శంకలచేతను, ప్రతిషేధములచేతను మాటిమాటికి మార్కొనఁబడియును, అతనియం దవి యొక రహఃసాక్షిచే సతతమును ధ్రువ మొనర్పఁబడినవై, ఈ మర్త్యమానవము యొక్క సంజవెలుఁగునందు అంతర్హితమై వేచియున్న భగవంతుఁడు, ముక్తి, జ్యోతి, అమృతత్వము అనువాని యుపలబ్ధిని సాధించుటయే తమ లక్ష్యముగాఁ గైకొనియున్నవి. ఈ లక్షించుటకుఁ గల మూలమును సమర్థనమును దెలిసికొనుకొఱకు సత్తను పరిశీలింపఁగా, ఈతీరును తాత్పర్యమును కలదై

ఆలక్ష్యము తోఁచుచున్నది: మనుష్యుఁడు తాను మర్త్యదేహమునం దభివ్యక్తుఁడై యున్నను, చైతన్యము యొక్క అమృతత్వమునందు వర్తింపనేర్చుట, అంత వంతమునందలి యీసంభూతియను సతతారోహిణియైన సంగీతియం దుచ్చరింపఁబడు దివ్యసత్తయొక్క చిన్మయ మైన ఆనంత్యమునందు వర్తింపనేర్చుట, మఱియు రూపాంతరీకృతమైన మనుష్యత్వము యొక్క ఆకార ముతో దివ్యప్రకృతియొక్కయు మఱియు నందలి జ్యోతిః - శక్తి - ఐక్య - ఆనందములయొక్కయు పూర్తియందు వర్తింపనేర్చుట. మృణ్మయము గావింపఁబడిన సత్తలో నుండి చిన్మయసత్తలోనికి, మనోమయత్వమునం దుండి విజ్ఞానమయత్వములోనికి పరివర్తనము సాధించుటయే మానవపరిణామమునకు కిరీటము.

ఇదంతయు మనకు వెలయైన మన స్వభావమున కత్యంత విరుద్ధమైనదై యుండెనేని, భౌతికబుద్ధి యూహించునట్లు, ఈ రూపాంతరసాధన మన కసాధ్యమే కావలయును. లేక మఱియును భగవంతుఁడు సర్వమై మనుష్యు డేమియును గాకుండెనేని, అనంతమును అంతవంతమును రెండు వ్యతిరేకములేని, ఈజ్యోతి మర్త్యులమైన మన అజ్ఞానముయొక్క ప్రసారమున కందని ఆవలివస్తు

వేని, మోక్షము స్వవిలయముచేఁగాని సాధింపఁబడ దేని, అమృతత్వమన మానవవ్యష్టి అనిర్దేశ్యమునందు రూపఱుటయేని, పైని తెలిపిన రూపాంతరోపలబ్ధియొక్క ఆశ యెన్నఁడును నెఱవేఱదు, జీవితమునకు దివ్యమగు సంసిద్ధి యెన్నఁడును ఘటింపఁజాలదు. ఒకపక్షమున భౌతికవాది * యొక్కయు, అన్యపక్షమున హేయవాది యొక్కయు జీవిత నిరాకరణ న్యాయ్య మగును. కాని మనము నిరంతరమును కాంక్షించుచున్నది మనలోని వాస్తవముకొఱకు; ఇది మన మనుష్యత్వముచే కప్పఁబడి మాఱురూపైనది, కాని ఎల్లప్పుడును మనుష్యత్వము దానిని గర్భావస్థయందుఁ దాల్చియే యున్నది, తనప్రకృతియొక్క ప్రవృత్తివలననే తనలోపల దాగియున్న యీరహోవస్తువు నది ప్రసవించి తీరవలయును. ఈపరిణామము మనయునికికంటె నాత్యంతికముగా భిన్నమైన యునికిలోని కెగురుట గాదు; ఇది స్వోపలబ్ధి, స్వసంభూతి. దానిని జేరుటకై మన మతిక్రమింపవలసినది చాల కలదు, మన స్వనిర్మితియొక్క రూపమును చాల మార్పవలయును; కాని మనయునికికి మూలమైన

---

* జగత్తత్త్వము భౌతిక మనుట భౌతికవాదము, జగము హేయ మనుట హేయవాదము.

దేదియు మనము నిరాకరింప వలవదు, నశింపఁజేయఁ బనిలేదు, ఆర్పివేయ నక్కఱలేదు. ఏలన మన యిప్పటి యునికియందలి సకలాంశములును, వీని యాకారము ల సమగ్రములును, ఒకప్పుడు వికటములును, అనుక్షణము మాఱునవియును, మరణశీలములును ఐయున్నను, తమలోనివస్తువును మనము కానున్న యునికియొక్క నిర్మితికై ఉపాదానముగా నీయవలయును. మన మిది వఱకు ఆవిష్కరించియున్న దానియందే మన మిఁక నావిష్కరింపవలసినట్టిది నిహితమై యున్నది; మన జీవులు దేని శాశ్వతమైన అభివ్యక్తియో అట్టి దివ్య చైతన్యము తొలుతటి నుండియు సర్వసత్తయొక్క పునాదియందును నిలిచియున్నది ; మనచేతన స్వశిఖర ములకేసి తన్నుద్ధరించుకొన్న కొలఁదియు, ఆ దివ్య చైతన్యము క్రమక్రమముగా బహిర్గత మగుచున్నది. మనము కాంక్షించెడు రూపాంతర పరిణతి హఠాద్భా వియు విరోధాభాసయు నైన ఒక అద్భుతము గాదు, అది మన ప్రకృతియం దంతర్గతమైయున్న సహజ ధర్మము, ఏ రేఖ నీ ప్రకృతి యనుసరించుచున్నదో ఆ రేఖయారోహణమునం దనివార్యమైయున్న ఉచ్చ స్థానము. ఏది మర్త్యజీవితముగా మనకుఁ దోచు

చున్నదో అది స్వస్వభావముచేతనే భగవంతునికేసి, అమృతత్వమునకేసి స్వవహిత మగుచున్నది, స్వప్రేరిత మగుచున్నది. అజ్ఞానము మాత్రమే, ఆత్మజ్ఞానము యొక్క సంవృతియే, మన మానసమునకీవిషయమును మఱుఁగుపఱచుచున్నది.

భగవంతుఁడే సర్వమును; కాని ఆ హేతువుచే మనుష్యుఁడు శూన్యము కాదు. ఆ హేతువుచేతనే మనుష్యత్వ ధర్మమునం దున్న యీజీవి దివ్యధాతు మయుఁడు; దివ్యప్రకృతి అతనియందు నిలీనమై యున్నది. ఏకమే కేవల మున్నదగునేని, దానినిబట్టి సర్వమును లేనిదనరాదు, బహుత్వమునందలి అన్నియును ఏక మనవలయును. బహుత్వమునందలి ప్రతివాఁడును తనయునికియందు రహఃస్థితమై, శాశ్వతమై యున్న సత్యముయొక్క జ్ఞానోపలబ్ధులను బడయఁగలఁడనవలయును. జడపదార్థము తనతొలిరూపునం దొక ఛద్మవేషము: కాని దానియందు నిత్యచేతన; దాని రూపుల కన్నింటికిని అదియే ఆధారమై వానిని తన బలిమిచే కట్టడచేయుచున్నది. జడద్రవ్యము తన అచిత్తియందును చైతన్యముయొక్క ఘనీభూతశరీరము. ప్రాణమిప్పటి తనరూపునందు పదిల మెఱుఁగని బ్రదుకునకై

పెనఁగులాటగా పోరాటగాఁ దోఁచుచున్నది; కాని యీ పెనఁగులాటయందు నిత్యసత్తయొక్క శక్తి కలదు; పోరాటమును పెనఁకువయును స్వసంవేదనమునకేసి నడచెడు సతతచలనము; ఏ స్వసంవేదిమైన ఐక్యము తన్నుఁ దా నన్వేషించుకొనుటయొక్క బహిఃస్పంద మీప్రాణమో, ఆ ఐక్యమును ప్రసవించుటకైన వేదనయే ఈ పోరాటమును, పెనఁగులాటయును. జ్ఞానమునకై ప్రయత్నించు అజ్ఞానముగా మనసు మనకుఁ దోఁచుచున్నది, మఱియు ఆ జ్ఞానము దానికి ధ్రువముగాఁగాని, అవ్యవహితముగాఁగాని, అద్వారకముగాఁగాని స్వాయత్త మగుటలేదు; కాని ప్రాణ మే స్వసంవేదనకొఱకైన పూనికయో, ఆ స్వసంవేదనలోనికి మేల్కొన యత్నించుటయే ఈ యజ్ఞానముయొక్క స్వభావము. ఈ తోఁచునది మనసుయొక్క మొదటిదశ మాత్రము, దీనిని దాటి యది పెరుగవలయును, దీని నతిక్రమింపవలయును. కాని ఈ యతిక్రమణము మనసు దేనికొఱకై ప్రయత్నించుచున్నదో దానినంతయును నిష్పన్న మొనర్చుకొఱకుఁ గాని, విపన్నము చేయుకొఱకుఁ గాదు. ఈ పరివర్తనమునకు మనుష్యుఁ డుపకరణము, క్షేత్రము. ఈ పరివర్తనద్వారమున, మనసు దేని దీప్తియొక్క భగ్న

భగ్నప్రసారమో, ఆ విజ్ఞానసత్త నది కనుఁగోఁగలదు; మఱియు ఏశక్తియొక్క బహిశ్చలన మీప్రాణమో, ఆశక్తిని బందివిడిపించి స్వతంత్ర మొనర్పఁగలదు; మఱియు వేఱొక మహత్తరమైన దృష్టితో, వేఱొక విపులతరమైన యునికితో, ఈ జడపదార్థమేని దేని పరిణామశీలమైన శరీరమో అట్టిచైతన్యము నుపలబ్ధముచేసికొనఁగలదు. ఏది తనక్రమసంభూతియందు తనలోన పెరుగుచున్నదో అట్టి దేవత్వములోని కెదుఁగుట మనుష్యుని నిర్దిష్టనియతి.

జ్యోతి - జ్ఞానము - అతిమనస్కమైన విజ్ఞానము, ఈశక్తియే ఈపరివర్తనమును సాధింపఁగలదు. ఈజ్యోతియొక్క జవమే ప్రప్రథమమైన మౌలికమైన దివ్యశక్తి, మఱియు దివ్యసంగీతియొక్క క్రమప్రస్తారము. ఈజ్యోతి వేఱొక జగమునకు, వేఱొకభూమికకుమాత్రమే చెందునట్టిది కాదు; భౌతిక ప్రకృతియొక్క జడిమయందును, మనస్సుయొక్క అజ్ఞానమందును అది గుప్తమై కలదు. దీనిచేతనే విశ్వసత్త అణువుయొక్క స్పందము కడనుండి దేవతలయొక్క ప్రవృత్తివఱకును గల సకలవిషయమందును ఉనికియొక్క వ్యవస్థలను నిలిపి నెఱపుచున్నది. అన్నింటియందున్న ఏ స్వసంవేదియు స్వప్రతిష్ఠితమునైన

సత్త సతతమును తనయందుండి తన్నుఁదా నావిష్కరించుకొనుచున్నదో, మఱియు తన సత్తాశక్తియొక్క సత్యమునందలి స్వనిర్వాహకమైన భావము ననుసరించి సర్వమును నియమించుచున్నదో అట్టి సత్తయొక్క ఆత్మజ్ఞానమే ఈ జ్యోతి. భౌతిక ప్రకృతియం దిది తన కెఱుక లేని ఉద్దేశములకొఱకు తడవులాడునట్టియు, నిశ్చేతనమును, జడవృత్తికమునై తోఁచునట్టియు నొక వేగము ద్వారమున ప్రవర్తించుచున్నది; కాని ఆ వేగముయొక్క స్వ-వ్యాహనముల లేక స్వ-విన్యాసముల యంతరమున, స్వనిర్మిత పరిమితియందు వ్యవహరించు అనంత చిత్సత్తయందలి ఈజ్యోతి లేక వాస్తవ-భావము*యొక్క అమోఘమును అప్రామాదికమును ఐననిర్బంధము లేక యొత్తిడి కలదు. మనస్సునందు దీనికిరణములు పైకుబికి వెలిగహనమును కొంత వెలిఁగించి, దాని వ్యాపార విధానములయొక్క శక్తిని, మేరను విరివిచేయుచున్నవి; కాని యీ కిరణములు విడివిడిమై పైపైనిమాత్రముండుట చేతను, మఱియు ఇంకను పరిమితమైన, అందువలననే విభక్తమైన వృత్తితో, మఱియు నొకానొక విక్షిప్తతయు ఒకానొక ఏకాగ్రతయుఁగల గతితో వర్తించుచుండుట

* Real-Idea ౨౬ పుట చూచునది.

చేతను, అవి మనసుయొక్క అజ్ఞాన మెచట విజ్ఞానము యొక్క వెలుఁగగునో అచటి ఐక్యజ్యోతియందు సంమిళితము లగుటలేదు. ఈ తెలిపిన పరివర్తనయొక్క మార్గము ఒక యఖండమైన వృత్తిలోనికిని దీప్తిలోనికిని వానిని వ్యూహముచేసి సమూహము చేయుట; ఏలన మనసుయొక్క సకలవృత్తియు, ఎంతఖండమయ్యును, ఎంతసూటి తొలఁగినను, ఎంతవికృతమయ్యును, మఱియు ఎంత భ్రమప్రమాద జనకమయ్యును, సత్ - జ్యోతి యొక్క సత్యమునులో నిడుకొనియేయున్నది; అన్యూన మైన ఉత్తమ పరివర్తనముచే ఇయ్యది దాపురమునందుండి విమోచింపఁబడును. మఱియు ఇచటి సకలమును అన్యోన్యభాసితమై అచటి అధ్యాత్మ సామంజస్యము నందు చెలిమిగొనును. జ్ఞాన మచట తనయంతః కలహములనుండి విముక్తమగును; మఱియు, తనకును సంకల్పమునకును గల వైషమ్యమునుండియు బయటపడును. అట్లే సంకల్పమును కోరికలయొక్కయు, హృదయవేగములయొక్కయు, ప్రాణరభసములయొక్కయు సంగ్రామ రంగమునువీడి పైకేగును. జ్ఞానసంకల్పములు విసంవాద రహితమైన పూర్ణత యందేకమగును; ఏలన చేతనయు శక్తియును సత్ - పూరుషుని జమలిరూపులు, అతని

యధ్యాత్మ తత్త్వములందవి జంటపడవు. కాని యీ పరివర్తనము మనస్సు నతిక్రమించినఁగాని ఘటింపదు; ఏలన ఇది సాధింపఁబడఁగల సముచ్ఛ్రియము మన యిప్పటి చేతనయొక్క యెత్తునకు మిక్కిలి యావల; మన సాధారణ మానసమునకు పైనున్న ఊర్ధ్వచేతనమునందున్నది. కావున చైతన్యముయొక్క సహజభాసమైన విజ్ఞానములోనికే మనసు నతిక్రమించి పెరుగవలయును. అట్లయ్యును, ఈ గుహ్యమైన విజ్ఞానము మనయందే కలదు, మనకు వెలుపలఁగాదు. ఏవిధముగా నది జడముయొక్క నిశ్చేతనమునందు వ్యాపృతమై అందుండి మనసును నిర్మించినదో, అట్లే మనుష్యసత్త్వయందును, అది సంసిద్ధమైన తరుణమున, తన సహజములైన జ్యోతిర్వ్యాప్తులను వికసింపఁజేయును.

అబంధనము లేక స్వాతంత్ర్యము చైతన్యమునకు చెందినది. చైతన్య మన బంధరహితమైనసత్త, బంధరహితమైన జ్ఞానముయొక్క జ్యోతి, బంధరహితమైన శక్తి, సంకల్పము, బంధరహితమైన సత్త్వానందము. మనుష్యునకు తాను బద్ధుఁడై యున్నట్లును, ఈవస్తువులు తనవి కానట్లును తోఁచుచున్నది; లేక వీని నతఁ డేదో విధమున నెఱిఁగినను, వాని యాంశికభావమునకు మాత్రమే చేరు

చున్నాఁడు. అతఁడు తన పరిచ్ఛిన్నములైన మనఃప్రాణ శరీరములచే బద్ధుఁడగుచున్నట్లు కనఁబడుచున్నాఁడు; చుట్టునున్న యునికియందలి వేగములయొక్క తాకిడికి అతనియందు కలిగెడు బదులు రాకడలచే, అనఁగా ద్వంద్వములచే బద్ధుఁడగు చున్నట్లున్నాఁడు; అట్లే తన యహంతచే, తన యజ్ఞానముచే, తన యసామర్థ్యముచే, తనదుఃఖముచే బద్ధుఁడగుచున్నాఁడు; అతఁడధిగమింపఁగలిగిన సత్త ఆంశికమై, జ్ఞానము ఖండమును సందేహాపహతమునై, సామర్థ్యసాధకతలు పరిమితములై, మనఃప్రాణములందలి యానందము బాహ్యమును చంచలమునై తోఁచుచున్నవి. కాని యిది ప్రకృతిని నియమించెడు ముక్తచైతన్య మొకటియు ప్రకృతికి బద్ధమైన మానవాత్మ యొకటియునని రెండాత్మ లుండుట వలనఁ గాదు. మనుష్యునందు నిత్యచైతన్యము కలదు; ఎల్లపుడును బంధహీనము; తనస్వప్రవృత్తమైన స్వపరిణామముచే నతనియందు సతతమును తన్నుఁ దా నాపూర్ణము చేసికొనుచున్నది. ఏలన సర్వమును స్వసంవేది యగు సత్త; తన స్వశక్తిచేఁ బ్రవర్తించుచు, తన్నభివ్యక్తము చేసికొనునట్టిది; దాని బంధనములేని ఆత్మజ్ఞానసంకల్పములే దానివర్తనములయొక్క నియ

మము లేర్పఱచినవి. కాని చైతన్యముయొక్క బంధనము లేమి యను ఈ ఆంతరవాస్తవము తెరచాటున నిరోధింపఁబడియున్నది. అజ్ఞానముచే కప్పఁబడియున్నది; మఱియు ఈ అజ్ఞానముయొక్క మూలమును స్వభావమును పరిచ్ఛిన్నములైన మనఃప్రాణ శరీరములందు పైపైన మెలఁగుట. దైవము సచ్చిదానందము—అనంత సత్త, అనంతచేతన, అనంతశక్తి, అనంతానందము. మఱియు ఆనంత్యమన బంధనములేమి. అంతవంతమునందే చేతననునిల్పి జీవించుట యన పరిమితియందు అనఁగా బంధనమునందు జీవించుట: అంతవంతముగా పరిచ్ఛిన్నమైన చిత్సత్త అహంతను రావించును. అంతవంతమైన మనస్సు అజ్ఞానమును మోపును; అంతవంతమైన సంకల్ప మసామర్థ్యమును, అంతవంతమైన ప్రాణము దుఃఖమును, అంతవంతమైన శరీరము మృత్యువిలయములను అనివార్యము చేయుచున్నవి. కాని యిదంతయు పైపైనిది; జీవియొక్క బహిర్నిమగ్నతచే నిదంతయు సాగుచున్నది; ఈ నిమగ్నతయే మన వాస్తవసత్తను వెనుకనుంచి, ఆత్మవిస్మృతిని మొగదల రావించి, సాంత – అనంతములు మధ్య తెరను వాల్చుచున్నది. ఈ అజ్ఞనిమగ్నతనుండి మనము వెనుక

కొందిగి, మన స్వకీయమైన అనంత చిత్సత్తను, అందలి చేతనానందములను పుష్కలముగా తిరిగి పడయ వచ్చును, మనఃప్రాణశరీరముల బంధనములచే నంటఁ బడక లోన మెలఁగవచ్చును; కాని మనస్సును విజ్ఞానములోనికి పరివర్తనము చేయుటవలననే మనఃప్రాణ శరీరముల మానముల మార్పుఁగల చైతన్యశక్తిని గైకొని రాఁగలము. ఈ మార్పువలన, మనము బాహ్యముగా దేనియందు వర్తించుచున్నామో అట్టి ఈ అంతవంతము దివ్యసత్తను మిగుల మిగుల సజ్ఞానముగా నిరూపించు ప్రతినిధానము కాఁగలదు. ఈ విధమున ఈ మన ప్రాతిభాసిక బంధనమునందుండి మన స్వకీయమైన వాస్తవముక్తతలోని కారోహింపఁగలము. ఈ ముక్తికి రెండు రూపులు —- స్వాత్మసిద్ధమైన స్వాతంత్ర్యము, అఖండమైన స్వవశిత్వము, మఱియు ఐశ్వర్యము. అనఁగా స్వారాజ్య సామ్రాజ్యములు.

అమృతత్వమన ఈ అనంతమైన అధ్యాత్మ చేతనయందలి ధ్రువస్థితి, మన సత్తయొక్క అమృతత్వము స్వానుభూతియందు ఉపలబ్ధమగుట. మరణానంతరమున జీవి నిలిచియుండుట సంభూతియం దమృతత్వముయొక్క ఫలితము మాత్రము. ఈ రెండును మన స్వాభావము

నందలి శాశ్వతసత్యములు - ఒకటి కాలాతీతము, ఒకటి కాలమునం దాసత్యముయొక్క ప్రతిభాస. మనము జనన మరణము లనునవి, సంభూతియందలి మన మార్గమునకు రెండు ద్వారములు; వీనిద్వారమున ఉనికియొక్క ఇతరభూమికలనుండి సతతము మన మీ భౌమ జీవితమందుఁ బ్రవేశించి, ఇటనుండి మనయునికియొక్క ఇతర మండలములలోని వేఱొక స్థాయిలోనికి వెడలుచున్నాము. మనబంధనమునకు ముడియంతయు ఈ పునరావృత్తియే యనియు, దీనినుండి తప్పించుకొనుటయే ముక్తియొక్కయు, వాస్తవమైన అమృతత్వముయొక్కయు పూర్ణోద్దేశ్య మనియు పలువురచే తలఁపఁబడుచున్నది. కాని వాస్తవమైన అమృతత్వము వాస్తవమైన ముక్తివలెనే చేతనయం దొక మాఱుపు; శరీరగ్రహణముతోఁగాని, శరీరహానముతోఁగాని దానికేమియు సంబంధము లేదు. అనంతము లెక్కలేని శరీరములను, అంతవంతము లగు రూపములను గ్రహించియు, సతతమును ముక్తమై, అమృతమై యున్నది; ఈ సంభూతి, ఈ ప్రపంచములు ఈ జన్మగ్రహణము అతనికొక బంధనము కావు; ఏలన తనకాలాతీతమైన నిత్యసత్త నతఁ డెప్పుడును తెలిసియున్నాఁడు. అంతవంతము

యొక్క ఈ బహిర్వర్తియైన పరిచ్ఛేదక చేతనయందు మాత్రమే మనము మెలఁగుచుండుటచేత ఇవన్నియు బంధనములై తోఁచుచున్నవి. కాని యన్నిఁటియందుఁ గల చైతన్యము నిత్యమును, అమృతమును; తన సంభూతిరూపముల నది కాలగతమైన తన అభివ్యక్తిగా చూచుచున్నది. ఈ చేతనలోనికి చేరుటయే అమృతత్వము. అపుడు జన్మగ్రహణము ఆత్మయొక్క కాలికమైన అభివ్యక్తిమాత్ర మగును, — అంతవంతములైన మానములతో అనంతముయొక్క క్రీడ. మఱియు దాని ఆత్మజ్ఞానము కాలికమైన స్వపరిచ్ఛేదమం దిముడుట కొప్పుకొనుటయే అజ్ఞానము. ఆత్మయొక్క ముక్తత నదేమియును బంధింపఁజాలదు.

ఈ దివ్యత్వము నీజ్యోతిని, ఈ ముక్తత్వము నీ యమృతత్వమును జేరుటయున్న ఈ యహంతయొక్క ఇఱుకుచెఱను బదాబదలుచేసి బయటపడుట. మన యందలి దివ్యవ్యక్తియొక్క పరిచ్ఛిన్నమైన మానస వికారమే ఈ అహంత. మనసత్తను, అందలి చేతనానందములను మన మెంతకాలము దాని బాహ్యనిరూపణములును పరిచ్ఛేదకములు నైన మనఃప్రాణశరీరములతో ఏకీకరించి గ్రహింతుమో, అంతకాల మీ యహంత

సాగుచుండును. సత్త విశ్వాతీతమైన సచ్చిదానందము; తన స్వకీయ బహుత్వము ద్వారమున నతఁడు తనసత్త యందలి లోకము లనఁబడు ఈ వేర్వేఱు స్వరసమ్మేళనములలో తన్నుఁ దా ప్రస్తరించుకొనుచున్నాఁడు. సచ్చిదానందమునందలి ఈ సత్యమును దివ్యవ్యక్తి తన ప్రకృతియందు ప్రతిఫలింపఁజేయును, తనయాత్మయందు చేకొనియుంచును. కాని ఇది మన యిప్పటి ప్రకృతియందు మన స్వాత్మజ్ఞానమునుండి వేఱుపడి యుండుటచే మఱుఁగుపడి యున్నది. ఈ యేర్పడిన అజ్ఞానమునందు మనచేతన తనకుఁ దాఁ జేసికొన్న స్వనిరూపణ మీ అహంత. అహంతయందు మనము వర్తించునంత కాలము భగవంతునందలి మనసత్తయొక్క సత్యము మన కందదు. ఇపుడు మనము మెలఁగెడు అహంతా నిర్మాణములోనుండి మన యంతర్జీవితమును పైకెత్తవలయును, అతిసర్వమైన భగవత్సత్తతోడి ఐక్యముననున్న దివ్యవ్యక్తితో మన మొక్కటి గావలయును. ఆ వ్యక్తి తన అతీతైక్యమువలన సర్వముతోడను ఏకసత్త ననుభవించుచున్నాఁడు, సర్వభావమును బడయుచున్నాఁడు, సర్వభూతుఁ డగుచున్నాఁడు; మన ఇప్పటి యనుభవమునందు మనవలె, తనసత్తలో నేతావునందేని

సర్వమునుండి విడివడి గాని, దానితోవిరోధమునఁ గాని లేదు; విశ్వసామంజస్యమున కంతకును అతఁ డొక కేంద్రము, మఱియు అఖండాధారము. మనస్సుయొక్క తాత్కాలికములైన మిగిలిన సకలభ్రమలందువలె, అహంతయందును ఒకసత్యము కలదు; అది దివ్య వ్యక్తియొక్క సత్యము, అనేకమునం దేకముయొక్క ఆత్మప్రకటన — దీనిపరిచ్ఛేదకమైన ఆకృతి మాత్రమే అయథార్థము. కావున అమృతత్వ - ముక్తత్వములకు వలసినది, సత్తయొక్క సర్వభావమునందు వ్యక్తి రూపఱుట కాదు, ఒకానొక అనిర్దేశ్యసత్తయందు విలయ మగుట కాదు; వలసినది, సచ్చిదానందమును తన యందుఁ బడసి విశ్వమునం దభివ్యక్తము చేయుట. కాని మనోభూమికపై దీనిని పరిపూర్ణతయందు సాధించుట పూర్తిగా సాధ్యముకాదు. ఏలన భేదము నొత్తుకొని యుండుట మనసుయొక్క నైజము; ఈ భేదశక్తియొక్క ఆలంబము దానినుండి తొలఁగింపఁబడెనేని, అనిర్దేశ్య మగు ఏకత్వమునం దది తన్ముఁదాఁ గోల్పోయి న ట్లగును. కాని ఏకముయొక్క సత్తను అనేకమునం దతని బహుప్రకారమైన వర్తనముతో కలిపెడు నిత్యమగు లంకె విజ్ఞానము. కావున అతిమనస్కమైన విజ్ఞానము

యొక్క జ్యోతియందు వర్తించు భగవద్గతుఁడును, సమష్టిభూతుఁడును అగు వ్యక్తియగుటయే అధ్యాత్మ సంసిద్ధికి పునాది. మఱియు ఇదియే "ఋతస్య బుధ్నమ్" అని వేదఋషులు తెలిపిన ఋతముయొక్క పునాది.

కాని మానసికమైన అజ్ఞానమును వీడి యీ జ్ఞానమునందు వర్తించుటయు, మన వాస్తవసత్తయగు ఈ విపులమైన భాస్వరమైన యునికిని బడయుటయు ననఁగా, మనజీవితముయొక్క అన్నిమానములను ప్రార్ణముగా మార్చివేయుట, చైతన్యమునకును తత్ప్రకృతియందలి అంగములకును ఒక నవీనమును వాస్తవమునైన సామంజస్యమును వికసింపఁజేయుట. అట్టి సామంజస్యము మన కిప్పు డందుటలేదు; లేదా, దాని రమారమి రూపములను ఛాయగా, ఆంశికముగా, హఠాద్భాసయం దందుకొనుచున్నాము. కాని యివియును, మనము సత్యముకడకు సమీపతరముగా నారోహించినపుడు, అందలి సామంజస్యమునకు సుదూరములైన మలినప్రతిబింబములై, దాని యర్థమున కపగోపనములై, దాని జ్యోతిర్మాత్రకకు అపానువాదములై తోఁచును. మఱియు అజ్ఞానమును వీడి జ్ఞానమునందు వర్తించుట యనఁ మన సత్తయొక్క మహత్తరసత్యమందు వర్తించుట. ఇయ్యది

యథార్థమైన ఆత్మజ్ఞానమును గైకొని వచ్చును, ఈ జ్ఞానమునందలి ప్రతికిరణమును ఆత్మయొక్క ప్రకాశము; ఇయ్యది మనసత్తయందలి సమ్యక్-శక్తిని గైకొని వచ్చును, దీని ప్రతికార్యమును ఒకనిరవద్యమైనసృష్టి; ఇయ్యది మనసత్తయొక్క సమ్యగానందమును గైకొని వచ్చును, దీని ప్రతిస్పందమును స్వప్రతిష్ఠితమైన ఆహ్లాదముయొక్క పవిత్ర తరంగము. మనము తప్పిదము, పాతకము, విసంవాదము, దుఃఖము అను వానికంతకును మూలము పరిచ్ఛేదకమైన మనస్సుయొక్క అయథార్థము. సత్తయొక్క వాస్తవమునందు వర్తించుటయన జ్ఞానజ్యోతులందును సామంజస్యానందములందును వర్తించుట; మన అహంతయందు మనకొఱకు జీవించుట కాదు, మనయందలి భగవంతునికొఱకు జీవించుట, మనుష్యునందలి భగవంతునికొఱకు జీవించుట, మఱియు విశ్వాంతరమైన అద్వయచైతన్యముయొక్క అఖండ సామంజస్యమునందు జీవించుట. విశ్వసత్తయందీ భౌతిక-ప్రాణిక-మానసిక వృత్తి బాహ్యమైనది, ఆంశికమైనది. మన జీవనవిధానము దీనిని ప్రధానము చేసికొని, దీనిని మీఁదు మిక్కిలి ఊఁతచేసికొని అయథార్థ మగుచున్నది. ఈ ఊఁతయు ఈ ప్రాధాన్యమును ఈ విసంవా

దములైన స్వరములను సృష్టించుచున్నవి. ఇటు కాక ఈవృత్తికి సరియయిన స్థానము నిచ్చితిమేని, దీనిని దీని మూలతాత్పర్యమున కధీనము చేసితిమేని, అప్పు డిది అధ్యాత్మసంగీతియందు ఒక యావృత్తియై పొసఁగఁ గలదు. కాని యీవిసంవాదములు చాల కాలము నుండియు నిలిచియున్నవను కారణముచే అధికతరమును ఆంతరము నగు అవిసంవాదము బయల్పడుట కవకాశము లేదనరాదు. మనము దేనిని ఆదర్శము — గమ్యముగా భావితము — (ideal) అనుచున్నామో, చాటున దానియందా అవిసంవాదముయొక్క ఉద్దేశ్యమును సత్యమును నిలిచియున్నవి. మఱియు ఈ భావితమైన ఆదర్శము సృష్టింపఁబడవలసిన అసత్తుకాదు; మన యిప్పటి యథాస్థితికంటె నది మహత్తరమైన సత్యము; ఇపుడున్నస్థితి ఆ భావితముకొఱకై నెమకుయత్నము, తడవులాట. ఈ భావితమునందలి సమగ్రత మనపైపైని చేతనయందు, మన బాహ్యజీవనమునందు అయథార్థమును వికృతము నగుచున్నది; అచట నది సరిచేయఁ బడవలయును. భ్రమావద్యముల క్షేత్రమునందే సత్యము కనుఁగొనఁబడవలయును. పరిపూర్ణత సాధింపఁబడవల యును. ఇదిచేయుటకు మనసత్తయొక్క మహత్తరసత్య

మును మన మెఱుఁగవలయును, మన మానవ స్వభా వమునందును మన బాహ్యజీవనమునందును దానిని క్రియయందు నెఱవేర్ప వలయును.

ఈ ఆత్మోపలబ్ధియును, ఈస్వభావ పరివర్తనమును మన యిప్పటి యథాస్థితి కెంతోదూరముగా నున్నట్లు మొదట గోచరించును; మంతయగు మనుష్యుని విచార శీలమైన మదికిఁగూడ, మఱియు నంతకంటె నధికముగా, పశుసమానుఁడగు మనుష్యుని స్థూలదృష్టియైన మదికిని, ఇయ్యవి మననైజమున కసాధ్యములని గాని, లేక అంత కష్టమగుటచే, అంత దవ్వుల నుండుటచే కార్యికముగా అసాధ్యకల్పములని గాని తోఁచఁగలవు. కాని యీ పరి వర్తన మసాధ్యము కాదు; పైఁ జూపిన విధమున ఉనికి యొక్కయు, మనయునికియొక్కయు స్వభావము ననుస రించి యిది అనివార్యమైన ఫలితము. ముఖ్యముగా ఇది మనుష్యున కసాధ్యము గాదు; ఏలన భూమిపైనున్న జీవులందఱందు స్వచేతనను నింపుచున్నట్టియు, ఈ రహ స్యముయొక్క అంచును సమీపించుచున్నట్టియు జీవి. తన ప్రకృతియొక్క ఒకభాగమునందు, తన అధరమాన వత్వమునందఱందు తన అపరిపూర్ణతకు సతతమును బందియైయున్నను, తన ప్రకృతియొక్క వేఱొకభాగము

శ్రీ అరవిందాశ్రమ గ్రంథాలయము,
తేలప్రోలు.

నందు, తన ఉత్తర మానవత్వమునం దతఁడు నిరంతర మును పరిపూర్ణత కభిముఖుఁడై పోవుయాత్రికుఁడు — తన అపరప్రకృతియం దతఁడు బందియైయుండుటయు అనతిక్రమణీయమైన విధిచే ననుటకంటె తనవలననే యనుట యెక్కువ నిజము. తన యందలి ఉత్తమాంశ సర్వమును, పరిణామప్రేరణచే ఉపచితవేగమై కాలక్రమమున నేది తనయందు బలిష్ఠము కావలసియున్నదో అదంతయును ఒక అన్యూనమైన పరిపూర్ణతను, ఒక వాస్తవమైన యునికిని, ఒక దివ్యమైన జీవితమును కాంక్షించుచున్నది, వీనికేసి నడచుచున్నది. అతని బుద్ధి సత్త యంతయును ఒక సమగ్రమైన పూర్ణసత్యమునకై వెదకుచున్నది. అతని ధర్మసత్తయంతయు ఒక దివ్య స్వభావముకొఱకై, ఆదర్శజీవితముకొఱకై వెదకుచున్నది, అతని రససత్తయంతయు ఒక విశ్వవ్యాపియైన అఖండసౌందర్యము నన్వేషించుచున్నది; అతని హృదయిక సత్తయందు శ్రేష్ఠమయిన దంతయు ప్రేమ-ఆనంద-ఐక్యములకొఱకు తడవులాడుచున్నది, తన సంపూర్ణ తృప్తికి మార్గము వానిని బడయుటయే తెలిసికొను చున్నది. మఱియు బాహ్యమును క్రియాత్మకమును అగు అతనిప్రాణసత్తయు ఇప్పటికంటె విపులతరములును, నిర్దుష్ట

తరములును, అధికతరసామంజస్యము కలట్టివియును అగు వ్యష్టిసమష్టి జీవితములను సాధింపవలెనని ఆభాసగా గ్రహించుచున్నది. మార్గమును మఱియు మార్గము నంతయును కనుఁగొనుటయు, మఱియు కనుఁగొనుటంతె, దానిమీఁద సమగ్రముగా శ్రద్ధావిశ్వాసములతో నడచి నెఱవేఱఁగల్గుటయు అతని ప్రయాస. కాని అతనియందు భక్తిజీవిన్మైన ఒకయంశము—తనప్రకృతియొక్క అధ్యాత్మశక్తి — యెల్లప్పుడును కలదు; ఈ కనుఁగొనుట నెఱవేఱికలకు వలసిన శ్రద్ధాసంకల్పములు క్రమముగా వృద్ధిచేయు సామర్థ్యమును, కడ కా కనుఁగొనుట నెఱవేఱికల నందఁజేయు రహస్యమును ఆ అంశమందుఁ గలవు.

ప్రయాస కలదు; దీనికి కారణము మనుష్యసత్త యొక్క అంశశబలతయు, ఆనంత్యమును. ఇయ్యవి అఖండ బింబమైన పరిపూర్ణతకు మూలమయ్యును, దారినుండి తొలఁగిపోవుటకుఁ గూడ అవకాశముల ననేకము కల్పించుచున్నవి. కాని కడ కీప్రయాసహేతువు లన్నియును అపకారకములైన రెండు ప్రవణతల క్రింద సంగ్రహింపవచ్చును. ఒకటి మనుష్యుని అవరప్రకృతికి సంబంధించినది, తా నిదివఱకు గడచినట్టియు, ఇప్పటికిని

తన కొంతభాగముతో నిలిచియున్నట్టియు స్థితివైపున కొక క్రీఁడల యాకర్షణ; రెండవది అతని ఉత్తర ప్రకృతి యందలిది, తాను సాధించిన దానియందు తగు పాటికంటె నధికమైన ఆసంగము, ఆంశికమైన అవాప్తి యందు సంతృప్తి. మార్గసుఖములు యాత్రయందు పాథేయములై, పథికునిబలమున కవలంబములై యున్నంతవఱకును ఉపయోగకరము లగును; కాని తగని సక్తితో పరివ్యక్తములై గమ్యముయొక్క ఉత్తమ జ్యోతిని చేరనీయక అతనిని వెనుక నాపి పట్టుకొనును. నిరంతరము పై కొత్తుకొనిపోవుచు ఉత్తరభూమికలఁ జేరుటకై పిలువఁబడిన యాత్రికునిగా తన్నుఁ దా నెఱుఁగుటయు, సతతమైన సంభూతియు స్వాతిక్రమణ మును తనజీవితముయొక్క సూత్రమని, మఱియు నందలి ప్రతిదశయు దానికంటె నధికతరమైన ఉత్తరదశ నీనుటకై కలదని ఎఱుఁగుటయు మనుష్యునందు భగవద్వరణము యొక్క చిహ్నం. సతతోర్ధ్వముఖమైన ఇచ్ఛయే అతని యథార్థవీరత్వము, అతని యథార్థమహత్త్వము, అతని అగ్రగణ్యమును, అరూక్షమును, కుశలము నైన తాపసీ కత్వము. తనమార్గముయొక్కయు, గమ్యముయొక్కయు ఉచ్ఛ్రియ వైపుల్యములను అధికాధికముగా గ్రహించు

కొఱకై బహువిధ సంచారము కలదియు, సతతాధిరోహిణియు నగు జ్ఞానశక్తి యతనికి ప్రసాదింపఁబడినది; మఱింత మఱింత అదమ్యమయిన పెనఁకువతో వాని ననుసరించుకొఱకై ఇచ్ఛాశక్తియు, అనంతమయిన ఉత్కాంక్షయు అతని కీయఁబడినవి. అతనియందలి చైతన్యము తనవిశ్వవ్యాపిమైన ఆనందముచే, అతని చేతనయందు క్రమముగా వివృద్ధమగు తనవిరివిచే, తన ఇచ్ఛాసామర్థ్యముల అంతులేని పెన్నిధులచే, తన అనంతసత్తయొక్క సర్వవిస్తృతిచే అతని కవలంబమగును. చైతన్యమును మఱుఁగుపఱచు తెరల నతఁడు చించివైచినపుడు, భగవంతుని దర్శించి తన బాహ్యప్రకృతిని లోని భగవత్సత్త కధీనము చేసినపుడు, ఏదియిపు డసాధ్యమో సందిగ్ధమో అదియే అతనికి సాధ్యమైన ఏకసాధనీయమై, అదియే అతనికి ప్రాప్యమైయున్న నిత్యరూఢిమై వెల్లడియగును; అవిస్పష్టమును, ప్రయాసకరమును అయిన అతనిప్రయాణ మపుడు సుశీఘ్రమును జ్యోతిర్మయమునైన ఆరోహణము కాఁగలదు. ఈ కనఁబడు రూపునందలి మానవునియొక్క పరిపూర్ణత కతఁడపుడు చేరును; కలరూపునందలి మానవుని దర్శనోప

లబ్ధుల నతఁ డపుడు పడయును. ఇదియే అతిమానవత్త్వము యొక్క తాత్పర్యము.

---

# కొన్నిపదములకర్థ వివరణ

అంతర్నిహితి
అంతర్హితి } :—అంతర్నిహితత్వము; అంతర్హితత్వము: లోపల సూక్ష్మదశయం దిమిడియుండుట; అభివ్యక్తికి పూర్వము అవశ్యంభావియై యుండవలసిన స్థితి – దీనిని తెలుపుటకై ఈ రూపములు ప్రత్యేకముగాఁ గైకొనఁబడినవి: Involution.

అగ్రహణ:—నియతవిషయములై ఏర్పడిన ఇంద్రియముల వలనఁ గలుగు గ్రాహకత లేకపోవుట: Insensibility.

అతి మానవత్వము:— మానవుఁడు మనోమయుఁడగుటచే అతని స్వభావమును స్వధర్మమును మనోభూమికయందలి వ్యవస్థచే నియతము లగుచున్నవి; మనోభూమికకంటె పైనిదగు విజ్ఞాన భూమికను చేరి మానవుఁడు తన స్వభావ స్వధర్మములను విజ్ఞాన భూమిక యందలి వ్యవస్థ కనుకూలముగా మార్పఁగలఁడు; అట్టిమానవుని స్థితి అతి మానవత్వము: Supermanhood.

అతీతము :—విశ్వకారణమైన చైతన్యము విశ్వము నతిక్రమించియున్న ఉనుకువ; విశ్వాతీతము, దేశ కాలాతీతము అను టకు సంక్షేపరూపము: Transcendental.

అధ్యాత్మము:—ఆత్మయొక్క స్వభావమునకు సంబంధించినది :, Spiritual.

అధ్యాత్మ చేతన:—ఆత్మయందలి చేతన; ప్రకృతి యొక్క రూపులైన ప్రాణము మనస్సు మొదలగు వానియందలి చేతన కంటె భిన్నము: Spiritual Consciousness.

అధ్యాత్మ సత్త:—ఆత్మయొక్క యునికి, ప్రకృతిచే ఆక్రమింపఁబడనిది: Spiritual Being.

అపావృతి:— ఆవరణమును తొలఁగించుట; మూతను తెఱచుట.

అభివ్యక్తి:—అగపడునట్లు వెలిచేయుట; 'శక్తి' రూపమున, అనఁగా బీజదశయందవిభావితమై యున్నట్టిది విశదముగా వ్యక్తమగుట: Expression, Manifestation.

అభ్యూహ:—ఒక సందర్భమును సమర్థించుటకు వీలుగా నిలిపిన యూహ: Assumption.

అవయవి:—అవయవములు లేక భాగములు కలట్టిది—జడద్రవ్యమైనను, జీవసత్త్వమైనను. శాస్త్రవ్యవహార మిట్లే యైనను, మామూలు వాడుకయందవయవి జీవసత్త్వమునే స్ఫురింపఁ జేయునట్లున్నది. ఇచట ముఖ్యముగా ఈ అర్థముననే వాడఁబడినది: Organism.

అవరము:— పరముకానిది, క్రిందిది, తక్కువది: Lower; inferior.

అవిసంవాదము:—పరస్పరము మేళవింపఁబడి యుండుట: Harmony (చూ. విసంవాదము).

ఆంశికము:—అంశమునకు, అనఁగా ఒకానొక భాగమునకు లేక ఖండమునకు సంబంధించినది; కృత్స్నముకానిది: Partial.

ఆకారించు:—ఒకానొక ఆకృతి కలదానినిగా చేయు: to shape.

ఆత్మసత్త:—ప్రకృతిబద్ధమగు లేక ప్రాకృతమగు సత్త కానట్టిది: Soul - being.

ఆత్యంతికము:—కట్టకడపటిదాక నుండెడునట్టిది; తుదిలేనిది; కేవలము: Everlasting; endless; absolute.

ఆనందించు:—మామూలు వాడుక యందాధారము కలదని ఇది రెండుమూడు తావుల సకర్మకముగా వాడఁబడినది.

ఆవిష్కారము:—వ్యక్తమగునట్లు చేయుట; అభివ్యక్తమగుట; వెలిపుచ్చుకొనుట: Manifestation.

ఈశిత:—ఇచ్ఛానుసారము శాసింపఁగల శక్తి.

ఉచ్ఛ్రియము }
ఉచ్ఛ్రాయము } :—గొప్ప యున్నతి, వృద్ధి, తీవ్రత.
Height; intensity.

ఉనుకువ:—ఉండుట; ఉండుటయొక్క తీరు: Mode of being.

ఉపరిగతము:—పై భాగమున కలట్టిది: Superficial.

ఉపరి మర్త్యము :—మర్త్యులను మించి ఊర్ధ్వమున నున్నట్టిది;—ఈమాట ఋగ్వేదమునందుండి గైకొనఁబడినది.

ఉపలబ్ధి :—జ్ఞానముచే పడయుట; అనుభవమందలి ప్రాప్తి: Realisation.

ఋతము :—వేదమునందు ఋతమునకును సత్యమునకును ప్రభేదము కలదు. సత్యము సత్తకుఁజెందిన నిజము; దానిని సృష్టించు దివ్య చితియందలి ప్రవృత్తికిఁజెందిన నిజము ఋతము. ఋతమునందు దేవతల జన్మ; వారి యొుుక ఋతము; ఋతముచే వారు సత్యమును ప్రతిష్ఠింతురు. ఈ క్రింది ప్రయోగములను పరిశీలింపఁ దగును. 'ఋతాత్ సత్య ముపాగాత్'; 'ఋత జాత సత్యాః'; 'ఋత ధీతయః సత్యధర్మాణః';—'ఋతమునుండి సత్యము వెడలినది'; 'ఋతమున ప్రభవించిన సత్యస్వరూపులు'; 'ఋతమును తమ భావమున ధరించి సత్యమునకు ధారకులగు వారు'.

కార్యికము :—కార్యమునకు, లేక కార్యదృష్టికి సంబంధించినది: Practical; Pragmatic.

కృత్స్నము :— సమస్తము, సకలము: Whole, Integral.

క్రమితము :—అనుక్రమము కలట్టిది, ఒకదాని తరువాత నొకటిగా ఒకక్రమము ననుసరించి జరుగునది: Gradual.

క్రమిత సంభూతి :— పరిణామముయొక్క క్రమము ననుసరించి ఒక యునుకువనుండి వేఱొక యునుకువకు మాఱుట: Evolutionary becoming.

క్లిష్టము :—క్లేశము కలిగించు విషయము; స్వవ్యాఘాతముగాఁ దోచు సందర్భము: Difficult Problem; Inconsistency, Contradiction ('మాతా మేవంధ్యా'—అనునది 'క్లిష్ట' మనఁబడుచున్నది.)

చిత్సత్త :—చిన్మయమగు సత్త: Conscious-Being.

చేతన :—గ్రహించు శక్తి: Consciousness.

చైతన్యము :—సచ్చిదానందాత్మకమగు పరమతత్త్వము: Spirit

తత్త్వము :—నిజమగు స్వభావము; సత్యము; మూల పదార్థము: Reality; Principle.

తాదాత్మ్యము :—ఒకదానిఆత్మగాఅగుట: Identity.

ధాతువు :—(౧) ఏదేని పదార్థమునకు ధారకమైన మూలాంశము, మూలద్రవ్యము, తత్త్వము : Element; Principle. చూ. పృథ్వీ ధాతువు, తేజో ధాతువు; (The earth element, The light element); లేక 'భూతధాతువు', 'ప్రాణధాతువు' (The Principle of Matter, the principle of Life).

(౨) శరీరమందలి ప్రాణకార్యములను ప్రవర్తింపఁజేయు సూక్ష్మతంతువులు : Nerves.

నిమగ్న చేతనము :—బైటి కేమియు కానరానట్లు పూర్తిగా మునిగియున్న చేతన కలట్టిది.

నిరుపాధికము:—దగ్గఱ లేక మీద నుంపఁబడినట్టిది 'ఉపాధి'; అనఁగా పరిమితము చేయునట్టిది. ఆత్మవిషయమున దేశ కాలములు లేక శరీర మనఃప్రాణములు లోనగునవి ఉపాధు లనఁబడు చున్నవి. కావున వీనిచే పరిమితము చేయఁబడ నట్టిది, లేక బంధింపఁ బడ నట్టిది నిరుపాధికము : Unconditioned, not limited.

నిలుకు:—నిలిచియుండుట, నిలిచియుంట యొక్క తీరు; ఏదేని ఆధారముపై ఒకానొకయవలంబముతో నిలిచియున్న చందము; పృథక్త్వ బీజమగు 'నేను' అను ఆధారముపై భేదజ్ఞానమున వర్తించు మానసికదృష్టి అవలంబముగా మన యిప్పటి నిలుకు : Poise.

నిశ్చేతనము:—చేతన లేనట్టిది: Inconscient.

పరము :—అవరము గానిది; పైది; హెచ్చైనది; Higher; Superior.

పురుష తంత్రము:—పురుషుని ఇచ్ఛపై అధీనపడినట్టి : Depending upon the Subject. (చూ. వస్తుతంత్రము)

ప్రతినివిష్టత:—మూర్ఖపు పట్టు: Obstinacy, recalcitrance,

ప్రతిపత్తి:—గ్రహణ, గ్రహణయం దేర్పడిన భావము : Perception, notion.

ప్రతిభాస:—అగపడుట,—కాని ఆ కారణము చేత నే అసత్యమనికాదు: Appearance.

ప్రతియోగి:—విరోధి ధర్మము కలట్టిది-చీకటికి వెలుగు, భావమున కభావము ప్రతియోగి : Opposite, Contrary.

ప్రతిస్పందము:—బాహ్యస్పర్శచే ప్రాణి శరీరమునం గలుగు విక్రియ, వెలి తాకిడికి జవా బనఁదగు చేష్ట : Response. ఇయ్యది ప్రాణముయొక్క విశిష్ట లక్షణముగా గ్రహింపఁబడు చున్నది. (చూ. శ్రీ అరవింద దర్శనము. 9 పుట. మొదటి పాద సూచి.) వ్యవహారమునకు జడమునకును ప్రాణికిని, ప్రాణమునకును చేతనకును భేదము కొంత విశదమే అయ్యును, పరీక్షకుని శాస్త్ర దృష్టి వీనిమధ్య సరిహద్దుగీతల నెచట గీయవలయునో ఎఱుఁగకున్నది. చేతన లేనట్లు కాన్పించు తరు లతాదులయందును చేతన కలదు— "అంత స్సంజ్ఞా భవం త్యేతే తరుగుల్మలతా దయః" ఏదో ఒక దశలోనున్న చేతనలేని ప్రాణ ముండదు; ఏలన కడకు, "ఏది ప్రాణమో అదియే ప్రజ్ఞ, ఏది ప్రజ్ఞయో అదియే ప్రాణము"— "యోవై ప్రాణః సా ప్రజ్ఞా, యావై ప్రజ్ఞాస ప్రాణః". మఱియు జడములుగాఁ దోచు లోహాదులందును ప్రాణలక్షణమగు ప్రతిస్పందము. శ్రీ జగదీశ చంద్ర వసువుచే లక్షింపబడినది.

ప్రతీతి:—ఎఱుకయందు గోచరించుట : Apprehension

ప్రత్యావర్తనము:—తిరుగుట, మఱలుట; బాహ్య విషయములయందు సంచరించుట మాని మనస్సు తన మూలము నెఱుఁగుటకై లోనికి చొచ్చుట.

ప్రాణవాదము:—ప్రాణమే పరమ తత్త్వ మనువాదము. లేక ప్రాణము భౌతికతత్త్వములకంటె విశిష్టమనువాదము Vitalism;

భాగవత జీవితము:—దివ్య జీవితము; దేవత్వజన్మమును బడసి దివ్యములగు జ్ఞాన కర్మల కాధారమైన మనుష్యునియొక్క జీవితము.

భూతధాతువు:—పృథివ్యాది భూతములతోఁడి నిర్మింపఁ బడిన లేక పృథివ్యాది భూతములకుఁ జెందిన పదార్థము గల ధాతువు: Material Principle. ఈ ప్రయోగములు చూచునది:—భూతేంద్రియములు = భూతములతో నిర్మింపఁబడిన పదార్థము గల ఇంద్రియములు — చేతన ధాతువుతో నిర్మింపఁబడినవి కావనుట. భూతాకాశము=The Physical sky, దహరాకాశము=The subtle sky.

భౌతిక వాదము:—భూత ధాతువులే పరమ తత్త్వమను వాదము: Materialism.

మానుష్యకము:—మానవ స్వభావము; మానవజాతి: Humanity; The human race.

వస్తు తంత్రము:—'విషయము' (Object) పై అధీనపడి యున్నట్టిది కాని విషయి (Subject) పై అధీనపడి యున్నట్టిది కాదు; దీని యర్థము శంకరుల ఈ వాక్యముచే సుబోధ మగును: "వస్తు తంత్ర మగుటచే సరియగు జ్ఞానమున కొకటే రూపము. ఏకరూపమున ఏ అర్థము నిలిచియుండునో అదియే పరమార్థము. లోకమున దాని విషయమగు జ్ఞానము సరియగు జ్ఞానమని చెప్పఁబడును. ఇట్టి జ్ఞానము నకుదృష్టాంతము,"అగ్ని వేడిమికలది యనుట". కావున సమ్యగ్ జ్ఞానము వస్తు తంత్రముగాని పురుష తంత్రముకాదు; అనఁగా అది వస్తుధర్మ

ముపై అధీనపడియున్నది. మనుష్యుఁ డిచ్ఛగించియు అగ్ని చల్లనిది అని భావింపఁజాలఁడు.

విజ్ఞానము :—మనోభూమికకు పైఁగల భూమిక: Supermind. చూ. ప్రవేశిక నిపాదసూచి, మఱియు దర్శనము ౨౫ పుట.

విశ్వ చేతన :—విశ్వ పురుషుఁడు లేక విశ్వ సత్త లేక సర్వాత్మ ( All-soul ) యొక్క చేతన: Consciousness of the cosmic Being or Cosmic Soul, Cosmic Consciousness. (చూ. సమష్టి, వ్యష్టి; సమస్తము, వ్యస్తము)

విసంవాదము :—ఒకదానితో నొకటి భేదించి పొసఁగకుండుట, విరోధము, అసామంజస్యము: Dis - harmony. ఇది లేకపోవుట అ - విసంవాదము : Harmony.

వ్యవస్థ :—కార్య కారణ సంబంధాత్మకముగా నియతమై యున్న ఏర్పాటు: Law. ఉదా. ప్రకృతియొక్క వ్యవస్థ: Law of Nature. మఱియు నడవడిని శాసించునట్టిదియు వ్యవస్థ. ఉదా. సంఘవ్యవస్థ; Social law.

వ్యష్టి } వ్యస్తము } :—సర్వాత్మకు శరీరమైన విశ్వమంతయు సమష్టి. అందు ప్రతిదియు వేర్వేఱుగా వ్యష్టి. సమష్టి, వ్యష్టులకే సమస్త వ్యస్తములు ( Universal and individual ) పర్యాయములు.

వ్యూహము :—అవయవముల లేక భాగములయొక్క కూర్పు, సంనివేశము : Structure, formulation, organization.

శక్తి :—కారణమున కార్యాభివ్యక్తియొక్క సామర్థ్యము: Potentiality.

సంభూతి :—సత్తయొక్క పరిణామము, అగుట, భావమునుండి భావాంతరమునకు మాఱుట: Becoming.

సంహతకార్యము :—అనేక కారణముల కూడికచే కలిగిన ఫలితము.

సంరాట్త్వము :—సామ్రాజ్యము: తనలోకముపై ఆధిపత్యము.

సత్త:—పరిణామముయొక్క ప్రకారములనుండి విడిపఱచి గ్రహింపఁబడు నునికి, తత్త్వము (చూ. సంభూతి.) Existence.

స్వతః స్ఫురణము :—ఇంద్రియ ప్రణాళికచేఁ గాక లోన తనంతట తా స్ఫురించెడు జ్ఞానము. ఇది ఊహకాదు, మఱియు కుశలమగు బుద్ధి తన ఆశుగతివలన నిగమన క్రమము నెఱుఁగకయే నిగమమును(Conclusion)చేరుటగాదు. ఇది పై భూమికయందలి ప్రత్యక్షజ్ఞానమునకు మనోభూమికయందలి క్రిందిరూపు; ఇది స్వతః ప్రతీతి, అంతర్జ్ఞానము, స్వతోభానము, లేక స్ఫురణము అను పేరులచే వ్యవహరింపబడినది: Intuition.

స్వారాట్త్వము :—స్వారాజ్యము: తనపై సంపూర్ణమైన వశిత్వము.

## కొన్ని పదముల కర్థ వివరణ

స్వ సంభూతి :—తనచే తనయందు నిర్వహింపఁబడు పరిణామ క్రమము: Self - becoming.

స్వాతి క్రాంతి :—తన్నుఁ దా నతిక్రమించి పోవుట. Self-transcendence.

స్వానువాదము :—తన్నుఁ దా ననువదించుకొనుట, తన స్వరూప యథార్థము నొక ప్రకారమునందు ప్రకటించుకొనుట.



---

# స వ ర ణ

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨ | ౧౫ | ఋజువు | రుజువు |
| ౯ | ౧౭ | స్పందము | ప్రతిస్పందము |
| ౧౧ | ౧౪ | దినిని లుకు | దీని నిలుకు |
| ౧౬ | ౧౧ | ...మగును కాని, | ...మగును. కాని |
| ౨౦ | ౧౨ | అగుయుగపదను | లను యుగపదను |
| | | భూతిచే చేరుపుట | భూతిచే చేరుట |
| ౨౫ | ౪ | ...నందు పరివర్తి | ...నం దుపరివర్తి |
| ౩౩ | ౧,౨ | (ఈపంక్తులను వదలవలయును) | |
| ౩౫ | ౨ | మనమున తప్పి | మనము తప్పిన |
| ౩౯ | ౨ | పరబ్రహ్మము | పరబ్రహ్మము. |
| ౬౯ | ౪ | తొందఱ | తొందర |
| ౮౩ | ౯ | అర్ధ | అర్థ |
| ౫౧ | ౧౫ | ప్రకృతిలో; | ప్రకృతిలో |
| ౧౧౮ | ౧౯ | ఒరఁగ | ఒరగ |
| ౧౨౪ | ౧౯ | అనివార్యయై | అనివార్యమై |
| ౧౨౭ | ౧ | చేతదే | చేతనే |
| ౧౩౨ | ౧౯ | మధ్యతెరను | మధ్య తెరను |
| ౧౪౨ | ౧౫ | ...బడయుటయే | ...బడయుటయే అని |

---



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPWA 102 B 172 |
| పుస్తకం పేరు | (శ్రీ [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 227 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | 2, 4, 5, BCI, 90 |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |